తల్లులారా, సోదరీమణులారా
యీ సంఘ బంధమునుండి వేలై
స్వేచ్ఛ సుఖముకొరకు జీవితములో
మీ పురుషులతో చేరి!



యి సందేశమును ప్రతిధ్వ చిత్రము

# “కల్పన

వందలకొలది క్రొత్త నటులతో

ప్రొడ్యూసర్, డైరెక్టర్: ఉదయ్.
అసోసియేట్ ప్రొడ్యూసర్, మ్యూజిక్ డైరెక్టరు విష్ణుదాస్ షిరాలి.
అసోసియేట్ డైరెక్టరు: పి. వై. అల్టేకార్, ఫి: కే. రామనాథ్.
సౌండ్, ఆడియోగ్రఫీ: సి. యి. బిగ్స్, ఆర్ట్: ఏ. కే. శేఖర్.
స్టేజ్ అండ్ స్క్రీన్ ప్రజంటేషన్సు, స్టూ జెమిని, మద్రాసు.

# భారతి ఇరువదినాల్గవ సంపుటము, భా-౧

## అకారాది విషయ సూచిక


| | సం. | పుట. |
|---|---|---|
| అంకితము—సుందరాచారిగారు (గే) ... | ౫ | ౪౯౪ |
| అనంతామాత్యుని అమృతశైలి—బులుసు వెంకటేశ్వర్లుగారు ... | ౬ | ౫౧౭–౫౨౧ |
| అభిసారిక—చెరుకుపల్లి జమదగ్నిశర్మగారు (ప) ... | ౩ | ౨౫౧–౨౫౨ |
| అభ్యుదయ రచయితల సంఘం: నవ్యసాహిత్యరంగం—మల్లవరపు విశ్వేశ్వరశాస్త్రిగారు | ౨ | ౧౮౭–౧౮౯ |
| అశాంతి—సుందరాచారిగారు (ప) ... | ౧ | ౭౨ |
| అహంభావము—భట్టిప్రోలు కృష్ణమూర్తిగారు (ప) ... | ౫ | ౪౩౦ |
| ఆంధ్రకథానక కావ్యములు: భోజరాజీయము—బులుసు వెంకటేశ్వర్లుగారు ... | ౪ | ౩౪౧–౩౪౪ |
| ఆంధ్రకవుల ఆదర్శములు: ౨. అమాత్యతిక్కన—నోరి నరసింహశాస్త్రిగారు ... | ౫ | ౪౦౫–౪౧౦ |
| ఆంధ్రసాహిత్యంలోని స్త్రీపర్యాయములు—టి. రామచంద్రగారు ... | ౬ | ౫౧౧–౫౧౫ |
| ఆంధ్రాభ్యుదయము: లిఖితశిలలు—సురభి నరసింహంగారు ... | ౩ | ౨౫౩–౨౬౦ |
| ఆంధ్రుల జానపద శిల్పకళాప్రపంచం: ౧. ప్రవేశిక—సుధాంశు కుమారరాయిగారు ... | ౫ | ౪౮౭– |
| ,, ,, ,, ౨. కొండపల్లి బొమ్మలు ,, ... | ౬ | |
| ఆటపాటలు—వేలూరి రాధాకృష్ణగారు (ఛా. చి.) ... | ౨ | |
| ఆనవేపువచ్చి ఆడవే నెమలి!—'సంపత్' (గే) ... | ౬ | ౫౨౧ |
| ఆత్మార్పణ—చావలి లక్ష్మీనారాయణగారు (ప) ... | ౧ | ౨౪ |
| ఆధునికయంత్రయుగనిర్మాత థామస్ ఆల్వా ఎడిసన్ (కల) ... | ౩ | ౩౦౧–౩౦౨ |
| ఆరామంలో పిల్లపటాలం—ముద్దా విశ్వనాథంగారు ... | ౩ | ౨౯౦–౨౯౨ |
| ఆర్షధర్మసంగ్రహం—శ్రీ నిర్వికల్పానందస్వామిగారు ... | ౨ | ౧౭౬–౧౭౯ |
| ఆషాఢంలో ఒకనాటిఉదయం—మహంకాళి భీమశంకరమూర్తిగారు (క) ... | ౩ | ౨౧౯ |
| ఇండోనీషియన్లు: వారి ఆచారవ్యవహారాలు—డా. ఆల్ఫ్రెడ్ వై హెల్మ్ ... | ౬ | ౬౦౩–౬౦౬ |
| ఉగాది తలపోత—బులుసు వెంకటేశ్వర్లుగారు (ప) ... | ౪ | ౩౦౫ |
| ఉత్తరగోగ్రహణము—సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మగారు (నా) ... | ౪ | ౩౩౩–౩౩౮ |
| ఏమి అదృష్టం!—ఆచంట శారదాదేవిగారు (క) ... | ౫ | ౪౭౧–౪౭౩ |
| ఐక్యప్రపంచసాధనకు ఆసియాముందడుగు— ... | ౪ | ౩౮౪–౩౮౮ |
| ఒంటరిపక్షులు—తెన్నేటి సూరిగారు (క) ... | ౩ | ౨౧౮–౨౨౪ |
| ఓ చుక్కా!—కె. వి. యస్. యల్. నరసింహారావుగారు (గే) ... | ౫ | ౪౧౬ |
| కడలిపువ్వులు, వాటి నిజస్వరూపాలు—'రాము' (వి. వి.) ... | ౨ | ౧౭౮–౧౯౧ |
| కలలోపాకిస్థాన్—కాన్న కృష్ణగారు (కల) ... | ౬ | ౬౧౧–౬౧౨ |
| కళాపూర్ణోదయకథకు లింగపురాణము మూలము కాదు—మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ... | ౨ | ౧౨౧–౧౨౨ |
| కళాపూర్ణోదయము: దానిమూలములు—మల్లంపల్లి వీరేశ్వరశర్మగారు ... | ౪ | ౩౧౩–౩౧౯ |
| కళార్చన—మంత్రివాది వెంకటరత్నంగారు (రే. చి.) ... | ౧ | |
| కవిత్వంలో క్రొత్తరీతులు: వచనములాంటిపద్యాలు—మల్లవరపు విశ్వేశ్వరరావుగారు | ౧ | ౩౯–౪౨ |
| కీ. శే. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు (పుణ్యస్మరణ)—మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ... | ౪ | ౩౨౮–౩౩౧ |

| | నం. | పుట. |
|---|---|---|
| కుటుంబం—పంతుల శ్రీరామశాస్త్రిగారు (క) ... | ౨ | ౧౬౫-౧౮౫ |
| కృష్ణలీల—మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు— ... | ౬ | ౫౨౨ |
| కొత్తరకపు సేఫ్టీ రేజరు—శ్రీరామశాస్త్రిగారు (కల) ... | ౧ | ౯౭ |
| గాంధీ, రవీంద్రులు—దేవగుప్తాపు విశ్వేశ్వరరావుగారు ... | ౨ | ౧౩౫-౧౩౭ |
| గుండెలుతేని పండితరాయలు—మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ... | ౧ | ౨౫-౨౮ |
| గుణగవిజయాదిత్యుడు—భావరాజు వెంకటకృష్ణరావుగారు (నా) ... | ౬ | ౫౬౩-౫౮౨ |
| గులాబితోట—కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు ... | ౪ | ౩౪౫-౩౪౯ |
| గ్రహణం—జీవనశర్మగారు (క) ... | ౧ | ౫౯-౬౪ |
| జనకకృతశుకపరీక్ష—నోరి నరసింహశాస్త్రిగారు (ప) ... | ౨ | ౧౧౨-౧౧౪ |
| జాతకతాజకముల పరస్పర సంబంధము—రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులుగారు ... | ౫ | ౪౩౧-౪౩౭ |
| ఢిల్లీ చిత్రశాలలోని కొన్ని చిత్రాలు ... | ౪ | |
| తలుపు కిరకిర—కపిల కాశీపతిగారు (క) ... | ౫ | ౪౨౫-౪౨౯ |
| తల్లికోట యుద్ధము: సాహిత్యపరిణామము—చింతగుంట రామకృష్ణరావుగారు ... | ౬ | ౫౨౮-౫౩౦ |
| తార్కికప్రకృతి—కె. అన్నమరాజశర్మగారు (ప) ... | ౩ | ౨౧౨ |
| తిక్కన కావ్యనిర్మాణవైభవము—గడియారము వెంకటశేషశాస్త్రిగారు ... | ౪ | ౩౧౯-౩౨౭ |
| తిరస్కృతి—పినిశెట్టి శ్రీరామమూర్తిగారు (క) ... | ౪ | ౩౫౫-౩౬౦ |
| తో[illegible]కారుకోర్థ—బెల్లూరి శ్రీనివాసమూర్తిగారు (ప) ... | ౬ | ౫౧౬ |
| త్యాగయ్యగారి నాదసుధారసం—రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు ... | ౧ | ౩-౭ |
| ద్వ్యర్థము—తలమర్ల కళానిధిగారు (ప) ... | ౫ | ౪౦౩ |
| దృశ్యం: ౧. వర్ణము-రేఖ—ఆమంచర్ల గోపాలరావుగారు ... | ౧ | ౭౨-౭౯ |
| దీర్ఘాలోచన—వేలూరి రాధాకృష్ణగారు (త్రి. చి) ... | ౪ | |
| దేవదాసి—సుధాంశు కుమారరాయిగారు (రే. చి.) ... | ౫ | |
| దైవమహిమ—భట్టిప్రోలు కృష్ణమూర్తిగారు (ప) ... | ౬ | ౫౦౯-౫౧౦ |
| నవలకు నవజీవనంపోసిన డొస్టొవ్‌స్కీ—'చతుర్వేది' ... | ౫ | ౪౨౨-౪౨౪ |
| నాభూలోకయాత్ర—'రాము' (వి. వి.) ... | ౪ | ౩౮౮-౩౭౦ |
| నారెండవభార్య—నాళ్ల. లక్ష్మణప్పగారు (క) ... | ౨ | ౧౫౧-౧౫౮ |
| నేటి ఆహారసమస్య—డి. వెంకటేశ్వర్లుగారు ... | ౬ | ౫౭౯-౫౮౧ |
| న్యాయం—సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారు (నా) ... | ౧ | ౮౩-౭౧ |
| " " " " ... | ౨ | ౧౨౩-౧౩౪ |
| " " " " ... | ౩ | ౨౩౮-౨౪౪ |
| పంచాయితీలు: గ్రామపరిపాలన—అజ్జరపు వెంకటరమణరావుగారు ... | ౪ | ౩౭౧-౩౭౪ |
| " " " " ... | ౫ | ౪౭౧-౪౭౫ |
| పట్టీలు—'రాము' (వి. వి.) ... | ౩ | ౨౭౬-౨౭౯ |
| పతంజలి: ఆయన మహాభాష్యము—గరికిపాటి కృష్ణమూర్తిగారు ... | ౨ | ౧౦౫-౧౧౧ |
| పద్యంలో రాగంవున్నదా?—శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ... | ౩ | ౨౩౩-౨౩౬ |
| పర్వతాలమస్యకలవరింతలు—రా. వే. మ. గం. రామారావుగారు (గే) ... | ౬ | ౬౦౦ |
| పద్యానికి రాగం నిండు తెస్తుందా?—శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ... | ౪ | ౩౫౦-౩౫౪ |
| పద్యానికీ, రాగానికీ కుదురుతుందా?—శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ... | ౫ | ౪౧౧-౪౧౫ |
| పరిష్కారం—రాళ్లబండి నరసింహశాస్త్రిగారు (క) ... | ౧ | ౨౯-౩౪ |
| పాశ్చాత్యోక్తాలంకారము—కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (కల) ... | ౨ | ౧౯౯-౨౦౦ |
| పాణినిసూత్రాలు: ఆనాటివిశేషాలు—గరికిపాటి కృష్ణమూర్తిగారు ... | ౧ | ౯-౧౪ |

| | సం. | పుట. |
|---|---|---|
| పారాశర్యవ్యాసుని వేదవిభాగవిధానము—పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు | ౩ | ౨౦౭–౨౧౧ |
| ప్రణయజ్యోతి—దేవసప్తాపు విశ్వేశ్వరరావుగారు (వా) ... | ౫ | ౫౦౩–౫౦౪ |
| ప్రతిఫలం—'జమదగ్ని' (క) ... | ౬ | ౫౭౫–౫౮౬ |
| ప్రాచీనభారతీయభావన—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ... | ౫ | ౪౧౭–౪౨౧ |
| బంతిపూవు—బోయిభీమన్నగారు (ప) ... | ౧ | ౨౮ |
| బత్తుల కామాక్షమ్మగారి షష్టిపూర్తి (కల) ... | ౬ | ౬౧౩–౬౧౪ |
| బహిష్కృతి—పిసిపెట్టి శ్రీరామమూర్తిగారు (క) ... | ౫ | ౪౭౪–౪౮౦ |
| బొందితో కైలాసము—కపిల వెంకటరావుగారు ... | ౬ | ౫౪౮–౫౫౨ |
| భావలహరి—ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు (ప) ... | ౩ | ౨౦౫–౨౦౬ |
| ,, ,, ,, ,, ... | ౪ | ౩౪౦ |
| భూప్రదక్షిణము—మామిడిపూడి వెంకటరంగయ్యగారు ... | ౩ | ౨౯౦–౨౯౯ |
| ,, ,, ,, ... | ౪ | ౩౮౫–౩౯౩ |
| ,, ,, ,, ... | ౫ | ౪౮౭–౪౯౬ |
| మద్రాసుప్రభుత్వపు ఖాదీప్రణాళిక—సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మగారు ... | ౧ | ౫౧–౫౮ |
| మనచరిత్రసామగ్రి, చరిత్రలు (శాసనాలలోని వింతవిశేషాలు)—మల్లంపల్లి సోమశేఖరశర్మగారు | ౨ | ౧౫౮–౧౬౪ |
| మనచరిత్రము : కొన్ని విశేషములు—బులుసు వెంకటరమణయ్యగారు ... | ౩ | ౨౨౫–౨౨౬ |
| మహనీయమైన మన ఆంధ్రదేశం—పురిపండా అప్పలస్వామిగారు ... | ౫ | ౫౦౧–౫౦౨ |
| మాతృదేవి—ఘట్టి ఆంజనేయశర్మగారు (క) ... | ౨ | ౧౮౨–౧౯౬ |
| మానవుడు—పంతుల శ్రీరామశాస్త్రిగారు (క) ... | ౪ | ౩౦౧–౩౭౬ |
| 'మా విద్యాసంస్థ'—హనుమచ్ఛాస్త్రిగారు ... | ౫ | ౪౩౯–౪౪౩ |
| మొక్కల ప్రపంచములోని వింతలు—'రాము' (వి. వి.) ... | ౧ | ౯౦–౯౨ |
| మొయిలురేక—మొక్కపాటి కృష్ణమూర్తిగారు (త్రి. చి.) ... | ౬ | |
| రంగయ్య—పద్మరాజుగారు (క) ... | ౬ | ౫౨౩–౫౨౬ |
| రాజ్యాంగపరివర్తన పరిణామము—భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ... | ౧ | ౯౩–౯౬ |
| ,, లక్షణములు : సైహూతీతాత్మనము (కల) ... | ౧ | ౯౭–౯౯ |
| రాజరాజు శిలలో—మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు (ప) ... | ౬ | ౫౮౭–౫౮౮ |
| రాయలనాటి రమణీయజీవితము, హంపీక్షేత్రము—పుట్టపర్తి నారాయణాచార్యులుగారు | ౫ | ౪౫౦–౪౫౬ |
| రాయలసీమ 'గడియారము'—మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ... | ౩ | ౨౪౫–౨౫౦ |
| లంకాదహనం—ఖండవిల్లి లక్ష్మీరంజనంగారు (గే) ... | ౩ | ౨౬౧–౨౬౩ |
| వనకన్యలు—దేవీప్రసాదరాయచౌదరిగారు (త్రి. చి.) ... | ౧ | |
| వాగర్థాలు—గరికిపాటి కృష్ణమూర్తిగారు ... | ౬ | ౫౩౭–౫౪౧ |
| వాఙ్మయపరమార్థము—'కుమారదేవ' ... | ౫ | ౪౬౬–౪౭౦ |
| విద్యల్లోకము; ౧. సజీవవిజ్ఞానము—వేలూరి శివరామశాస్త్రిగారు ... | ౫ | ౪౪౫–౪౪౯ |
| ,, ౨.—వేలూరి శివరామశాస్త్రిగారు ... | ౬ | ౫౪౨–౫౪౩ |
| విమలాదిత్యుని రాజ్యాధిరోహణము—వేదము వెంకటరాయశాస్త్రిగారు ... | ౧ | ౬౫–౭౧ |
| వెలుగునీడలు—'అమరేంద్ర' (క) ... | ౩ | ౨౬౪–౨౭౯ |
| వేణుగానము—సీతాదేవిగారు (త్రి. చి) ... | ౩ | |
| వేదఋషుల గణితయంత్రము—గబ్బూరు వెంకటానందరాఘవరావుగారు ... | ౩ | ౨౮౩–౨౮౫ |
| శక్తాశక్తంలో యుద్ధం—వై. వి. రమణమూర్తిగారు (క) ... | ౨ | ౧౩౯–౧౪౯ |
| శాస్త్రశేజీచదువు—భమిడిపాటి శివరామకృష్ణశర్మగారు (క) ... | ౧ | ౧౫–౨౩ |
| శివాలాస్యము—పుట్టపర్తి నారాయణాచార్యులుగారు (ప) ... | ౨ | ౧౧౧–౧౧౪ |

| | | నం. | పుట |
|---|---|---|---|
| శివప్రసంగము—గరికిపాటి కృష్ణమూర్తిగారు | ... | ౪ | ౩౦౮-౩౧౧ |
| శోకాశోకవనము—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (గే) | ... | ౨ | ౧౨౦ |
| వేదమూర్తులు—ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు (నా) | ... | ౬ | ౫౯౨-౫౯౯ |
| సంక్రాంతి—తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగారు (గే) | ... | ౧ | ౪౨౨ |
| సంచలనం—'పో. శా.' (వ) | ... | ౬ | ౫౮౩-౫౮౪ |
| సంగీతసూత్రము—జమ్ములమడక మాధవరామశర్మగారు (కల) | ... | ౫ | ౫౦౫-౫౦౬ |
| సంస్కృతీకరణాలో ఉన్న విశేషాంశాలు—గరికిపాటి కృష్ణమూర్తిగారు | ... | ౩ | ౨౧౩-౨౧౮ |
| సమ్రాట్ ఆప్తమిత్రుడు—తిల్లావఝ్ఝల కృత్తివాసతీర్థులుగారు (నా) | ... | ౫ | ౪౫౮-౪౬౫ |
| సాహిత్యము: శృంగారము—శేకర రెడ్డి | ... | ౨ | ౧౧౫-౧౧౯ |
| సుషుప్తి—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (క) | ... | ౩ | ౨౨౮-౨౩౨ |
| సేలం దొమ్మికేసులు—దిగవల్లి వెంకటశివరావుగారు | ... | ౧ | ౪౩-౫౦ |
| సౌందర్యమీమాంస—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | ... | ౬ | ౫౩౭-౫౩౬ |
| స్వప్నఘట్టము—జైన్యవర్ధదాసుగారు (త్రి. చి.) | ... | ౫ | |
| స్వర్ణపాళి—భట్టిప్రోలు కృష్ణమూర్తిగారు (గే) | ... | ౪ | ౩౧౨ |
| స్వాగతము—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (గే) | ... | ౪ | ౩౦౬ |
| హృదయశకలము—సత్యనారాయణరావుగారు (వ) | ... | ౫ | ౪౦౪ |






సంపుటము 24
సంచిక 1

# భారతి

జనవరి, 1947
వ్యయ, పుష్యము

## స్వవిషయము

పరమేశ్వర కృపాకటాక్షమువల్ల భారతి సేవాయాత్రలో ఇంకొక్కయేడు చల్లగా గడచిపోయినది. నేటితో భారతికి ౨౩ ఏండ్లు నిండి, ౨౪-వ యేడు పైబడినది. సంకల్పవికల్పాత్మకమైన సాధనపథములో ఇటువంటిఘట్టము పర్వహేతువు కావుటలో విశేషము లేదు.

*     *     *     *

క్రొత్త సంవత్సరారంభమున క్రొత్త క్రొత్త కోరిక లీరికలెత్తుట పరిపాటియైన విషయము. కాని, వానిలో తీరినవి తీరగా మిగిలినవే మిక్కిలిగా ఉండుట అంతకన్న పరిపాటియైన సంగతి. యుద్ధము రూపుమాసి పోయినను అది తెచ్చిపెట్టిపోయిన అవాంతరములు మాత్రము ఇంకను యథాస్థితిగానే ఉండిపోవుటతో ఈనన్ని వేశము అచలముగా నిలచినది. కాని, అవాంతరములను నడ్డచేయక కృషిచేయుటయే సాధకుల వంతు.

'పురాణమిత్యేవ నసాధుసర్వం నచాపి కావ్యం నవమిత్యవద్యం' అన్నరీతిదే మా ఆదర్శమనుట పాఠకులెరుగనిది కాదు. పాతక్రొత్తల మేలి కలయికయే మా పరమార్థము. ఈ విషయమున మాకు కొంతవరకు రచయితల తోడ్పాటు లభించుచుండుట మరియొక ఆనందహేతువు.

*     *     *     *

నేడు మన తెలుగుదేశము సాహిత్యపరముగాను, రాజకీయముగాను, సాంఘికముగాను నవంనవచైతన్యముతో ఎంతో ముందంజవేసినది ; వేయుచును ఉన్నది. ఆచైతన్యము నితోధికముగా ఉత్తేజింపజేయుటకు భారతి యిదివరకువలెనే సదా సర్వకాలములందును సర్వసిద్ధముగా నుండగలదు. ఆంధ్రజాతివికాసమే భారతి వికాసము ; ఆంధ్రుల అభ్యుదయములోనే భారతి ధన్యత.

కథానికా రచనలో మన రచయితలకు ఉత్సాహమును కల్పించి, క్రొత్తక్రొత్త కల్పనలతో, శిల్పముతో ఉత్తమ కథానికా సృష్టికి వారిని ప్రేరేపించుటకై ప్రత్యేకము సంకల్పించుకొన్నాము. అనేక కథలు వచ్చినవి. కాని ప్రథమద్వితీయ తరగతులకు చెందిన కథలు లభించకపోయినవి. మూడవ తరగతికి చెందినవే లభ్యమైనవి. అయినప్పటికిని మూడవ తరగతి కథ ఒక్కదానినే ప్రచురింపక, ఈసారికి మాత్రము ఆ తరగతికే చేరిన మూడుకథలను ఈ సంచికలో ప్రచురించితిమి. ఈ మూడింటికిని మూడవ బహుమానములను విడివిడిగా ఇవ్వ నిశ్చయించితిమి. ఇకముందైనను, ముచ్చటగా మూడు బహుమతులను యథావిధిగా ఇచ్చుటకు సదవకాశము తప్పక కలుగునని ఆశించుచున్నాము.

* * * *

ఇప్పుడు బహుమతులు గడించుకొన్న ఈముగ్గురును ఇంచుమించుగా భారతికి సరి క్రొత్తవారే అగుట ఒక విశేషము. క్రొత్త రచయితలు ఉబికి వచ్చుచుండుట మా కమితానందమును కల్పించుచున్నది. ఆముగ్గురు రచయితలకును మా అభివందనములు.

* * * *

ఆంధ్రమహాజనుల ఆదరాభిమానము లున్నచో ఇటువంటి సేవలెన్నయినను ఇను మిక్కిలిగా మేము చేయగలవారము. అదే మా ఆశ; అదే మా లక్ష్యము; అదే మాకు పరమానందము.

* * * *

రేపు ౧౧-వ తేదీ ఆంధ్రులకు పుణ్యదినము. ఆంధ్రగాయక పితామహుడు శ్రీ త్యాగరాజు సిద్ధిపొంది ఆనాటికి నూరేండ్లు నిండగలవు. ఆ మహానుభావునకు ఆంధ్ర మహాజనులు ఆనాడు తమ భక్తితాత్పర్యములను మహావైభవముతో తప్పక వెల్లడించి తీరగలరని విశ్వసించుచున్నాము. ఈ శతవార్షికోత్సవ సందర్భములో శ్రీత్యాగబ్రహ్మము వారికి మేమును మాశ్రద్ధాంజలిని సమర్పించుకొనుచున్నాము.

—సంపాదకుడు, భారతి.



# త్యాగయ్యగారి నాదసుధారసం



= శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ =

శ్రీ త్యాగయ్యగారు ప్రపంచానికి ప్రసాదించిన వరం గంగానదివలె మూడు మార్గాలతో ప్రవహించింది. శ్రీరామభక్తి, కవిత, గానం. ఈ మూడు తత్త్వాలున్ను పూర్వజన్మార్జితమైన పుణ్యంచేతనే తప్ప మనుష్య ప్రయత్నంతోగాని, ఆకస్మికంగాగాని లభించేవి కానంత గొప్పతనంతో ఇంచుమించుగా వున్నవి. అయినా వంశపరంపరగా, ఇంటిసొత్తుగా కూడా ఆయన పాలికి దొరకినవని చెప్పడానికి కావలసినంత సాక్ష్యం ఉన్నది.

త్యాగయ్యగారి ప్రియశిష్యులైన సౌరాష్ట్రి వేంకటరమణ భాగవతులు తన గురువుగారి జీవిత చరిత్రను కొంతవరకూ సంగ్రహంగా వ్రాసిపెట్టినాడు.* దానిలో త్యాగయ్య తండ్రి రామబ్రహ్మంగారినిగూర్చి ఈమాట లున్నవి:

"వీరు శ్రీమద్రామాయణ, భాగవత, భారతాది ప్రసంగాదులయందు ప్రవీణుడును, తంజావూరు తుల సింగ మహాప్రభువులవారి సమస్థానంలో శ్రీమద్రామాయణ ప్రసంగంచేసి శ్రీరామనవమి గరోత్సవముసలిపి అనేక సన్మానముల నొందిరి. ఆ ద్రవ్యాలచేత తన యింట్లో శ్రీరామనవమి జననోత్సవమును అతివిమర్శగా చేయుచు నుండును."

త్యాగయ్యగారి తాతగారైన గిరిరాజ బ్రహ్మం గారిని గురించి "వీరు సకల విద్యలయందును సమర్థులు" అని మాత్రం పై చరిత్రలో గలదు. కాని ఎట్టియాపురం సుబ్బరామదీక్షితులు గిరిరాజకవినిగూర్చి "ఇతడు... ...సంస్కృతాంధ్ర భాషలలో మిక్కిలి ప్రజ్ఞగలవాడు. సంగీతవిద్యాసంపన్నుడు. ఇతడు తెనుగున భక్తిరసముగాను, వేదాంత విషయముగాను బహు కీర్తనములజేసి ప్రఖ్యాతిని బొందినవాడు." అని వ్రాసినారు.† ఐతే,

'మాయా నీవంచన వడవదు
మాటాడక పోవే'

అనే కాంభోజిరాగం వేదాంతి కీర్తన ఒకటే సుబ్బరామ దీక్షితుల పుణ్యాన చిట్టతోపాటు మనకు లభించింది. ‡

తక్కినవి వాకు దొరక లేదు. ఐతే, తంజావూరి సరస్వతీమహాలు భండారంలో శాహమహారాజును, శరభోజిమహారాజును నాయకులనుగాజేసి, గిరిరాజ కవి రచించిన శృంగారపదాలు కొన్ని, పూర్ణకైనా తక్కువకాక, దిక్కూ దశా విచారించేవారు లేక మూల్గుతూవున్నవి. ఆయన రచించిన తెలుగు యక్షగానాలు గూడా కొన్ని అక్కడ కలవు. గిరిరాజకవి తండ్రి పంచనద బ్రహ్మంగారుకూడా 'వేదశాస్త్ర పురాణాదులయందు నిపుణుడు' అని పై త్యాగరాజ చరిత్రలో వున్నది. కనుక త్యాగయ్యగారి పూర్వీకులలో కనీసం మూడు తరాలవారు సంగీత సాహిత్య భగవద్భక్తులకు పేరుపొందినవారననీ, అందుచేత ఆయన కా మూడు విషయాలున్నూ, వద్దన్నా వదలక, ఉగ్గుపాలతో వచ్చినవనిన్నీ చెప్పడానికి సందేహం లేదు. మరి అనిర్వచనీయమైన ఆయనప్రతిభాశక్తిచేత ఆ మూడూ

---

* దీనిని వ్యయసంవత్సరాది సంచికలో ఆంధ్ర పత్రికవారు ప్రకటించిరి. మూలం మధుర సౌరాష్ట్రి సభవారివద్దగల తాటాకుల ప్రతి.

† సంగీత సంప్రదాయ ప్రదర్శిని—పూర్వభాగం. వాగ్గేయకారుల చరిత్ర. పుట ౧౨.

‡ అదే. ఉత్తరభాగం. అనుబంధం(B)పుట ౬౦.

చాలా ప్రబలించినవి. మూడూ ఒకదానికొకటి వర్చస్సు నిస్తూ పెరిగినవి. ఒకదానితో మరి రెండూ ఎప్పుడుగాని పీడిపోక ఏకకుటుంబంగా నడచినవి. సంగీతానికి ఉల్లాసం ఎక్కువైన సమయంలో భక్తిసాహిత్యాలూ, భక్తి ఉద్రేకించిన వేళలో సంగీత సాహిత్యాలూ, కావ్యకళ మెరసినప్పుడు భక్తిసంగీతాలూ వెనుకనిలిచి మేళం నడిపించినవి. ఈ త్రివేణీసంగమాన్ని ఇంత స్పష్టంగా మనం త్యాగయ్యజీవితమందే చూడవచ్చును. ఈమూటినీ ఆయన ఆత్మోత్తారణకై సాధించి ఉపాసించినాడు. కీర్తి, ద్రవ్యం, ప్రతిష్ఠ మొదలైన ఏ ఇతర ఫలాలనూ ఆసించక, ఇతర జీవులూ తరించవలె నన్నే ప్రపంచానికి మూటినీ వెదజల్లినాడు.

ఐతే, ఆయన ధారాళంగా ఇచ్చిన యీ తత్త్వత్రయాన్ని మన మెంతవరకు గ్రహింపగలము? ఎంత జీర్ణించుకోగలము? మన కీ మూటిలో ఏదిముఖ్యం? ఏదిగౌణం? ఈ విషయంలో నా దృష్టినిమాత్రం ఇక్కడ మనవిచేస్తాను.

త్యాగయ్యగారి భగవద్భక్తి నావంటివాని యోగ్యతకు చాలాదూరం మించిన మహాతత్త్వం. ఆయన భక్తిసంస్కారం గొప్పది. కనీసం నాల్గుతరాలది. ఇంక ఆయనసాధన అతిమానుషమైనది. పుట్టినది నిర్గుణైక బ్రహ్మవాదులైన స్మార్తబ్రాహ్మణులకులంలో. పెరిగింది శివుడు, విష్ణువు, స్కందుడు, పార్వతి, లక్ష్మి, సరస్వతి, తులసి, విఘ్నేశ్వరుడు మొదలైన అన్ని దేవతలకూ సమానంగా మొక్కులు చెల్లించవలసిన సంప్రదాయంలో. ఈ పద్ధతిలో ఏ దేవతా వ్యక్తియందుగాని ఆత్మీయత అనే భావాన్ని దృఢంగా అనుభవించే అవకాశం చాలదు. కాబట్టి భజనసంప్రదాయ ముండినా భక్తిసాధన యీ సన్నివేశంలో మహాకష్టం. భక్తి జ్ఞానాలు రెంటికీ ఏకాగ్రత ముఖ్యసాధనమే. కాని, అన్వయంలో రెంటికీ ఎంతో భేదమున్నది. మనో మార్గాలను సంకోచపరచి నిర్గుణతత్వాన్ని సాదించే 'సోహం' సిద్ధాంతం జ్ఞానమార్గం. వాటిని వికాసపరచి అనంతకల్యాణగుణపరిపూర్ణ తత్వం ప్రత్యక్షీకరించుకొనేది భక్తిపంథ. ఐనా ఈ భక్తిమార్గానికి భిన్నరూప గుణచరిత్రాదులు గల బహు దేవతల పూజాపురస్కారాలు సాధకములు కాజాలవు. ఏదో ఒక వ్యక్తిని పరదేవతగా భావించి, సమీపించి, అనుభవించి, ఉపాసించవలసివుంటుంది. తక్కిన దేవతలు, మునులు మొదలైనవా రెంత గొప్పవారైనా ఆ మూలదేవత కనుచరులుగానే గమనింపవలసి వుంటుంది. ఇట్టి పరమైకాంత భక్తికి పునాది చాలా చిన్నతనమందే త్యాగయ్యకు వేసినారు. 'గోలిసుంట్లాడే' ప్రాయమందే తండ్రి రామబ్రహ్మం కొడుకుకు రామనామోపదేశంచేసినాడు. తరువాత 'ఐదారుదినములకే' రామకృష్ణానందస్వాములనే యతీశ్వరుడు శ్రీరామ షడక్షరీమంత్రాన్ని అంగన్యాసకరన్యాసాలతో ఉపదేశించినాడు. ఆమంత్రాన్ని ఆది మొదలు దినమొకటింటికి లక్షయిరువదియైదు వేల నామముల ప్రకారంగా జపిస్తూ త్యాగయ్య తమ ముప్పదియెనిమిదవ ప్రాయమున తొంభైయారు కోట్ల నామములను పూర్తిజేసిరి.* అని ఒక్కకథ. మూడుమార్లయినా కోటిజపం ముగించినాడని వెంకటరమణ భాగవతుల వ్రాతవల్ల తెలుస్తుంది. ఎట్లయినా త్యాగయ్య తన ఆయుష్కాలంలో చాలాభాగం శ్రీరామమంత్రజపానికి వినియోగించినాడనేమాట సత్యం. దానికితోడు త్రికాలపూజ; మిగిలిన కాలం కీర్తనల రచనకు. భక్తిరసం ప్రవహించే తొమ్మిదిమార్గాలలో త్యాగయ్య దేనినీ విడవక అన్నిటినీ సాధించినాడు. గనకనే ఆయన జీవితమంతా ప్రధానంగా రామమయమైనది. ఇతర దేవతలపైన శ్రద్ధసల్లింది. తుదకు సీతాదేవిమీదగూడా ఎక్కువగా చిత్తసమాధి కలిగించుకొనే అవకాశం ఆయనకు లేకపోయింది. అభిమానంలో తారతమ్యాన్ని విచారిస్తే శ్రీరాముని తరువాత తక్కిన అన్ని దేవతలకంటె పార్వతీదేవిమీద ఆయనకు ప్రతిపత్తి ఎక్కువగా వున్నట్టు కానవస్తుంది. ఈ రామభక్తి వికాసమార్గంలో పెరిగిపెరిగి తుదకు శ్రీరాముడుకూడా త్యాగయ్యపాలికి తన మేరలన్నీ దాటి సర్వాత్మకుడైన పరమాత్మగా ప్రత్యక్షమైనాడు. 'పరమాత్ముడు వెలిగే ముచ్చట' మొదలైన కీర్తనలలో ఈ పరిణామం స్పష్టంగా కానవస్తుంది.

* కె. వి. శ్రీనివాసయ్యంగారి త్యాగరాజ కీర్తనలు, పీఠిక, పుట ౧౩.

తక్కిన పెద్దలంతా భక్తికి ఫలంగా భుక్తి ముక్తులు రెండూ కావలెనని కోరుతూవుండే కాలంలో త్యాగయ్య ముక్తి ఒక్కదానికే వేకారినాడు.

'రామా నీపై తనకు ప్రేమపోదు
భోగానుభవంబులందు బాగుగా బుద్ధినీయదు.'

అని తన మనోగతిని ఆయన ఘోషించినాడు. దేశమంతా చిన్నచిన్న రాజులు, జమీందార్లు, పాళేగార్లు, దోపిడికాండ్లు మొదలైనవారి చేతులలో నలిగి ఛిన్నాభిన్నంగా చెడి చెటాకుల గలుస్తూవున్న కాలంలో కుంపిణీ తెల్లదొరలు వారినీ వీరినీ తగలబెట్టి తమాషా చూస్తూవున్న సమయంలో, రాజులనీ అధికారులనీ పేరుపెట్టుకొన్నవారి అడుగులకు మడుగులొత్తకపోతే-వారిమీద పదాలో పద్యాలో కట్టి పొగడి పైకెత్తకపోతే, బతుకేలేని సన్నివేశాలలో,

'దుర్మార్గచరాధముల దొర నీవనజాలరా'
'శేసెడుదరమునింప నే నరుల పొగడితినా'

అని రామునితోనే మొరపెట్టుకునే విరక్తి,హాకం, శ్రద్ధ, నిర్లక్ష్యం అలవరుచుకొని ఎనభైయేండ్లు దినగండం దీర్ఘాయువన్నగా జీవిత మార్గాన్ని బిగబట్టి నడిపినాడు! ఇటువంటి సంస్కారబలం, సంప్రదాయశుద్ధి, సంకల్పదార్ఢ్యం, సాధనతీవ్రత లేకపోతే భక్తి వట్టి బహిర్లేపమో, వేషమో అవుతుంది. ఈకాలంలో ఎంతమందికీ గుణాలు ఎంతవట్టువున్నవో నాకు తెలియదు. నామట్టుకు నాకు లేవనేది సత్యం.

ఇంతేకాదు. శివభక్తులు, దేవీభక్తులు, స్కందభక్తులు మొదలైనవారిమాట అట్లుండనియ్యండి. వైష్ణవులలోనే కొందరికి రామునికంటే కృష్ణునిమీదా, నృసింహునిమీదా భక్తిభావం ఎక్కువగా ప్రసరిస్తుంది. ఇది వ్యక్తులందు ఎన్నో కారణాలచేత కలిగే చిత్తదౌర్బల్యం. త్యాగయ్యకూడా దీనికి తప్పలేదు. పైకృష్ణాదిమూర్తులమీదా శాస్త్రానికి రెండుమూడు కీర్తనలుమాత్రం ఆయన రచించినా సంతే. కాని, ఆయన లక్ష్యమంతా, నమ్మకమంతా

'కోదండపాణిరూపములో వెలసినవాడేరా దైవము'

అనే వ్యాపించింది. కనక ఆయన భక్తిమార్గం వైష్ణవ హిందువులలోనే ఎక్కువ వ్యాపింపజాలదు. మరిన్నీ ఏ భక్తిగాని కొన్ని సంకేతాలకూ, సంప్రదాయాలకూ లోగివుండక తప్పదు. విష్ణుభక్తికి రామానుజ మధ్వాది సంప్రదాయాలూ,సంకేతాలూ ఎన్నోవున్నవి. త్యాగయ్యగారిది స్మార్తసంప్రదాయం; అందులోనూ స్వంతమార్గా లెక్కువ. వారి కందరికీ ఇది అంటడం సులభంకాదు. ఇంక హిందువులు కానివారిమాట చెప్పనక్కరలేదుగదా. కనక వ్యక్తి, సంఘం, జాతి, మతం మొదలైన కట్లు, కంచెలు అన్నీ విచ్చుకొని తోసుకొని పోగల్గిన రే ఒకరిద్దరు మహానుభావులకో తప్ప సామాన్యులకు త్యాగయ్యగారి భక్తిమార్గం అందరాని పండు. అందినా తినలేము. తిన్నా జీర్ణించుకోలేము.

త్యాగయ్యగారి రెండవవరం కవిత్వకళ. మహాకవుల కుండవలసిన గుణాలెన్నో ఆయనయందు స్వతస్సిద్ధంగా వున్నవి. చిన్నతనంనుంచీ పద్యాలూ, పాటలూ అంతులేక విన్నాడు. వల్లించినాడు. స్వాభావికంగా రచనోత్సాహం కలవాడు గాబట్టి ఛందస్సు, యతిప్రాసలు మొదలైనవానిని సులభంగా వశీకరించుకోగల్గినాడు. భావాలలో ఆర్జవం నిండి ఏ మాట చెప్పినా వర్చస్సుతో చెప్పగలిగినాడు. కృత్రిమంగా మీదవేసుకొన్నభావాలు ఆయనరచనల్లో లేనేలేవనవచ్చును. కొన్ని సాంప్రదాయికపు మాటలు తప్ప. అన్నీ నిండుగా బతికిన భావాలే. దీనికితోడు తన యిష్టమెట్లు వస్తే అట్లు వర్తించి వ్యవహరించే ధైర్యమూ, స్వాతంత్ర్యమూ ప్రబలంగా ఉండినది. దీనితో రచనకు ఒక నవ్యత ఏర్పడి, భావాల కొక విలాసమూ, భావకు ధారాళతా వచ్చి వినేవారి నాకర్షించగలదు. రామభక్తీ, తనకు ముక్తీ ఇవి రెండే భావనావిషయాలై కవితాకళకు వలయం సంకుచితమైనా, దానిలోనే కొత్తకొత్తతోవలు తొక్కి ఆడే ప్రతిభాబలమున్నది. కనకనే ఈతని చేతికి దొరికిన శ్రీరామమూర్తి, దీక్షితులు మొదలగువారి దేవతలవలె, కేవల ధ్యానోపయోగి మూర్తిమాత్రం కాక,మనతో చేరి,మనవాడై కానవచ్చుచున్నాడు. దివ్యమూర్తి మనుష్యుల అంతస్తుకు దిగినాడు. 'ఆత్మానం మానుషం మన్యే' అని ఆయన

చెప్పిన అసత్యవాక్యం సత్యంగా, త్యాగయ్యగారి కవిత పుణ్యాన, మనపాలికి పరిణమించింది. తెలుగు కవులలో పలువురికీ శక్తిలేదు.

ఐతే, త్యాగయ్యగారి జీవితంలో ఆశక్తికి భాషలోగాని, భావాలలోగాని తగినంత యేర్పులూ తీర్పులూ చేసే అవకాశమూ సంస్కారమూ చాలక, ఆయన కవిత పల్లెటూరి పడుచువలె అకృత్రిమంగా నిలిచింది. ఆయన తెలుగుభాష నాలుగైదు తరాలుగా తమిళదేశంలో నిలబడి సహజమైన పెరుగులూ మెరుగులూ చాలావరకూ కోలుపోయింది; జడ్డుగట్టింది. 'మూడు రెండు నదివాఘుడు' 'నిర్దురజితుడు'* వంటి కృత్రిమ రూపాలతో, అందరుకులైన వాక్యాలతో నడచింది. ఆయన సంస్కృతంకూడా ఎక్కువ వ్యాసంగాని కవకాశం చాలలేదనిపిస్తూ, నేర్చిన దానికంటే విని గ్రహించిందే ఎక్కువ అని పదేపదే సూచిస్తుంది. 'కేచన నిజభక్తనిచయ' 'ముఖజితభార్యే'† ఇత్యాదు లుదాహరింపవచ్చును. త్యాగయ్య వ్యాకరణ నియమాలుఉల్లంఘించినవాడనే కాదు నామనవి. ఆ ఉల్లంఘన సహజమైన సరళమార్గంలో నడవలేదనే. తాళ్లపాకవారు, క్షేత్రయ్య మొదలైన పదకవులందరూ, ఎందరో పద్యగద్యకవులూ, వైయాకరణుల అధికారానికి మితిని కలిగించినవారే. శబ్దశాస్త్ర నియమాలను ఎదిరించే దొమ్ముగలవారు అప్పుడప్పుడుండబట్టే ఏభాషగాని ప్రవాహినిగా నడుస్తుంది. లేకపోతే పడియనీళ్లవలె మలిచిపోక తప్పదు. కాని ఆవుద్యమం ఆయా భాషల ఆవరణంలోనే జరగవలసి వుంటుంది. త్యాగయ్యగారి ప్రయత్నమేమో: ఆ వలయానికి బైట అవి మర్నగా జరిగింది.

ఇంక ఆయనభావాలుగూడా ఎన్నోచోట్ల పై అపక్వతనే సూచిస్తున్నవి. శక్తికి తోడు లోకశాస్త్ర కావ్యాదుల పరిశీలనవల్ల కలిగే జాణతనం, కావ్యజ్ఞుల శిక్షతోడి అభ్యాసం — అనే రెండుగుణాలు కవితారచనకు ఆవశ్యకమన్నారు పెద్దలు.‡ త్యాగయ్యకు శక్తీ, అభ్యాసమూ సమృద్ధిగా వున్నవి. కాని తక్కినవి సంపాదించే విరామమూ, అక్కరా ఎక్కువగా ఆయనకుండినట్లు కానరాదు. కాబట్టే 'నీ తండ్రిసొమ్ము వెరవక పోసేరదు,' 'ఈ హారామితన మేల' 'రంగడా విభీషణునకు పంగనామమిడినరీతి'§ ఇత్యాది, బాలభావాలు ఆయనరచనలో పడి నిలిచినవి. చెప్పవలసిన భావాలు స్పష్టంగా, సరళంగా చెప్పగల ఓర్పో, శక్తియో లేక వాక్యమూ ఛందమూ ముగిస్తే చాలునని ముందుకుపోయిన రచన యెంతో వున్నది. కాబట్టి ఎన్నోకీర్తనలలో అర్థ మిప్పటికీ అస్పష్టంగానే నిలబడింది. ఇదంతా ఆయన శిష్యప్రశిష్యులు తెలుగు తెలియక చేసిన అపరాధమని చెప్పేది ఒకసంప్రదాయం. కొంత నిజంకావచ్చును. కాని, త్యాగయ్యగారికి కూడా ఇందులో భాగం ఎక్కువగానే ఉండిందని చెప్పకపోవడం సాధ్యంకాదు. ఆయనది తోచిన వెంటనే కూర్చిపెట్టిన ఆశుకవిత; మన సంగీత రచన వంటిది. రాగం, తానం, పల్లవి, స్వరకల్పన ఇత్యాది కర్ణాటకసంగీత స్వతంత్ర రచనలలో గాయకుడు, వల్లించినదానిని వదలి, తన సభ్యుల అదృష్టాన్ని నమ్మి 'నీవేగతిరా దేవుడా' అని సాహసించి కల్పనకు దూకుతాడు. ఆ తెసదారి చొరవలో ప్రతిభావంతుడయి సుశిక్షితుడైన గాయకునినుండి అతడుగాని, మనంగాని కలలోనైనా ఊహించి వుండని అపూర్వాస్ఫూర్త రచనలు ఆవిర్భవించగలవు. ఆ ప్రయత్నంలో అపస్వరాలూ, అవలయాలూ చొచ్చుకొన్నా మనం ఓర్చుకొందుము. ఓర్చుకోవలెను గూడ. ఆ కళస్వరూపమది గనుక. పట్టుకు సులభంగా దొరకని నాదకాలా

---

* చూ. కీర్తనలు: 'సారివెడలిన యీ కావేరి'; 'యుక్తముగాదు.'

† చూ. కీర్తనలు: 'మోచనా కమలలోచన' 'మానససంచరరే'

‡ 'శక్తిర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్,'
కావ్యజ్ఞ శిక్ష యాభ్యాస ఇతిహేతు స్తదుద్భవే'
(కావ్యప్రకాశం, ఉల్లాసం ౧)

§ చూ. కీర్తనలు: 'కరుణాజలధీ' (కేదారగౌళ), 'ఎదుట నిలిచితే', 'రామ దైవమా'

లతో అర్థంలేని భావాలను రచించే విద్య అది. కాని సంకేతబద్ధమైన వాగర్థాలతో చేయవలసిన కవితాకళ ఆ దారిలో నడవవలసిన అక్కరలేదు. స్ఫురించిన రచనను మళ్లీ నిదానంగా నెమరువేసి ఏర్పులూ, తీర్పులూ చేసే అవకాశమూ, చేయవలసిన ధర్మమూ ఇందులో వుంది. దానిని ఉపయోగించుకోకపోతే ఆకళ అఖండంగా సిద్ధించదు. కాబట్టే 'నిలుకడ వలయు గృతికి' అన్నారు విమర్శకులు. ఆశురచనలోగూడా అప్పుడప్పుడు అద్భుత రచనలు మించవచ్చును. కాని, కవికి ఆశువు పనికిరాదు; రాకూడదు. త్యాగయ్యగారి కవిత ఈ ఆశుతరగతిది. ఆశ్చర్యము గలిగించే చమక్కులెన్ని వున్నా అఖండత చాలనిది. కనుక తెలుగుసాహిత్యంలో ఇతర మహాకవుల రచనలు చదివిచూచిన వాలుకకు త్యాగయ్యకవితలోని రసం చాలదు. ఈ మాట సాహసమైతే మన్నించండి.

ఇంక నిజంగా నా వంటివారిపాలికి 'మిగిలింది ఆయన అనుగ్రహించిన గానం. అది మహాప్రసాదం. దాని వైశాల్యం, గాంభీర్యం, విలాసం, వైదగ్ధ్యం, వైవిధ్యం—అనిర్వచనీయమైనవి. దాని కదే సాటి. నిజమాలోచిస్తే త్యాగయ్యగారు ఆజీవమానం అఖండంగా అంతరంగంలో సాధించింది రామభక్తియోగం; బహిరంగంలో అల్లే సాధించింది నాదయోగం. కవిత్వం ఈ రెంటికీ పొత్తుకలిపే కొండివంటిది. అది యీ రెండు మహాద్రవ్యాల ఒత్తిడిలో సన్నగిల్లి మసకు మసకయి పోయింది. వంశపరంపరతో వచ్చిన త్యాగయ్యగానాభిరుచికి సొంటి వేంకటరమణయ్యగారి దోహదం లభించింది. ఆ మహావిద్వాంసుడు-వాగ్గేయకారకుడు-తంజావూరు సంస్థానం దర్బారులో ఉగాదిపండగనాడు మొదటి పాటకచ్చేరీ చేసే అధికారాన్ని సంపాదించుకొన్నవాడు. ఇంతేకాదు. 'మహారాజావారి కొలువు మంటపములో రాజావారి ప్రక్కన అర్ధసింహాసనారూఢు'డట.* అంతటి మహావిద్వాంసుని శిక్షగూడా ఈ శిష్యమహాత్తరునికి చాలలేదు. మళ్లీ రామకృష్ణానందస్వామే వచ్చి నారదమంత్రోపదేశంచేసి ఉపాసన చేయించినాడు. దానిఫలంగా 'నాదపదసీరుహభృంగుడు' నారదుడు ప్రత్యక్షమై అనుగ్రహించినాడు. కనక త్యాగయ్య సంగీతం మనుష్యుల మట్టాన్ని దాటి దివ్యత కెక్కింది. కొన్నాళ్లకు తరువాత సొంటి వెంకట రమణయ్యగారే శిష్యుణ్ణి పిలిపించి తనయింట్లో పాటకచ్చేరీ చేయించి, ఆనందం పట్టజాలక, తనకు మహారాజావారు బహుమానంగా ఇచ్చిన తోడా, మకరకంటి మొదలైన సొమ్ములతో ఆయనను అలంకరించి చూచి కన్నులు చల్లజేసుకొన్నాడట. †'శిష్యాదిచ్ఛేత్పరాజయం' అన్న పరమాచార్య న్యాయాన్ని సంతోషంగా ఆచరించిచూపిన ఆ గురువు ఆ శిష్యునికే అన్ని విధాలా తగిన మహనీయుడు!

కనకనే త్యాగయ్య నాదరచన భాషారచనను చాలాదూరం మీరిపోయింది. ఆయన నాదజీవానికి భాష శరీరంగానూ, ఎన్నోచోట్ల వట్టివేషంగానూ పరిణమించి ఒదిగి నిలిచింది. ఇంతేకాదు. పరదేవతగా శ్రీరామమూర్తిని ఉపాసించే సాధనంగా త్యాగయ్య ఉపయోగించుకొన్న యీ నాదకళ తుదకు శ్రీరాముడే ఐపోయింది. అథవా రాముడే నాదకళారూపముగా మారిపోయినాడు. అంటే రామమూర్తియందారోపించి ధ్యానించిన అఖండత, అమేయత, అనిర్వచనీయత—ఈనాద ప్రపంచమందే త్యాగయ్యకు అనుభవానికి వచ్చింది. ఇంకొకవిధంగా ఈమాటచెప్పితే పాట భక్తి యెల్లలనుగూడా దాటిందన్నమాట. ఆయన రచించిన అమోఘమైన కృతులలో ఒకటైన ఈకృతి ఈ విషయానికి సాక్షి.

"నీదయచే రామ—నిత్యానందుడైతి.
నాదబ్రహ్మానంద రసాకృతిగల—నీదయచే
వరమృదుభాష — సుస్వరమయభూష
వరత్యాగరాజ వాక్చేలావృత"

కాబట్టే, 'నాదోపాసనచే శంకరనారాయణ విధులు వెలసిరి ఓమనసా' అని చాటేదాకా ఆయన స్థైర్యం పాకింది.

ఈ అనుభవమే ముఖ్యంగా ఆయనపాటలలో ఎక్కువగా ఉన్మీలితమైంది. సంకేతాలతో బతికేది

---

* వెంకటరమణభాగవతుల గురుచరిత్ర.

పైదే.

భావం. కాబట్టి దాని వ్యాప్తి మితమైనది. భావమునుబట్టి మాత్రమే చూస్తే 'ఆరగింపవే పాలు' అన్నపాట రామునికే పూజచేస్తూ పాలే నైవేద్యమిచ్చే సమయం లోమాత్రం సార్థకమౌతుంది. అప్పుడుగూడా ఒక మాటు ఆమాట చెప్పితే చాలును. కాని దాన్ని నాల్గు పక్కలా పట్టుకొని ఆడించే పాట మెట్టును త్యాగయ్యగారు ఐదారుసంగతులు చేర్చినాడు. ఎందుకు? ఈ రాముడు, పాలు, ఆరగింపు మొదలైన ఖండభావాలకంటే వాటికి ప్రేరకమైన ఉల్లాసం, అలౌకికత, తృప్తి మొదలైన అనుభావాలలో తన్మయత్వాన్ని పొందడానికి, అఖండమార్గంలో నడవడానికి ఆ నాద రచనలు సోపానాలు కాగలవు. సంగతులైదారు అనేది మచ్చుకేకాని శక్తిగలవారు ఐదునూర్లూ, ఐదువేలూ కల్పించుకోవచ్చును; కల్పించుకోవలెను. కీర్తనలకు సంగతులువేసి పాడే పద్ధతికి త్యాగయ్యే ప్రథమాచార్యుడంటారు. అదే నిజమైతే ఆయన కింత కంటే వేరేఉద్దేశం కావరాదు. ఆయన తన కీర్తనలను భాషాభావాలు మాత్రమే ధ్యానిస్తూ, చల్లగా, ముద్దుగా, స్పష్టంగా ముత్తైదువుల పెండ్లిపాటలవలె, ఒకమాటు పఠించి వదిలేవాడనీ, ఈసంగతులు, నెరవళ్లు, స్వరకల్పనలూ అన్నీ తరువాతి 'విద్వాంసుల' విపరీత కల్పనలనీ కొందరు ఊహించేట్టున్నది. కాని, అది న్యాయంకాదు. త్యాగయ్య గురువుగారింట్లో కచ్చేరీ చేసినప్పుడు 'దొరకునా ఇటువంటిసేవ' అనే కీర్తన పాడి, దాని మూడవచరణంలోని 'కామితఫలదాయకి యామీతో' అనేచోట 'పల్లవి సాహిత్యస్వరములు' పాడి చూపినప్పుడే గురువుగారు 'దొరకునా ఇటువంటి శిష్యుడు!' అని మెచ్చుకొని తన బహుమాన భూషణాలు ఇచ్చి గౌరవించినాడని వెంకటరమణభాగవతుల చరిత్రలోగలదు. ఇదిగాక ఎన్నో కీర్తనల సంగతులు అన్ని శిష్యపరంపరలలోనూ ఒకేవిధంగా నేటికీ పాడే వాడుకలో ఉన్నవి. ఇంకా 'నాదసుధారసం బిలను నరాకృతాయరా' అనే కీర్తనలో సంగతులు ఆ నాదసుధారసమూర్తి రాముడు ఆడే మాటలైనవని త్యాగయ్యే ధ్యానించినాడు.

కాబట్టే ఆయనరచనలు భాష, మతం, జాతి మొదలైన ఎల్లలన్నీ దాటి కర్ణాటక సంగీత రసికుల కందరికీ ఈ నూటయేబైయేండ్లకు పైబడి పరమానందదాయకమైన ఆస్తిగా పరిణమించినవి. ఆయన తెలుగువాడనీ, రామభక్తుడనీ, బ్రాహ్మణుడనీ, ములికినాటి స్మార్తుడనీ, ఎక్కువ అభిమానమో, అసహ్యమో ఆయన పాటలవిషయంలో ఆధునికులు కొందరు చూపడం కేవలం బాలిశమని — ఆత్మాపరాధమని — చెప్పక తీరదు. అవి అలౌకికంగా అనుభవించవలసినవి.

కనుక రామభక్తి ఉన్నా లేకపోయినా, తెలుగు సంస్కృతాలు రుచించినా రుచించకపోయినా, అయ్యగారి కీర్తనలు దొరికినన్ని సంగ్రహించడమూ, వాటి వర్ణమట్టులను స్వరూపనాశంచేయక భద్రపరచి శిష్యపరంపరలో వ్యాప్తికి తేవడమూ గానగాంభీర్యాన్ని ఆ అంతస్తులో తామనుభవించి ఇతరు లనుభవించేట్టు చేయడమూ—ఇవి ఇప్పటి కర్ణాటక నాదకళా రసికుల ధర్మమని నా ప్రార్థన. ఇది మతధర్మము, కుల ధర్మము, జాతిధర్మము కాని కాదు. మరి మానవ ధర్మం. వివిధభేదాలతో, అడ్డగోడలతో ఉద్రేకాలు పెరిగి అనాహుతాలపాలై పోతూవుండే మనదేశంలో త్యాగయ్యగారి యీగానకళను పరస్పరస్నేహ సౌహార్దాలకు సాధనంగా ఉపయోగించి మనం ధన్యులం కావలసి వున్నాము. భక్తి లభిస్తే భక్తులు కృతకృత్యు లౌతారు. కవిత్వం రసింపగలిగితే తెలుగు తెలిసినవా రానందిస్తారు. కాని త్యాగయ్యగారి నాదసుధ దొరికితే —హిందువులేకాదు, మనుష్యజాతే తరించిపోతుంది. ఆయనకళ నారాయణాస్త్రం. దానికి నమస్కారం తప్ప వేరే ఎదురేమీలేదు.

[మొన్న డిసెంబరు మాసాంతాన మద్రాసు మ్యూజిక్ ఏకాడమీవారు జరిపిన శ్రీ త్యాగరాజ శత వార్షికోత్సవ సందర్భంలో చదివిన ప్రసంగం.]

# ఆంధ్రగాయకపితామహుడు శ్రీ త్యాగరాజు

— వారి స్మృతిచిహ్నలు —



త్యాగయ్యగారి ప్రథమ శిష్యుడు
శ్రీ వేంకటరమణభాగవతులు



ఆంధ్రగాయక పితామహుడు
శ్రీ త్యాగరాజు

తిరువయ్యారులో
త్యాగరాజస్వామి మెట్టినిల్లు





త్యాగరాజస్వామి
పుట్టినిల్లు -
తిరువారూరు

తిరువయ్యారులో
త్యాగరాజస్వామివారి వీధి



—Courtesy: Music Academy, Madras.



తిరువయ్యారులో
త్యాగరాజస్వామి
సమాధి మందిరము



త్యాగరాజస్వామి
సమాధి-గర్భగృహము

Courtesy : Music Academy,
Madras.



త్యాగరాజస్వామి నిత్యపారాయణకై వారి ప్రథమశిష్యులు శ్రీ వేంకటరమణ భాగవతులు స్వదస్తూరీతో వ్రాసి, సమర్పించుకొన్న పోతన భాగవతపు వ్రాతప్రతి

(Courtesy : Sowrashtra Sabha, Madura.)



ఎదరు పోతన భాగవతపు వ్రాతప్రతిలోని తొలిపుట

—Courtesy : Sowrashtra Sabha, Madura.

# పాణిని సూత్రాలు - ఆ నా టి వి శే షా లు

= శ్రీ గరికిపాటి కృష్ణమూర్తి =

అ, ఆ-లను, కఖా-లను సూత్రాలలోనికి కుదించడంతో వ్యాకరణశాస్త్రం బయలు దేరింది. ఇవే 'అఇఉణ్ సూత్రాలు' అని ౧౪ ఉన్నవి. వీటిని మాహేశ్వరసూత్రాలు అని వ్యవహరించుతారు. "నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారం, ఉద్ధర్తుకామః సనకాదిసిద్ధాన్ ఏతద్విమర్శే శివసూత్రజాలమ్" అని నందికేశ్వరకృత కాశికలో ఉన్నది. సనకాదులను ఉద్ధరించటానికి శివుడు ౧౪ సార్లు ఢక్క వాయిస్తూ ప్రత్యక్షమయ్యాడు. అవే ఈ మాహేశ్వర సూత్రాలు. ఆధ్యాత్మికచింతతో తపస్సు చేస్తున్న సనకాదులకు అవి వేదాంతపరంగా అర్థమయినవి. ఒకపక్కన వ్యాకరణనిర్మాణ చింతతో తపించుతున్న పాణినికి 'అఇఉణ్' వ్యాకరణసూత్రాలుగా ఆధ్వని పరిణమించింది. పాణినీయశిక్షలో "యే నాక్షరసమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్, కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః" అని ఉంది. మహేశ్వరుడివలన అక్షర సమామ్నాయమును పొంది(అఆలు, కఖాలు) వ్యాకరణమంతా రచించిన పాణినికి నమస్కారము అని దాని అర్థము. పాణినికాని, పతంజలికాని ఈ శివుడి పేరే ఎత్తలేదు. అచ్చులు, హల్లులు అనేసంజ్ఞలు ఈ మాహేశ్వరసూత్రాలవలన లభించినవే. ఈసూత్రాలలో అక్షర సమామ్నాయమును మేకుబిగించేశాడు. ఇటు అక్షరము అటు కదిలించ వీలు లేదు. 'హయవరట్'అనే సూత్రం 'హరయవట్'అని చదివితే శాస్త్రమే హరహరా అవుతుంది. ఈ మహేశ్వరసూత్రాలు పునాదిగా చేసుకొని ౮ అధ్యాయాల కట్టడం పాణిని కట్టాడు. ఒక్కొక అధ్యాయానికి ౪ పాదాలు.

పాణినిసూత్రాలవల్ల, అప్పటికాలంలో సంగతులు కొన్ని తెలుసుకోవచ్చు. పాణిని సూత్రాలు వ్రాస్తే, వాటికి ఉదాహరణం, ప్రత్యుదాహరణం పతంజలి ఇచ్చాడు. సూత్రంలోకంటె ఒక్కొక్కప్పుడు ఉదాహరణంలో ఎక్కువ స్పష్టంగా అప్పటికాలపు సంగతి తెలుస్తుంది.

ఆరోజుల్లో వేషభాషలు బాగా ఉండేవి. పైన ఉత్తరీయం(ఉపసంవ్యాన), మోకాళ్ల దాకా బట్టలు కాకుండా ముంగాలువఱకు (ఆప్రపదీనం), కొత్తబట్టలు (నిష్ప్రవాణి; తంత్రక) కట్టుకొనేవాళ్లు. కాలికి సరిపడ చెప్పులు(అనుపదీనా ఉపానత్) తొడిగే వాళ్లు. 'తిలతైలం', 'సర్షపతైలం'(ఆవనూనె)

వగైరానూనెలన్నీ ఉండేవి. కాజావెన్న కరగించిన నెయ్యి(హైయంగవీన) వేసుకొనే వాళ్లు.

భోజనానికి ఏమీ ఇబ్బంది ఉన్నట్టు కనపడదు. అనేకరకాల ధాన్యాలు పాణిని చెపుతాడు. "వ్రీహి, శాలి, ముద్గ, యవ, యవక, తిల, గోధూమ, మాష, ఉమా (Linseed), భంగ"(Hemp) వగైరా. రెండు నెలల పంట ఒకటి ఉండేది. 'షష్టికా' ధాన్య — 'షష్టిక' అని దాని పేరు. "షష్టిరాత్రేణ పచ్యంతే"-౬౦రోజులలో పండుతుందికాబట్టి. ఇన్ని ధాన్యాలు ఉన్నవి అంటే కాలువలు లేకుండా పని జరగదుగదా? పతంజలి ఏదో ఒకసందర్భంలో "శాల్యర్థం కుల్యా నీయంతే" "వరిపైరుకోసము కాలువలు తీస్తారు. పైరు కోసముగదా ఇవి అని ఆకాలవలో నీళ్లు తాగకుండాఉంటూరా"అని అంటాడు. దున్నినంతమాత్రానే పండే పంటలు 'కృష్టపచ్యా' అనేవాళ్లు. ఈపొలంలో ఎన్నివిత్తులు చల్లాలి అంటే "ప్రాస్థికం క్షేత్రం, ద్రౌణికం క్షేత్రం"—ఇందులో ఒక తూమెడు, ఇందులో ఒక కుంచెడు అని చెప్పగలిగిన ఆసామీలు ఉండేవాళ్లు. ఒక్కచేతిమీదుగా ఎంత వంటైనా చెయ్యగలిగినవాళ్లు ఉన్నారు. "ప్రాస్థికీ బ్రాహ్మణీ, ద్రౌణికీ బ్రాహ్మణీ"— ఒకప్రస్థంగాని, ఒకద్రోణంగాని బియ్యం వండ గలదు ఆ బ్రాహ్మణి.

'ఆస్తికులు', 'నాస్తికులు', 'దైష్టికులు' (Fatalists) అప్పటినుంచి ఇప్పటివఱకు వస్తున్నవాళ్లే. ఈ నాస్తికుల్లో లోకాయతం (Materialism) చదివేవాళ్లుకూడా ఉన్నారు- 'లోకాయతికః'. దేవాలయాలుకూడా వుండేవేమో. 'అగారాంతాట్ఠన్' అని సూత్రం. అగారాంతశబ్దమునకు ఠన్ అనే ప్రత్యయం వస్తుంది. దేవాగారమందు నియుక్తుడు 'దేవాగారికః' (పూజారి) అని ఉదాహరణం ఇచ్చారు.

అప్పుడుకూడా బస్తీవాడి టక్కరితనం, నాజూకు ఈరెండూ ప్రసిద్ధిగానే ఉండేవి. "నగరాత్ కుత్సనప్రావీణ్యయోః"అని సూత్రం. వీడు గజదొంగ అని చెప్పాలంటే 'నాగరకఃచోరః'అనాలి. ఈ శిల్పి గొప్ప పనివాడు అనాలంటే 'నాగరకః శిల్పీ'అనాలి. నగరవాసులు ఈబ్రాహ్మలు అనాలంటే 'నాగరాః బ్రాహ్మణా' అనిమాత్రమే అనాలి. 'నగరకాక'శబ్దం ఆక్షేపార్థంలో ఉన్నది. ఆ నగరకాకం మన పల్లెటూరి గబ్బిలాయికి ప్రతిద్వంద్వి అయిఉండవచ్చు.

ఆరోజుల్లోను శరీరాయాసంచేత జీవించే వాళ్లు (వ్రాతీనః), కూలిమీద బతికేవాళ్లు (భృతకః) ఉన్నారు. వేతనంమీద జీవించే 'వైతనికులు', వ్యాపారంమీద జీవించే 'క్రయవిక్రయకులు', ఆయుధవృత్తిచేత జీవించే 'ఆయుధీయులూ' ఉన్నారు. వేతనాదిగణం ఒకటి పాణిని చెప్పాడు. వేతనాదులవల్ల జీవించేవారు అనే అర్థంలో. ఆగణంలో వాహన, జాల, శయ్యా, ఉపనిషత్, ఉపదేశ వగైరాలు ఉన్నవి. వీటిమీద జీవించే వారు ఉన్నారన్నమాట. వడ్డీలమీద బతికే 'వార్ధుషికులు', రెండుమూడురెట్లు వడ్డీకింద తీసుకొనే ప్రయోజకులు 'ద్వైగుణికులు, త్రైగుణికులు' ఉన్నారు. 'ఉద్వర్తకులు' వచ్చి తలంటిపోస్తే హాయిగా నిద్రపోయి తెల్లవారి లేచేటప్పటికి సుఖంగా నిద్రపట్టిం

దా అని 'సౌఖశాయనికు'లచేత అడిగించుకొనే శ్రీమంతులు, 'నైష్క-సాహస్రికులు' (సహస్రనిష్కములుకలవారు), 'గాసాహస్రికు'లు ఉండేవాళ్లు. శ్రీమంతు లున్నారంటే నాణాలు ఉన్న వన్నమాటే. "రూపా దాహత ప్రశంసాయాం" అని సూత్రం. ఆహతమైనది (Coined), ప్రశస్తమైనది అనే అర్థంలో 'య' ప్రత్యయము విధించాడు. 'రూప్యః కార్షాపణః'అనినాణెముఅనే అర్థంలో అనాలి. కార్షాపణం, పాదం, మాషం వగైరా నాణాలు ఉన్నవి. ఇన్ని నాణాలు, డబ్బు ఉంటే రాజుగారు పన్ను తీసుకోకుండా ఉండడుగదా. 'కారనామ్నిచ ప్రాచామ్' అని సూత్రం. తూర్పుదేశంలో పన్నులు అయినప్పుడు దానికీకార్యం పాణిని చెప్పాడు. ఉదాహరణంలో 'ముకుటే కార్షాపణం, దృషది మాషకమ్'అని రెండుపన్నుల పేర్లున్నవి.

ఇంత రాజ్యతంత్రం, ఇంత వ్యాపారం ఉన్న రోజుల్లో సముద్రయానం లేకుండా ఉంటుందా? వేదంలో 'సప్తసింధవః'అని ఉంది. నవీనపరిశోధకులు వారి బుద్ధిఅంతా ఉపయోగించి "సింధు అంటే సింధునది. కాని ఇక్కడ 'సింధు'అంటే నది అనే అర్థము. సప్తసింధు అంటే ఏడునదులు" అని చెప్పి ఆ ఏడునదులు ఎవ్వి అని అడిగితే, పంజాబులో ౫, మిగిలినవి రెండూ వాగులు, వఱదలు కలిపి చెప్పి, వేదకాలంనాటికి సముద్రం అంటే ఏమిటో తెలియదు అన్నారు. పాణినిలో 'ద్వీప' 'అంతరీప'శబ్దాలు కనిపించుతవి. 'సముద్రా న్నావి మనుష్యే' అని ఒక గణసూత్రం ఉంది (౪-౨-౧౨). కాబట్టి పరిశోధకులకు ఏమీ ఆధారం ఇక్కడ లేదు.

పాణినినాటికే న్యాయ, నిరుక్త, మీమాంసా, వ్యాకరణ, శిక్షా, లోకాయత, జ్యోతిష, వాస్తువిద్యా, ముహూర్తవిద్యా, ఉపనిషత్, ఆయుర్వేదశాస్త్రములు చదువుకొనేవాళ్లు. చదువుకున్నంతమాత్రాన అందరకూ వస్తుందా చదువు? "దృశ్యంతేహి కృతప్రయత్నాశ్చాప్రవీణాః, అకృతప్రయత్నాశ్చప్రవీణాః"-ప్రయత్నం లేకుండా ప్రవీణులు అయిన వాళ్లున్నారు, ప్రయత్నించినా ప్రావీణ్యం రానివాళ్లూ ఉన్నారు అని భాష్యం. చదువువచ్చినంతమాత్రాన సంపాదన అందరకూ వస్తుందా? "సమాన మీహమానానాం చాధీయానానాంచ కేచి దర్థైర్యుజ్యంతే అపరే న. స్వాభావిక మేతత్"— ఇద్దఱికీ కోరిక సమానమే, ఇద్దఱూ గట్టిగా చదివారు. ఒకరికి డబ్బు వచ్చింది, ఒకరికి రాలేదు. అది లోకస్వభావము అన్నాడు భాష్యకారుడు.

పాణినిరోజుల్లో నటులకు 'నటసూత్రాలు' ఉండేవి. సన్న్యాసులకు భిక్షుసూత్రాలు ఉండేవి. ఎన్ని సూత్రాలు చెప్పినా దంభంతో జీవించే సన్న్యాసులూ (దాండాజినికః) ఉండేవాళ్లు. ఆయుర్వేదం వృద్ధిలో ఉన్నప్పటికీ చిన్నతనంలో ముసలివాలకం పడిన వాళ్లూ(యువజరతీ), చిన్నతనంలోనే బట్టతల అయినవాళ్లూ(యువఖలతీ)ఉండేవాళ్లు. మందులేని రోగాలు కొన్ని. వాటిని 'క్షేత్రియో వ్యాధిః'అన్నాడు పాణిని. అంటే శరీరాంతరమందు చికిత్స్యమేగాని ఈజన్మలో కుదరవు.

కొన్ని తాగుబోతుదేశా లుండేవి. 'సురాపాణాః ప్రాచ్యాః, క్షీరపాణా ఉశీ

నరాః'—తూర్పువాళ్లు బాగా తాగేవాళ్లు; ఉశీనరదేశస్థులు పాలే తాగేవాళ్లు. తాగిన వాళ్లు ఎంత సాహసకృత్యమైనా చేస్తారు, అయశ్శూలంలాగ-'అయశ్శూలికః'. 'బ్రహ్మ వర్చసు'లు కొంతమంది, 'పల్యవర్చసు'లు కొంతమంది. వీరి ముఖంమీద ఉండే వర్చస్సు వారు తిన్న మాంసంవర్చస్సే. అప్పుడు కూడా అస్పృశ్యులు ఉన్నారు. 'శూద్రాణా మనిరవసితానామ్'అని సూత్రం. నిరవసితులు అన్నం తిన్న గిన్నెలు తోమినా పనికిరావు. తోమితే గిన్నెలు పనికివచ్చినట్ట యితే వారు అనిరవసితులు. 'అనిరవసితులు అయిన శూద్రులు' అన్నాడు పాణిని. అంటే బ్రాహ్మణులు తమ పాత్రల్లో శూద్రులకు అన్నంపెట్టేవారేమో. 'మాల'శబ్దం 'సంక లా'దిగణంలో ఉంది. ఈ ఇల్లు మాలలు కట్టేరు అంటే 'మాలం గృహమ్'అనాలి.

'అసూర్యంపశ్య'లు— ఘోషాస్త్రీలు అప్పటినుంచీ ఇప్పటివఱకూ వస్తున్నారు. అల సులకుకూడా అప్పుడు కొదవలేదు. చక్కగా పొట్టనిమురుకుంటూ 'తుందపరిమృజుడు' కూచుంటాడు. 'ప్రాతేసమితుడు' ఒకడు. భోజనంవేళకు తయారు, పనికి సున్నా ఈయన. ఇంకోఆయన 'మాతరిపురుషః', ఇంకొకడు 'పితరిశూరః', మఱొకఆయన పుట్టినతరువాత తృప్తిఎఱుగడు, గర్భంలో ఉన్నప్పుడుతప్ప- 'గర్భే తృప్తః.'

'ట్రేడ్‌యూనియన్' సంఘాలు ఉండేవి కాబోలు పాణినికాలంలో. 'పూగాఞ్ ఞ్యోఽగ్రామణీపూర్వాత్'అని సూత్రం. పూగం అంటే, అర్థకామప్రధానులు, నియతవృత్తిలేనివారలు, నానాజాతీయులు అయిన వారి సంఘం. ఈసంఘంవారు ఎఱ్ఱజెండాలు వేసుకొని ఊరేగేవాళ్లేమో. ఈసూత్రానికి ఉదాహరణంగా 'లోహితా ధ్వజా యస్య పూగస్య లౌహితధ్వజః' అని చెప్పారు. ఎఱ్ఱజెండాగలిగిన సంఘం అన్నమాట.

ఆరోజుల్లో 'బ్రాహ్మకం' అనే దేశం ఉంది. అక్కడ బ్రాహ్మణులంతా ఆయుధ జీవులు. వీరు ఇలాగ క్షాత్రధర్మం అనుసరించుతుంటే వీరి బ్రాహ్మణధర్మం అవలంబించిన క్షత్రియులు ఉన్నారు, 'శాకపార్థివులు'. శాకప్రియులట ఈ పార్థివులు. అంటే కందారాజులు. పాణిని అనేకఆయుధజీవి సంఘాలు పేర్కొంటాడు. క్షుంద, మాలవ, వృక, పర్శు(Persian )వగైరాలు.

'గాడిద గుడ్డు' వేదకాలంనాటిది కాబోలు. 'ఇషేత్వా' అని మొదలుపెట్టే అధ్యాయానికి 'ఇషేత్వకః' అని పేరు. అలాగే వేదంలో 'గర్దభాండ' శబ్దంతో మొదలుపెట్టిన అధ్యాయానికి 'గర్దభాండః' అనికాని, 'గర్దభాండీయః' అనికాని పేరు. ఆ గర్దభాండశబ్దంతో మొదలుపెట్టిన అధ్యాయము కనపడటం లేదు. భాష్యంలో ఉదాహరణం ఉందికాబట్టి వెతకమన్నాడు ఒక వ్యాఖ్యాత. ఈ 'గాడిదగుడ్డు' తెనుగుని ఇంకా పట్టుకొనేఉంది, అధ్యాయం కనపడక పోయినా.

గ్రంథాలు నాలుగు తెగలుగా విభజించాడు పాణిని. ౧. దృష్టం సామ. ఈవేదం ఎవరికో కనపడింది. అది వారు చూసి చెప్పారు. ౨. ప్రోక్తం, ౩. ఉపజ్ఞ. ఈ రెండూ ఒకటే. ఏదైనా ఒకశాస్త్రంలో తమ ప్రతిభచేత మొట్టమొదట ఒక గ్రంథం వ్రాస్తే అది ఈరకంలోకి వస్తుంది. పాణినీయవ్యాకరణం ఈ విభాగంలోనిది. ౪. 'అధికృత్య కృతే గ్రంథే' అని పాణిని ౪ వరకం చెప్పాడు. ఋషులుకానివాళ్లు ఏదైనా గ్రంథం వ్రాస్తే అది 'కృతో గ్రంథః'. పాణినిరోజుల్లో ఇంద్రజననం, యమసభ, శిశుక్రందం(పిల్లలఏడుపు) మీద గ్రంథాలు ఉండేవి. అవి ఇప్పుడు కానరావు.

దేశ భేదాన్ని పురస్కరించుకొని ప్రయోగభేదం ఉండేది భాషలో. 'ప్రాచాం మతే, ఉదీచాం మతే'—తూర్పువారికి ఇది సాధువు, ఉత్తరాదివారికి ఇది అని పాణిని చెప్పాడు. ఇటువంటి మహామహులు పాణిని పతంజలుల రోజుల్లోనే 'వైయాకరణఖసూచి' ఉండేవాడు. ఎవరైనా ఏదైనా ప్రక్రియ అడిగితే పైకి చూసేవాడు ఆయన.

అప్పటిరోజుల్లో వాళ్లుకూడా శుభ్రంగా ఉండేవాళ్లు. పతంజలిభాష్యంలో ఈశ్లోకం కనబడుతుంది:

"దూరా దావసథా న్మూత్రం
దూరాత్పాదావసేచనం,
దూరాచ్చ భావ్యం దస్యుభ్యః
దూరాచ్చ కుపితా ద్గురోః"—

ఇంటికి దూరంగా మూత్రవిసర్జనం, పాదప్రక్షాళనం చెయ్యాలి. దొంగలకు దూరంగా ఉండటం మంచిది. కుపితుడైన గురువుజోలికి పోవద్దు.

ఇంకొకచోట గురువుగారు 'చపేట' (చెంపకాయ) ఇవ్వటంకూడా చెప్పాడు.

బంగారునగలు కొన్ని పతంజలి చెప్పాడు. కుండిక, కటకము, స్వస్తిక. ఇప్పటి స్వస్తిక గాజులకు, స్వస్తికాభరణాలకు సంబంధముందేమో.

ఉణాదిసూత్రాలని ఉన్నవి. అవి శాకటాయనుడు వ్రాశాడు. పాణినికంటె ప్రాచీనుడు. ఈ శాకటాయనుడు ప్రతిశబ్దాన్ని ధాతువుల్లోనుంచి తయారుచేస్తాడు. వ్యుత్పత్తివాది ఆయన. పాణిని 'ఉణాదయో బహులమ్' అని ఒక్క సూత్రంతో అన్ని సూత్రాలూ తోసివేశాడు. అంటే వ్యుత్పత్తిపక్షం పాణిని ఒప్పుకోలేదు అని అంటారు.

అష్టాధ్యాయిలో ౮ అధ్యాయాలు ఉన్నవి. ౧వ అధ్యాయంలో నిర్వచనం వగైరాలు చెప్పాడు. ౨ సమాసాలు, ౩ ధాతు ప్రత్యయాలు, లుక్ నియమాలు, ౪ స్త్రీప్రత్యయాలు, గోత్రప్రత్యయాలు, ౫ శబ్దాలు, ౬ సంధినియమాలు, స్వరనియమాలు ౭ ష, ణ, ఖ, ఛ వగైరా నియమాలు, ఇడాగమము, యుష్మదస్మద్ శబ్దాలు, ౮ ద్విరుక్త ప్రకరణం, ప్లుతము, పూర్వత్రాసిద్ధం.

ఈ పూర్వత్రాసిద్ధీయాధికారంలో పరశాస్త్రం పూర్వశాస్త్రాన్ని బాధించదు. పూర్వశాస్త్రం పరశాస్త్రాన్ని బాధించదు. అంటే ఈభాగంలో ఏదో ఒకసూత్రమే వర్తించుతుంది. 'మృత్ మయ' అని ఉంటే 'త'కారానికి అనునాసిక వచ్చి 'మృన్

మయ' అయింది. అప్పుడు ఇంకోసూత్రం వచ్చి 'న' కారాన్ని 'ణ' కారం చేస్తా నంటుంది 'మృణ్మయ' అని. కాని పూర్వత్రా సిద్ధియాధికారంలోనిది కాబట్టి ణకారం రాబోతున్నప్పుడు నకారం అసిద్ధమై కనపడ కుండాపోతుంది. తకార మున్నట్టుగా ణకార సూత్రానికి కనపడుతుంది. నకారం ఉంటే గాని ణకారం గాదు. అందువల్ల ణకార సూత్రం వెనక్కి తిరిగివస్తుంది. 'మృన్మయ' శబ్దమే సాధువు అవుతుంది.

ఇటువంటియుక్తులు అనేకం కల్పించి పాణిని శాస్త్రం నిర్మించాడు. ఈ శాస్త్ర నిర్మాణంలో పాణిని అసమానకౌశలము విదిత మౌతున్నది. ఏభాషకూ ఇటు వంటి వ్యాకరణశాస్త్రం లేదు. "ఏకః శబ్దః సమ్యక్ జ్ఞాతః సుష్ఠు ప్రయుక్తః స్వర్గే లోకే కామధుక్ భవతి"—శబ్దమొకటి బాగా తెలుసుకొని ప్రయోగించినట్టయితే స్వర్గలోకంలో మనపాలిట కామధేనువు అవుతుందిట. అటువంటి గట్టినమ్మిక ఉన్న వాళ్లు కాబట్టే ఆరోజుల్లో అటువంటిశాస్త్రం నిర్మించగలిగారు. ఇప్పుడు అపశబ్దం ఎందుకు ప్రయోగించావయ్యా అని ఎవరినన్నా అడి గితే 'ప్రయోగించాలని ప్రయోగించాను' అనే రోజులు. అపశబ్దప్రయోగమందు తాత్పర్యమున్నట్టయితే సాధువేదో తెలుసు కోవాలిగదా! పొరబాటున సాధుశబ్దం ప్రయోగించకుండా ఉండేందుకు. అందు కైనా వ్యాకరణం చదువుకోవాలి.





# శాస్త్రికాలేజీచదువు

[కథానిక]

●

= శ్రీ భమిడిపాటి శివరామకృష్ణశర్మ =

"ఉంచడమా, తీసెయ్యడమా?" ఇదే రామశాస్త్రికి పట్టుకున్న గట్టి సమస్య.

రామశాస్త్రి స్వగ్రామం పుల్లేటికుర్రు. అమలాపురం హైస్కూలులో చదివి స్కూలు ఫైనలు పరీక్షలో ఉత్తీర్ణు డయేడు. అట్టే తెలివితేటలు లేకపోయినా, అహోరాత్రాలూ కృషిచేయడంచేత పరీక్షలో మంచి మార్కులే వచ్చేయి. దాంతో శాస్త్రికి ఏ కాలేజీలోనో చేరి ఉన్నతవిద్య అభ్యసించాలనే ఉబలాటం ఎక్కువయింది. కుర్రాడి పట్టుదలవల్లనైతేనేమి, ఇరుగుపొరుగు వారి ప్రోత్సాహంవల్లనైతేనేమి శాస్త్రి తల్లిదండ్రులు అతణ్ని ఇంటరుమీడియటుక్లాసు చదివించేందుకు ఒప్పుకున్నారు.

శాస్త్రితల్లిదండ్రులు బాగా ఇంత వున్నవాళ్లనే చెప్పాలి. శాస్త్రితండ్రి పంచకావ్యాలూ పూర్తిచేసి వ్యవసాయం చూచుకోడం మొదలెట్టేడు. శాస్త్రి ఇంట్లో వున్నవాళ్లంతా పూర్తిగా పూర్వాచారపరాయణులే. శాస్త్రిమాత్రం ఆ వాసన లేకుండా ఎక్కడికి పోతుంది? శాస్త్రికి విశాలమైన కాటుకకళ్లు, కండలు తేరిన శరీరం, సామాన్యమైన పొడుగు, కొంచెం కొనతేరిన ముక్కు—అన్నీ బాగానే వున్నాయి. కాని, వెనకాల పిలకొక్కటిమాత్రం వచ్చింది! తల్లిదండ్రులు అతణ్ని పిలక వుంచుకోమని పట్టుబట్టలేదు. దాన్ని తీసేసేందుకు అతనికే ఎంతమాత్రం ఇష్టంలేదు. ఆ ప్రాంతాలలో ఇంకా పిలకలూ, సుండ్లూ తరచు చూస్తూవుండడంచేత శాస్త్రిని చూచి తక్కిన పిల్లలు అట్టే ఏడిపించేవారు కారు. ఇప్పుడు కాలేజీలో చేరబోతున్నాడు కనుక పిలక "వుంచడమా, తీసెయ్యడమా" అని రెండురోజులపాటు శాస్త్రి తీవ్రంగా ఆలోచనచేసేడు. చివరికి "కాలేజీకుర్రాళ్లయితేమాత్రం, నా పిలక ఏమైనా వాళ్ల కాళ్లకి అడ్డుపడుతుంది కనుకనా? అదీకాక, పిలక వున్నంతమాత్రంచేత పరీక్షలో మార్కులేమీ తగ్గించెయ్యరుకదా. అందుచేత ఇన్నాళ్లనుంచీ నాతోటే వుంటూవచ్చిన ఈ పిలకని, పాపం, ఇప్పుడెందుకు తీసెయ్యాలి?" అని సమాధానపరచుకొని పిలక వుంచుకొనేందుకే నిర్ణయించుకున్నాడు శాస్త్రి.

* * *

ప్రొద్దుట్నే ప్రిన్సిపలుగారిని కలుసుకునేందుకు కాలేజీకి వెళ్లేడు శాస్త్రి. అక్కడ ఎవరూ లేరు.

అంతా నిశ్శబ్దంగా వుంది. "వచ్చేవేళ ఇంకా కాలేదేమో" అనుకొని అక్కడే చతికిలపడ్డాడు. అంతకంతకీ ఎండ ఎక్కువవుతోంది. ఎవరూ రావడంలేదు. దూరాన్నుంచి తొమ్మిదిగంటలు వినబడ్డాయి. ఇంకో అరగంట గడిచింది. ఎవరూ రావడంలేదు. "ఛీ, ఇదేం కాలేజీ! మా హెడ్మాష్టరుగారు పదింటికి వచ్చేవారు, ప్రిన్సిపలుగారు అధమపక్షం తొమ్మిదింటికైనా రావద్దా?" అని విసుక్కుంటూంటే దూరాన్నుంచి ఎవరో వస్తోన్నట్లు అనింది. "ప్రిన్సిపలుగారే కాబోలు, అంత ఠీవిగా వస్తున్నారు" అనుకొని చటుక్కున లేచి నిలుచున్నాడు. "ఇంకా అంత దూరంగా వుండగానే అప్పుడే నుంచోడం ఎందుకు" అనుకొని మళ్లీ కూర్చున్నాడు. "వచ్చీరాగానే ఈ పిలకాడిదర్శన మేమిట్రా అనుకొని ప్రిన్సిపలుగారు అసహ్యపడతారేమో" అని సందేహించి, ఆయన స్తిమితంగా కూర్చున్నాక వద్దామనుకొని లేచి గబగబా పక్కకి వెళ్లేడు. కొంచెం సేపు అటూ ఇటూ తిరిగి మళ్లీ వచ్చి చూసేటప్పటికి తిరాచేసి ప్యూను టేబిలు దులుపుతున్నాడు! "ఇంకా అయ్యవారు రాలేదు కాబోలు" అనుకుని వెనక్కి తిరగబోతూంటే "ఎప్పుడు వచ్చేరండీ అబ్బాయిగారూ? రండి, రండి." అంటూ వినయం వుట్టిపడేలాగ పలకరించేడు ప్యూను. "ఏమిటీ, ఇంతకుముం దెప్పుడూ వీడి ముఖం నేనెరగను, నా ముఖం వీడెరగడు, ఇంత మర్యాదగా పిలుస్తాడు?" అనుకొని, తెల్లబోతూ—

"ప్రిన్సిపలుగారు ఎప్పుడు వస్తారు?" అని నసిగేడు శాస్త్రి.

"ప్రిన్సిపలుగారాండి? ఇంకా రాలేదండి— ఏదో మీ దయ"—

"ఆ! ప్రిన్సిపలుగారు వచ్చేందుకు నా దయ ఏమిటోయ్?"

"అదికాదండీ అబ్బాయిగారూ — మా మామూలు—"

"ఇంకా కాలేజీలో అడుగేనా పెట్టలేదు, అప్పుడే నీకు మామూలు కావాలా? ఏం న్యాయంగా వుందోయ్?"

"చెబితే నమ్మరుకాని బాబయ్యా, ఇవాళ ఇంకా కాఫీకూడా తాగలేదండి."

"నువ్వు అలా అంటావుకాని, నేనుమాత్రం తాగేనా ఏమిటి?"

"అయితే, ఇద్దరం వెళ్లి తాగివద్దాం, రండి" అంటూ ముందు కొక అడుగు వేసేడు ప్యూను శాస్త్రి లోకువ కనిపెట్టి. "ఇంక ఈ ఘటం ఎలాగా వదిలేలా లేదు, ఎప్పుడోప్పుడు ఎలాగా పారెయ్యాలికదా" అనుకొని శాస్త్రి ఓ పావలా కాసు తీసి అతని చేతిలో పెట్టేడు. అది పుచ్చుకుని మరి మాట్లాడకుండా గదిలోకి వెళ్లిపోతున్నాడు ప్యూను. "ఏయ్, పావలా పుచ్చుకునికూడా నేను అడిగినదానికి సమాధానం చెప్పవేం?" అని అరిచేడు శాస్త్రి.

"చాల్లెండి, ఇంతోటి పావలా ఎలాగైతేనేం ఇచ్చేరు!"

"ఇంతోటిపావలా కాకపోతే, ఇంతకంటే పెద్ద పావలాలు ఇప్పుడు రావడం లేందే మరి!"

ప్యూనుకు నవ్వొచ్చింది.

"అబ్బో, ప్రిన్సిపలుగారు ఇప్పుడప్పుడే ఎలా వస్తారండి? మధ్యాహ్నంకాని రారు." అంటూ టేబిలు సర్దడం మొదలెట్టేడు.

"ఇంతోటి సమాధానానికి ఇంతోటి పావలా సరిపోయింది కాదు కాబోలు ఈయనకి" అని గొణుక్కుంటూ వెళ్లిపోయేడు శాస్త్రి.

మధ్యాహ్నం మళ్లీ శాస్త్రి వెళ్లేటప్పటికి ప్రిన్సిపలుగారు గదిలో వున్నారు. శాస్త్రి ఆయనగదిలో ప్రవేశించి చూసేటప్పటికి నలుగురైదుగురు ఆడపిల్లలు ప్రిన్సిపలుగారి టేబిలు కెదురుగా నుంచునివున్నారు. గదినిండా కుర్చీలూ అవీ అమర్చబడివుండడంచేత వాళ్ల ప్రక్కనిమాత్రమే కొంచెం స్థలముంది. "పూర్తిగా వయసొచ్చిన అమ్మాయిల ప్రక్కని నుంచోడ మేమిటి" అనుకొని శాస్త్రి ప్రిన్సిపలుగారి కుర్చీ ప్రక్కకి వెళ్లి నుంచున్నాడు. "ఏయ్, నీ కేమీ మేనర్సు లేవా, మీద కొచ్చి పడతావు? అక్కడకు పోయి నుంచో." అని గర్జిస్తూ, ఎదురుగా వున్న గోడవైపు చూపించేడు ప్రిన్సి

పలు. శాస్త్రి హడలిపోతూ గబగబా వెళ్లి, ఆడపిల్లలకు సాధ్యమైనంత దూరంలో వుండాలనుకొని, గోడ మూలకు ఒత్తిగిలి నుంచున్నాడు. ఆడపిల్లలందరికీ కాలేజీలో సీట్లు ఇయ్యడమయింది. వాళ్లంతా, టేబిలుమీద పడేసివున్న ఎవరి కాగితాలు వాళ్లు తీసుకుంటున్నారు. ఇంతలోనే ప్రిన్సిపలు శాస్త్రిని పిలిచి "నీ సర్టిఫికెట్లూ అవీ తెచ్చేవా? ఏవీ, ఇలా తీసుకురా" అన్నారు. శాస్త్రి ముందుకు వెళ్లబో యేడు. వెనకాలనుంచి ఎవరో పిలక పట్టుకొని లాగుతూన్నట్లు అనిపించింది. శాస్త్రి ప్రిన్సిపలు గారి గదిలో వున్నానన్న సంగతే మరచిపోయి "ఏయ్, వదులు" అని అరుస్తూ బుర్రనొకమారు టకాయించేడు. గోడనున్న మేకు ఒకటి నేలమీద పడి 'ఖంగు'మని మ్రోగింది. అప్పుడే వెళ్లిపోతూన్న అమ్మాయిలందరూ ఒక్కసారి ఫక్కున నవ్వేరు. ప్రిన్సిపలు కూడా కొంచెం నవ్వుతూ, "చవ్వాని తీసుకురా" అన్నారు. శాస్త్రి తీసుకెళ్లి చూపించేడు. అన్నీ చూచేక "సరే, రేపురా. ఆలోచించి చెబుతాను." అన్నారు ప్రిన్సిపలు. శాస్త్రి "చిత్తం" అని సెలవు తీసుకొన్నాడు. తన గదికి తిరిగి పోతూంటే శాస్త్రికి ఎన్నో అనుమానాలు వచ్చేయి. "ఆడపిల్లలకంటే నే లేవిగా తీసిపోయానని వాళ్లను వెంటనే చేర్చుకొని, తనకు ఆలోచిస్తానన్నారు! — కొంపతీసి, నాకు పిలక వుందని కాదుకదా! — ఏమో — ఇంతకీ ప్రిన్సిపలుగారిది పిలకో కాదో తెలుసుకుందా మనుకుంటే, ఆయన తలపాగా పెట్టుకొని కూర్చున్నారు కదా! దేముడే నాపక్షంలో వుంటే, ఆ తలపాగాలో వున్నది పిలకేఅయితే నాకేం ఫరవాలేదు, తప్పకుండా సీటు వస్తుంది" అనుకున్నాడు శాస్త్రి.

శాస్త్రికి సీటు ఇచ్చేమన్నారు. అతని కింకేమీ అనుమానం లేదు. "ఉత్తినే భయపడ్డాను కాని, ప్రిన్సిపలుగారిది పిలకే అయివుంటుంది" అని నిర్ణయించుకున్నాడు శాస్త్రి.

*   *   *   *

క్లాసులు మొదలెట్టేరు. మొదటి రోజునే శాస్త్రివాలకం చూసి తక్కిన పిల్లలంతా లోకువకట్టేసేరు. శాస్త్రి గదిలోకి అడుగు పెట్టగానే అందరూ తలోమాటా అనడం మొదలెట్టేరు. శాస్త్రి "పిల్లలో నేమిటి నాకు? మదగజం పోతూంటే ఎన్నో కుక్కలు మొరుగుతుంటాయి" అని లోలోపలే అనుకుని, వాళ్లకి ఏ విధమైన సమాధానమూ చెప్పదలచుకో లేదు. మేష్టరు కూర్చునే కుర్చీకి ముందే ఒక బెంచీ ఖాళీగా వదిలివేసివుంది. ఒక్కడూ మేష్టారుదగ్గరే కూర్చుంటే, వీళ్లెవరూ ఇంకేమీ అనరుకదా అనుకుని శాస్త్రి ఆబెంచీమీద కెళ్లి కూర్చున్నాడు. అప్పటిదాకా పెద్దపెట్టున పిల్లలు చేస్తూన్న గోలంతా ఒక్కసారిగా అణిగిపోయింది. ఒకళ్లతో ఒకళ్లు సణుగుకుంటూ చిరునవ్వులు మొదలెట్టేరు. శాస్త్రి, అఖండ విజయాన్ని సాధించే ననుకుని, సగర్వంగా కాలిమీద కాలు వేసుకుని కూర్చున్నాడు. మేష్టారు వచ్చేరు. ఇంతలో ఆడపిల్లలు వచ్చి శాస్త్రిని చూచి అక్కడే నిలుచుండిపోయేరు. మేష్టారు కోపంతో "నీకు బుద్ధి వుందా లేదా, ఇక్కడ కూర్చున్నావు? వెనక్కిపోయి కూర్చో"అని శాస్త్రిని గదమాయించేరు. పిల్లలంతా (అమ్మాయిలతో సహా) గొల్లుమన్నారు. శాస్త్రికి ఏమీ అర్థమవడం లేదు. "ఇంతగోల చేస్తూంటే, వీళ్లనేమీ అనకుండా, మాట్లాడకుండా ఒక్కణ్ణీ కూర్చున్న నామీద కోప్పడతాడేమిటి యీయన?" అనుకుంటూ లేచి నుంచుని పుస్తకాలు తీసుకుంటూంటే ఓ అనుమానం వచ్చింది. వెంటనే మేష్టారు తలపైపు చూచేడు. ఏదో అర్థమయిపోయినట్లు తల కొంచెం వూపుతూ "ఓహో, అదీ సంగతి. మేష్టారుది పిలక కాదు, క్రాపింగు. అందుచేతే—" అని మనసులో అనుకుంటూ వెనకాలకి వెళ్లడం మొదలెట్టేడు. ఎవరూ చోటు ఇవ్వడం లేదు. ఇంతలోనే ఓ పరిచితమయిన కంఠం తనపేరు మెల్లిగా పిలుస్తూన్నట్లనిపించింది. ఆవైపు చూచేసరికి, వాళ్లవూరి రాజులఅబ్బాయి అక్కడకు రమ్మని సంజ్ఞచేసేడు. శాస్త్రి వెళ్లి, కూర్చొని, మెల్లిగా "ఒరే నారాయణరాజూ, నన్ను మేష్టారు కోప్పడుతూంటే మీరంతా ఎందుకురా అలా విరగబడి నవ్వడం! ఇదేనా తోటి విద్యార్థులు చూపించవలసిన మర్యాద! ఇంకెందుకురా యీ చదువులు—"

"నవ్వడం తప్పేకాని, ఒక్క, ఆ బెంచీ ఆడపిల్లలకది ప్రత్యేకించిందిరా. దానిమీద కెళ్లి నువ్వు కూర్చున్నావు" అన్నాడు రాజు.

"నాకు తెలియక కూర్చున్నాననుకో, నాతో చిన్నప్పటినుంచీ స్నేహంగా వుంటూన్న నువ్వేనా నన్నక్కడ కూర్చోవద్దని చెప్పొద్దురా ?"

"నేను చెబుదామనే అనుకున్నారా. కాని, వీళ్లంతా 'చెబితే తంతా' మన్నారు. ఏం చెయ్యమన్నావు!"

గంట కొట్టేరు. మేష్టారు వెళ్లిపోయేరు. గదిలో ఓమూలనుంచి ఎవరో "పిలక్"అని కేకేసేరు. శాస్త్రి అప్రయత్నంగా ఆవైపుకు తిరిగి చూచేడు. ఇంతట్లోకే ఇంకోమూలనుండి ఎవరో "పిలకా" అని దీర్ఘం తీసేరు. శాస్త్రి చటుక్కున ఆ వైపుకు తిరిగి చూస్తూంటే వెనకాలనుంచి ఇంకొకరు "పిలకోయ్" అని ఆప్యాయంగా కేకేసేరు. శాస్త్రి ఆవైపుకు తిరగబోతూంటే ఒక్కసారిగా గదిలో అన్ని మూలలనుంచీ "పిలక" అనేక రూపాలతో మారుమ్రోగిపోతోంది. శాస్త్రికి పట్టరానంతకోపం వచ్చింది. పళ్లు పటపట కొరుకుతూ లేచి నుంచున్నాడు. వాళ్లందరిమీదా పడి ఒక్కసారిగా నలిపి చంపేద్దామా అన్నంత ఉక్రోషం వచ్చి మనిషి నిలువెల్లా కంపించిపోతున్నాడు. ఇంతలో ప్రక్కనున్న రాజు శాస్త్రిచెయ్యి పట్టుకుని కూర్చోపెట్టి—

"కొంచెం శాంతించరా శాస్త్రీ. నువ్విలా ఉడికిపోయేవంటే ఇంకా ఏడిపిస్తారు. నిన్ను కాదన్నట్లు వూరుకోవడం ఉత్తమం" అన్నాడు.

"నీకేంరా చెబుతావు. వీళ్లంతా ఇంత గొడవ చేసేస్తూంటే వింటూ ఎలాగరా వూరుకోవడం ?"

"నామీద కోప్పడతా వెందుకురా మధ్యని ? ఊరుకోకపోతే ఏం చేస్తావేమిటి ?"

"ఏం చేస్తానా ? ఒక్కొక్కడ్నీ పట్టుకొని మెత్తగా పచ్చడికింద దంచేస్తానంతే. దాంతో వీళ్లందరి రోగం చప్పగా వదిలిపోతుంది."

"ఒకరిద్దరైతే కొట్టగలవనుకో. అంతమందీ కలిసి మీదపడితే ఏం చెయ్యగలవు ?"

"నిజమేరా— ఏడవనీ వెధవల్ని." శాంతించేడు శాస్త్రి.

* * *

శాస్త్రికి ఆ గొడవంతా మామూలయిపోయింది. క్లాసులో ఎవరితోటీ మాట్లాడేవాడు కాదు. ఒక్క నారాయణరాజుతో మాత్రం కలిసి తిరుగుతూండేవాడు. కొంతకాల మయేటప్పటికి నారాయణరాజుని "రాజు" గారనీ, శాస్త్రినేమో "దివాను"గారనీ పిలిచేవారు. అలా అంటూంటే శాస్త్రి నిజంగా దివానువైనంత సంతోషపడేవాడు. ఎటొచ్చీ ఆ "దివాను"తో "పిలక" కూడా సర్వసాధారణంగా కలుపుతూవుండడం శాస్త్రికి ఎంతమాత్రం ఇష్టంలేదు. అతనికి ఇష్టం లేదుకదా అని వాళ్లు మానుతారుకనకనా ? ఆఖరికి ఆడపిల్లలుకూడా తన్ను "పిలకా" అంటూన్నట్లు శాస్త్రికి చాలాసార్లు అనుమానం తగిలింది. కాని శాస్త్రి "వీళ్లతో నేమిటిలే" అనుకొని వాళ్లకేసైనా చూడకుండా పోతూండేవాడు.

శాస్త్రి గబగబా బుర్ర వంచుకొని క్లాసులోకి వెళుతున్నాడు. ఇంకా మేష్టరు రాలేదు. ఆడపిల్లలంతా బైట నుంచున్నారు. శాస్త్రిని చూచి అందులో ఒకరు "పిలకదివానుగారే, తప్పుకో" అంది. అంతా విరగబడి నవ్వడం మొదలెట్టేరు. శాస్త్రి చటుక్కున ఆగిపోయేడు. అతని ముఖం జేవురించింది. శాస్త్రికి "దివాను" అన్నందుకూ, "పిలక" అన్నందుకూ అంత కోపం రాలేదుకాని, యిరవైయేసి ఏళ్లు నెత్తిమీద కొచ్చిన ఆడపిల్లలు సిగ్గూ లజ్జా లేకుండా విరగబడి నవ్వుతూంటే అరికాలిమంట నెత్తికెక్కిపోయింది. శాస్త్రికి ఒళ్లు తెలియడం లేదు. "నేను దివానైనా కాకపోయినా, మీరుమాత్రం అచ్చంగా దివాణంలో దాసీ వాళ్లలాగ వున్నారు" అన్నాడు శాస్త్రి గంభీరంగా.

"ఛీ, నోరుముయ్. ఉత్తి అడివిమృగంలా వున్నావే!" అంది ఒకత్తి.

"నాకేం నోరు మూసుకొనేదాకాను ? దివానుగారి ఆజ్ఞ. మీరే నోరుమూసుకోండి" అన్నాడు.

"ఏడిసేవులే, సంతోషించేం" అంది ఒకత్తి.

"చెప్పదెబ్బలు తగులుతాయి" అంది యింకొకత్తి.

"తగులుతే మళ్లీ తగులుతాయి, పిలకుందికదా అని ఉత్తి చేతకాని దద్దమ్మననుకుంటున్నారేమో." అని హుంకరించేడు శాస్త్రి.

"తగుల్తాయూ? చూద్దాం!"—అని చెప్పు విసిరింది ఒకత్తి.

అది శాస్త్రి చేతిని రాసుకుంటూ పోయింది. ఆ విసరినదాని పీక అమాంతంగా నొక్కేయ్యాలనుకొని శాస్త్రి, ఒక్క అడుగు ముందుకు వేసేడు. ఇంతట్లోకి ఏం తోచిందో, ఆగిపోయి, వెనక్కి తిరిగివచ్చి, ఆ చెప్పు తీసి చేత్తో పట్టుకొని, "ఆడవాళ్లు అయిపోయేరు కాని, ఇవాళ యీ కాలేజీ అంతా కలిసి వచ్చినా వాళ్ళ శక్తి చూదివుండేవారు" అంటూ శక్తికొలదీ ఆ చెప్పును దూరంగా విసిరేసేడు. కొంతమంది కుర్రాళ్లు ఆ గొడవంతా నిశ్శబ్దంగా చూస్తున్నారు. తరువాత వాళ్ళలో వాళ్లు ఏదో రహస్యంగా మాట్లాడుకుంటున్నారు. ఇంతలోకే మేష్టారు వచ్చేరు. అందరూ లోపలి కెళ్లి కూర్చున్నారు.

కాలేజీ వదిలిపెట్టేరు. కుర్రాళ్లంతా "చుంచు", "చుంచు" అని కేకలేస్తున్నారు. "దివాను," "పిలక" వదిలేసి "చుంచు" అని క్రొత్తపేరు పెట్టి నన్ను ఏడిపించదలచుకున్నారు లావుంది వీళ్లంతా" అనుకుంటున్నాడు శాస్త్రి. ఇంతట్లోకే నారాయణ రాజుకూడా 'చుంచు' అని గట్టిగా అరవడం చూచి శాస్త్రి నిర్ఘాంతపోయేడు. ఇంతవరకూ రాజు ఒక్కడే అతన్ని ఏడిపించకుండా వున్నవాడని శాస్త్రి అనుకుంటున్నాడు. రోజూ రాజుతో కలిసి గదికి పోతూవుండేవాడు. ఇవాళ రాజును కలుసుకోకుండానే, ముఖం ముణుచుకొని, గబగబా వెళ్లిపోతున్నాడు. వెనకాలనుంచి రాజు వచ్చి, శాస్త్రి భుజం మీద చేయివేసి—

"ఏరా, మాట్లాడకుండానే వెళ్లిపోతున్నావు" అన్నాడు.

భుజంమీద వేసిన చేయ్యి తోసేసి "వెళుతూ" అన్నాడు శాస్త్రి.

"అంత కోపంగా వున్నావేరా, ఇవాళ?" అన్నాడు రాజు.

"అబ్బ, నన్నిలా పోనిద్దూ, నీకు పుణ్యం వుంటుంది!"

"ఇవాళ ఏదో వుంది విశేషం. నాతో చెప్పకూడదేమిట్రా శాస్త్రీ?"

"చాల్లేరా, ఏమీ తెలియనట్లు మాట్లాడుతావు!"

"నాకు నిజంగా తెలియదురా బాబూ. చెప్పదూ."

"చెప్పేందుకేముంది? నువ్వూ వాళ్లలోని చేరేవు కాదుటోయ్?"

"రామ, రామ! వాళ్లందరితోటీ చేరడమేమిటి?"

"ఆ, ఆ! చూడకపోతే మరీ చెలుదువు. వాళ్లతో చేరి 'చుంచు' అని పిలవడం లేదురా? ఎందుకురా యీ మాత్రందానికి అబద్ధమాడడం?"

"'చుంచు' అంటే నీకేంరా మధ్యని?"

"నీకు అలాగే వుంటుందిరా మరి—కాదుకాని, నువ్వుకూడా నన్ను ఏడిపించడం నీకు బాగుందా చెప్పు."

"నిన్ను ఏడిపించడం లేదురా బాబూ. నిన్న యిందాకా కొట్టిన అమ్మాయినిరా 'చుంచూ' అంటోంట. ఇందాకా ఆ అమ్మాయిపొగరుమోత్తనం చూచి, అందరూ దాన్ని ఏడిపించాలని నిర్ణయించుకున్నారు."

"నేను నమ్మనురా—"

"కావలిస్తే ఆ అమ్మాయిమూతి ఓసారి చూడరా బాబూ, నీకే అర్థమయిపోతుంది."

"ఆ అమ్మాయినయితేమాత్రం, అలా పేర్లు పెట్టి ఏడిపించడం నాకేమీ ఇష్టంలేదురా."

"ఏడిసేవులే! నీ యిష్టమెవరికి కావాలి?"

"అదికాదురా—" అని యింకా ఏదో చెప్పబోతూంటే ఓ పూర్యాను వచ్చి "రామశాస్త్రిగారు మీ

"లేదా" అని అడిగేడు. శాస్త్రి 'ఔ'నన్నాడు. "మిమ్మల్ని ప్రిన్సిపలుగారు ఓమారు రమ్మంటున్నారు" అన్నాడు ప్యూను. శాస్త్రి వెళ్లేడు.

"నువ్వు ఆడపిల్లలను చాలా అవమానపరిచేవని వాళ్లంతా రిపోర్టుచేసేరు. నిజమేనా?" అని అడుగుతూ, శాస్త్రి సమాధానం చెప్పకుండానే, అమ్మాయిల విషయం కలగజేసుకున్నందుకు తలవాచేటట్లు తిట్టడం ప్రారంభించేరు ప్రిన్సిపలుగారు. శాస్త్రి అందులో తన తప్పేమీ లేదని చెప్పదా మనుకున్నాడు. కాని ప్రిన్సిపలుగారు అతన్ని నోరు ఎత్తనియ్యలేదు. ప్రిన్సిపలుగారు నోరు నొప్పిపెట్టేదాకా తిట్టి, చివరని "నీకు అయిదురూపాయిలు జరిమానా వేసి, యీ మాటుకు క్షమించేను. ఇంకెప్పుడైనా నువ్విలా ప్రవర్తించేవని తెలిస్తే నీచదువుకే నీరువదులుకోవలసి వస్తుంది. జాగ్రత, పో." అన్నాడు. శాస్త్రి యింత సేపూ తలవంచుకొని నిలుచున్నాడు. అతని కండ్ల వెంట నీళ్లు తిరిగేయి. ఆఖరికి ధైర్యం తెచ్చుకొని "అన్యాయం" అని అరచి, తలఎత్తి చూచేడు. ప్రిన్సిపలు అక్కడ లేడు. "ఇంక యిక్కడ నుంచోడ మెందుకు! గదికి వెళ్లి గట్టిగా ఏడవచ్చు" ననుకొని మెల్లిగా బయలుదేరేడు. ఈమారు "ప్రిన్సిపలుగారి తలపాగా క్రింద వున్నది పిలక కాదు, క్రాపింగే అయి వుంటుంది" అని నిర్ణయించుకొన్నాడు, గదిగుమ్మం ఎక్కుతూ.

శాస్త్రికి యిలాంటి గొడవలూ, ఆలోచనలతోటే కాలమంతా గడిచిపోతూవుండేది. కాలేజీకి వెళ్లడం, గదికి రావడం తప్ప యింకేమీ పరికించేవాడు కాదు. ఎవరిజోలికి గాని పోయేవాడూ కాదు. అలాగే మొదటిసంవత్సరం గడిచిపోయింది.

* * * *

మళ్లీ కాలేజీలు తెరిచేరు. శాస్త్రిని ఎవళ్లూ అంతగా ఏడిపించడం మానేసేరు. ఎవరేనా ఓమాట అన్నప్పటికీ, శాస్త్రి మళ్లీ తమాషాగా ఏదో అనడం, అందరూ కలిసి నవ్వుకోడంతోటే పోతూవుండేది. శాస్త్రి యీమారు శాస్త్రబుర్రఎత్తి, కళ్లు విప్పి నాలుగు విషయాలూ పరికించడం మొదలెట్టేడు. ఇదివరకటి దాకా కాలేజి విద్యార్థులలో ఒక్కరికీకూడా చదువు మీద యీషన్మాత్రమైనా శ్రద్ధలే దనుకొనేవాడు శాస్త్రి. కాని యిప్పుడు కుర్రాళ్లంతా ముందు బెంచీల కోసం దెబ్బలాడుకోవడం చూచేడు. "నాది పొరబాటేరా, రాజూ. వీళ్లంతా మేష్టారుదగ్గరగా కూర్చుని పాఠం వినాలని ఎలా పోట్లాడుకుంటున్నారో చూడు." అన్నాడు ఓరోజున శాస్త్రి పక్కనున్న రాజుతో.

"అదంతా పాఠాలమీద శ్రద్ధ కాదురా బాబూ. అమ్మాయిలకు సాధ్యమైనంత దగ్గరలో కూర్చోవాలని వాళ్ల ఉబలాటం."

"అంతే నంటావా?"

"నువ్వెక్కడ మనిషివిరా బాబూ!"

"అయితే, వాళ్లదగ్గరగా కూర్చున్నంతమాత్రంలో వాళ్లకు కలిగే లాభమేమిటో!"

"ఏమిటో, ఏంచెబితేమాత్రం నీకు అర్థమవుతుందిరా—ఏం, నీకుకూడా అక్కడ కూర్చోవాలని వుందా ఏమిటి?"

"ఛా, ఛా! అందుకు కాదురా–"

"ఆహా, మొహమాటం పడకు."

"కాదుకాని, ఒరే, ఇందాకా ఆ అమ్మాయితో ఏమిట్రా మాట్లాడుతున్నావు?"

"ఏంలేదురా. ఆ అమ్మాయి'నోట్సు' ఓమారు అడిగేను."

"పోరా, నీ దబాయింపులకు లొంగిపోతా ననుకున్నావు. ఒరే, ఇంతకాలంనుంచీ మన ఇద్దరం స్నేహితులంకదా, 'నోట్సు' నన్ను అడగక ఆ అమ్మాయినే ఎందుకు అడగవలసివచ్చిందిరా? ఎవరైనా నమ్ముతారంటావా నీ మాట?"

"నువ్వు నాకు ఎలాగ స్నేహితుడవో, ఆమె కూడా అలాగే స్నేహితురాలు కాకూడదుట్రా?"

"ఓస్, ఇంక కట్టిపెట్టవోయ్ నీ వేదాంతాలు. నాలాగే ఆమెకూడా స్నేహితురాలయితే, ఆ రెప్ప వాల్చకుండా చూడడా లెందుకు! వెనకవెనక తిరగడా లెందుకు? ఎందుకో తెలియకుండా, ఆమె

నవ్వింది కదా అని నవ్వడా లెందుకు? నాకేసి ఎప్పుడైనా అలా చూసేవా? పోనీ, నాకు పిలకుందికదా అని చూడలే దనుకో. ఇంకే మగకుర్రాడికేసైనా అలా చూస్తావా?—ఎందుకురా అబద్ధాలాడుకోడం?"

"అదంతా నీలాంటివాళ్లకి అర్థమవదులేరా."

"అర్థమవకేం, వచ్చినంత అర్థమయింది. నువ్వు దానికి ఒప్పుకోవంతే."

"అలా అనుకునే పట్టీలుకొట్టడం. నీ ఇష్టం వచ్చినట్లు అనుకో."

ఆవేళకి ఆ ప్రసంగం ఇంకేమీ రాలేదు. ఏమైనా, ఆడపిల్లలూ మగపిల్లలూ కలిసి అంత విచ్చలవిడిగా తిరగడం శాస్త్రికేమీ నచ్చలేదు. ప్రతివాడూ ఏదో వంక కల్పించుకుని చీటికీమాటికీ ఆడపిల్లలదగ్గరకు పరిగెత్తుతూండడం, వీళ్లు ఎప్పుడు వస్తారా అని వాళ్లూ ఎదురు చూస్తూండడం చూస్తూంటే శాస్త్రికి మతిపోయేది.

వాళ్ల క్లాసులోనే 'శోభావతి' అనే అమ్మాయి వుంది. నవీనత్వమంతా ఆమెలో కనబడుతూవుంటుంది. ఆమెపోకలు, వేషాలు, విలాసాలూ ఆ కాలేజీలో వున్న వాళ్లందరినీ (కొందరు మేష్టార్లతో సహా) ఆకర్షించేవి. శాస్త్రికూడా ఆమెలో ప్రత్యేకత గుర్తించకుండా వుండలేకపోయేడు.

శాస్త్రిగదికి పోయే దారిలోనే వుంది ఆమె వుండే యిల్లు. అవైపు వెళ్లినప్పుడల్లా శాస్త్రికళ్లు అప్రయత్నంగా ఆమెగదిమీద పడుతూండేవి. ఎప్పుడు చూచినా నలుగురైదుగురు మగవాళ్లతో కలిసి నవ్వుతూ కులాసాగా కబుర్లు చెబుతూనేకాని, ఒంటరిగా ఎన్నడూ కనిపించలేదు. అక్కడికి రాకుండా, ఆమె 'టీ' తాగకుండా వున్న కుర్రాడు ఒక్కడూ కనిపించలేదు శాస్త్రికి. 'ఆమెతత్త్వం ఏమైవుంటుందా' అని శాస్త్రి అహోరాత్రాలూ ఆలోచించేవాడు. ఒకొక్కప్పుడు అదంతా ప్రేమ అనుకొనేవాడు. వెంటనే "ఇంతమందినీ ఒక్కసారిగా ఎలా ప్రేమిస్తుంది ఈ విడ?" అనుకొనేవాడు. ఏమీ అర్థంకావడంలేదు. ఓ రోజురాత్రి ప్రక్కమీద పడుకొని "ఎలాగైనా శోభతో (శోభావతిని అందరూ 'శోభ' అనేవారు) పరిచయం కలిగించుకొని, ఆమె ప్రవర్తన జాగ్రతగా పరిశీలించి, ఆమెబలహీనత్వానికి తగిన బుద్ధి చెప్పాలి" అని అనుకుంటూ, తల నిమురుకుంటూంటే చేతికి పిలక తగిలింది. శాస్త్రి కొంచెం నవ్వుకొని "అంతకంతకీ ఇంత తెలివితక్కువవాడనై పోతున్నానేం? ఎందుకీ అసంభవమైన ఆలోచనలు! ఈ పిలక వున్నంతకాలం మొగపిల్లలే నాతో సరిగా మాట్లాడకుండావుంటూంటే, ఆడపిల్లలు నాతో మాట్లాడుతారా? అందులోనూ శోభా? అబ్బ!—అయినాకాని, ఆవిడ ఎలా పోతే నాకెందుకు? రాత్రింబగలూ దాన్నిగురించే ఆలోచిస్తూ ఎందుకిలా బుర్రంతా పాడుచేసుకోవడం? ఈ పాడుగొడవలోబడి చదువూ సంధ్యా ఎగిరిపోయేయికదా—రేపటినుంచి ఏమైనా సరే, శోభ పేరైనా తలపెట్టకూడదు. అసలు ఆవైపు చూడనేకూడదు—" అనుకుంటూండగానే నిద్రపట్టిపోయింది.

మర్నాడు శాస్త్రి కాలేజీకి పోతూంటే, వద్దనుకుంటూన్నా అతని కళ్లు శోభగదిమీద పడ్డాయి. శోభ గబగబా బయటికి వచ్చి "శాస్త్రిగారూ" అని పిలిచింది. శాస్త్రి, ఇంకెవరినో అనుకొని, వెళ్లిపోతున్నాడు. "మిమ్మల్నేనండీ శాస్త్రిగారూ" అని శోభ మళ్లీ పిలిచింది. శాస్త్రి అనుమానిస్తూనే దగ్గరికి వెళ్లేడు. "మీరేమీ అనుకోకుండా, ఈ సెలవుచీటీ కాస్త పట్టికెళ్లి ఇస్తారా." అంటూ చీటీ అందియ్యబోయింది శోభ. శాస్త్రి కంగారుతో "అబ్బెబ్బే, ఏమీ అనుకోను" అంటూ చేతిలో వున్న పుస్తకాలు చంకలో పెట్టుకొని దోసిలి పట్టేడు. శోభ నవ్వునాపుకొని చీటీ అందులో పడేసి 'థాంక్స్' అంది. శాస్త్రి ఆకంగారులో 'ఊ' మాత్రం అనేసి బయలుదేరేడు. వెళుతూ వెళుతూ పిలక వుందో లేదో ఓసారి చూచుకున్నాడు.

శోభది విచిత్రమైన నైజం. నిజానికి ఆమెలో దురుద్దేశా లేమీ లేవు. తక్కిన వాళ్లకన్న విశిష్టంగా వుండాలని ఆమెకోరిక. అందరూ తనతో మాట్లాడాలనీ, అందరూ తనను మెచ్చుకోవాలనీ, అందరినీ తన చేతిలో వుంచుకోవాలనీ ఆమె ఆశిస్తూవుండేది. డాబైన అలంకరణాలతోటీ, తీయని కబుర్లతోటీ,

తరల తారకాలతోటీ, చిరునవ్వులతోటీ అందరినీ ఆకర్షించేది. ఎవరినీ ప్రోత్సహించి ఆహ్వానించేది కాదు. కాని, వచ్చినవాళ్లందరితోటీ కులాసాగా కాస్సేపు కబుర్లు చెప్పి, టీ ఇచ్చి పంపించేది. అదే ఆమెకు ఆనందం. ఎంతెంతటివాళ్లయినా వచ్చేవారు. శాస్త్రిమాత్రం ఎన్నడూ మాట్లాడలేదు. "శాస్త్రిమాత్రం ఎందుకు రాకూడదు? ఎందుకు నాతో మాట్లాడకూడదు?" అని శోభ అప్పుడప్పుడు బాధపడుతూవుండేది. "ఒక్కసారైనా శాస్త్రి రాకుండాపోతాడా, చూస్తాను." అని గడచిన సంవత్సరమంతా చూచింది. ఈ సంవత్సరం కూడా జరిగిపోతోంది. శాస్త్రి రావడం లేదు. శోభ ఇంక ఉండబట్టలేకపోయింది. "అతడు వచ్చి నాతో మాట్లాడకపోయినా, రేపు నేనే పలకరించి చూస్తాను" అని నిర్ణయించుకుంది శోభ. ఆనాడు శాస్త్రిని పిలిచి టీ ఇయ్యడానికి కారణం అదే.

శాస్త్రి కాలేజినుంచి గదికి పోతూంటే మళ్లీ పిలిచింది శోభ. శాస్త్రి కొంచెం సిగ్గుపడుతూ గదిలోకి వెళ్లి కూర్చున్నాడు. శోభ స్వయంగా టీకలిపి శాస్త్రిముందు పెట్టి 'పుచ్చుకోండి' అంది. "అబ్బే, నే నెప్పుడూ ఇలాంటివి త్రాగనండి" అన్నాడు శాస్త్రి. "ఇవాళటికి కాదూ, కొంచెమే పుచ్చుకోండి" అంది శోభ. "నాకు ఇష్టం లేదంటూంటే చాలనా ఏమిటి?" అన్నాడు శాస్త్రి కొంచెం విసుగ్గా.

"నేను ఇస్తోన్నా కాని త్రాగరా? పోనీలెండి..." అని జాలిగా చూచింది శోభ. శాస్త్రి రెండు గ్రుక్కల్లో గ్లాసు ఖాళీచేసేడు.

శాస్త్రి తన గదికి పోయి కూర్చున్నాక, శాంతంగా, ఆ నాడు జరిగిన సంఘటన ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. శోభ ఏం చెప్పినా అందరూ ఎందుకు చేస్తూంటారో శాస్త్రికి ఇప్పుడే కొంచెం కొంచెం అర్థమవుతోంది. గతరాత్రి అతనికి కలిగిన ఆలోచనలన్నీ మళ్లీ పొటకరించేయి. ఇంక శోభకి తగిన బుద్ధిచెప్పడం అసాధ్యం కాదనుకున్నాడు.

నాటినుండి శాస్త్రి తరచు శోభగదికి వస్తూ పోతూ వుండేవాడు. శోభ, అందరిలాగే శాస్త్రిని కూడా మర్యాదగా చూసేది. ఎప్పుడైనా తక్కినవాళ్లు శాస్త్రిని చులకనచేయబోతే, శోభ వాళ్లని వారించేది. ఎంత జాగ్రతగా పరికించినా, శోభ అంతరంగిక ప్రవృత్తి ఏమిటో శాస్త్రికి అగాధంగానే వుంటూవచ్చింది. "ఎప్పుడు సమయం దొరుకుతుందా, ఎప్పుడు శోభకి బుద్ధిచెప్పడం కలుగుతుందా" అని అనుక్షణం శాస్త్రి తహతహలాడిపోయేవాడు.

శాస్త్రి ఆత్రుతపడినకొద్దీ సమయం దొరకడం లేదు. సర్వసాధారణంగా శోభతో ఎవరో ఇద్దరుముగ్గురైనా వుంటూవుండేవారు. అదృష్టవశాత్తూ ఎప్పుడైనా ఒంటరిగా తటస్థపడితే శాస్త్రి సిగ్గుపడి అడగడమైనా మానేసేవాడు. లేదా, కొంచెంసేపు గడిచేక, నిద్రవస్తోందనో, భోజనానికి వెళ్లాలనో చెప్పి శోభ వెళ్లిపోయేది. తరువాత శాస్త్రి వేలు కొరుక్కునేవాడు.

పెద్దపరీక్షలు దగ్గరకువచ్చేస్తున్నాయని శాస్త్రి కేమీ తెలియడం లేదు. ఒక్కసారైనా పుస్తకం తిరగవేయడం లేదే అన్న విచారమే లేదాతనికి. అతనిని బాధిస్తున్నదల్లా ఒక్కటే—శోభ. "పరీక్షలైపోతే ఆమె ఎక్కడో, నేను ఎక్కడో? ఈలోపునే ఆమెకు బుద్ధిచెప్పడం పడదా?" అనుకొని గట్టించిన దీక్షతో సమయంకోసం ఎదురుచూస్తున్నాడు. కాలం మాత్రం అతన్ని లక్ష్యంచేయకుండా గడిచిపోతోంది.

పరీక్షలు జరుగుతూన్న వారంరోజులూ శాస్త్రి శోభను కలుసుకోవడం పడనేలేదు. ఆఖరుపరీక్ష వ్రాసేసి శాస్త్రి వచ్చేస్తూంటే శోభ వీథిలో నుంచుంది. గదిలో ఎవరో క్రొత్తవ్యక్తి కూర్చున్నట్లు కనిపించింది శాస్త్రికి. శాస్త్రిని ఆపి "రేపు నేను తొమ్మిదిగంటల బండిలో వెళ్లిపోతున్నాను. దిగబెట్టేందుకు రైలుదగ్గరకు వస్తారు కాదూ?" అంది శోభ. "రేపేనా మీరు వెళ్లడం?" అని అడిగేడు శాస్త్రి క్రుంగిపోతూ. "అవును. తప్పకుండా స్టేషనుకు వస్తారు కాదూ." అంది శోభ. వస్తానని గదికి వెళ్లిపోయేడు శాస్త్రి.

శాస్త్రి స్టేషనుకు వెళ్లేటప్పటికి రైలు కదలడానికి ఇంక అట్టేటైములేదు. శోభచుట్టూ చాలామంది మిత్రులున్నారు. శాస్త్రి వస్తూండగానే "హల్లో,

వచ్చేరా. రానేమో అనుకున్నాను. చాలా సంతోషం." అని గుక్క తిప్పుకుండా అనేసి, ఆ ప్రక్కనే నుంచుని వున్న యువకుని చూపిస్తూ "వీరు మా ఆయన" అంది. శాస్త్రికి అర్థంకాక 'ఆ?' అన్నాడు. "అంటే, నా భర్తగా వన్నమాట. ఇంగ్లండులో చదువు పూర్తిచేసి మొన్ననే వచ్చేరు.—వీరే శాస్త్రిగారంటే–" అని భర్తకి శాస్త్రిని చూపించింది.

"శాస్త్రిగారా?" అని అడిగేడు ఆయన.

"ఆ, పిలకశాస్త్రిగారని మీకు అప్పుడప్పుడు వ్రాసేదాన్ని, జ్ఞాపకంలేదూ?" అంది శోభ.

"ఓహో, ఆ శాస్త్రిగారేనా వీరు—చాలా సంతోషం మీ దర్శనంవల్ల" అంటూ శాస్త్రిచేయి పట్టుకున్నాడు. శాస్త్రికి ముచ్చెమటలూ పోసేసేయి. "కొంపతీసి, ఆమెపట్ల నాప్రవర్తన బాగా లేదని వ్రాయలేదుకదా శోభ? ఇంతమందిలోనూ మొగుడి చేత కొట్టించి అవమానపరిచేందుకేమో రైలుదగ్గరకు రమ్మని మరీమరీ చెప్పింది?" అనుకొని వణికిపోతున్నాడు. "నేనేమీ తప్పు చెయ్యలేదనీ, చెడ్డఉద్దేశమైనా లేదనీ ఆయనతో చెప్పాలని చాలా ప్రయత్నం చేసేడు. కాని మాటరాలేదు. ఇంతలోనే రైలు కూసింది. శోభ అందరిదగ్గరా సెలవు తీసుకొని రైలు ఎక్కింది. "పిలకశాస్త్రిగారూ, నమస్కారం, సెలవు" అన్నాడు ప్రత్యేకంగా శోభభర్త. శాస్త్రిబుర్ర తిరిగిపోతోంది. ఎలాగైతేనేం, ధైర్యం తెచ్చుకుని "నా పేరు పిలకశాస్త్రి కాదు, రామశాస్త్రి" అని చెప్పాదామని చూసేసరికి రైలులేదు. గదికి వెళ్లి, పిలకమీద చేయి వేసుకొని, గంటలతరబడి నవ్వుకున్నాడు.

పెట్టి ఓ కూలివాడి నెత్తిని పెట్టి, కాలేజీ ప్రక్కనుంచి కార్ల 'స్టేండు'కు వెళుతున్నాడు శాస్త్రి. ఇదివరకటి ప్యూను గబగబా ఎదురుపడి "నమస్కారమండీ అబ్బాయిగారూ" అన్నాడు. శాస్త్రి తప్పించుకుని వెళ్లిపోతున్నాడు. ప్యూను వెంటపడి "ఏదో బాబయ్యా, మీదయ–కాఫీకి—" అన్నాడు. శాస్త్రి వెనక్కి తిరగకుండానే ఆ, ఆ, ఇంక ఈకాలేజీ ముఖం చూడదలచుకుంటేకాదూ నీ కేమైనా ఇయ్యడం" అంటూ నడకవేగం హెచ్చించేడు. ప్యూను నిలబడిపోయి చుట్ట వెలిగించుకుంటూ "ఈయన వాటం చూస్తే పాసయేలా కనబడటంలేదు" అనుకున్నాడు.



# ఆత్మరక్షణ

✻

## — శ్రీ చావలి లక్ష్మీనారాయణ —

పాముకథ విన్నావురా,
మిత్రమా, పాముకథ విన్నావురా.
ఒక దేశమం దొక్క కూలివా డుండె
తనవారి విడచి ఒక్కడె బ్రతుకుచుండె
వాని కొంపకు ప్రక్క పుట్ట మొలిచింది
అందులో సర్పాల గుంపు చేరింది. ॥పాము॥

వీ డెన్నడైన తలపెట్ట డాజోలి
సహజముగ వీని కెంతయొ కద్దు జాలి
కాని సర్పంబు లోకపెట్టునం జెలరేగి
బుస్సుబుస్సని కలవజొచ్చె చుట్టును మూగి.

"నాగన్న! నాగన్న! మొక్కుతా నీకు
నేనేమి చేశాను నను కలవబోకు"
అన్నప్పటికి మానలేదు సర్పములు
కూలివా డప్పుడే వదలె ప్రాణములు. ॥పాము॥

వానిచుట్టంబు లీవార్త విన్నారు
"తమ్ముడో! తమ్ముడో!" అని ఏడ్చినారు
పాము లిక బ్రతుకరా దని పట్టుబట్టి
బాదజొచ్చిరి కఱ్ఱలను చేతబట్టి. ॥పాము॥

నాటినుండియు నేటికిని పాములంటే
వారు వీరనక అందరికిని మంటే
ఊరకెందులకు చంపుదురు లేకుంటే
ఎవ్వరైనను ఊరుకోరు వద్దంటే. ॥పాము॥

వేదాంతు లీపద్ధతుల కొప్పుకోక
అడ్డువచ్చిరి పాములను చావనీక
దేవతాసర్పంబు లని వంకజెప్పి
మాన్పజొచ్చిరి వీరి మనసులో నొప్పి. ॥పాము॥

"దేవతాసర్పాల జోలి మాకేల"
అన్నారు వీరిలో కొంద రొకమూల
"పాములకు మంచితన మేమి టీగోడవ"
అన్నారు మరికొంద రొక్కొక్క తడవ.

ధర్మంబు గాదన్న వాద మాలించి
శాస్త్రపురాణాలు చాల గాలించి
దొరకెరా ఆధార మని సంతసించి
భారతామ్నాయఘట్టాలు చూపించి. ॥పాము॥

సర్పమొకటి ప్రమద్వరను కరచి చంపె
అంత దాని మగండు పాములను జంపె
అదిగాక జనమేజయుం డన్నవాడు
సర్పయాగమున పాముల జంపినాడు. ॥పాము॥

ఒకటి లౌకిక మొకటి పారలౌకికము
ఏదిష్టమో దాన జేకొంద్రు సుకము
రెండుమతములు శాస్త్రదృష్టముల్ గాన
రెండునుం జేయుచున్నా రీజగాన. ॥పాము॥

—

# గుండెలులేని పండితరాయలు



శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి —

కాళిదాసునంతవాఁడు 'మందః కవియశః ప్రార్థీ' అనుకొన్నాఁడు. భవభూతి యంతవాఁడు 'కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ' అని సరిపెట్టుకొన్నాఁడు. 'ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేగదా' యని తెలుఁగు కవులు వాపోయినారు. ఎట్టి పండితునకు గుండె ధైర్యము లేకపోయినది.

మన 'ముంగండ'లో పుట్టిన జగన్నాథ పండితరాయ లీవిషయములో అసాధ్యుఁడు. అతఁడు భవభూతివలె, కాళిదాసునివలె, దండివలె దిట్టమైన కవిగాఁ బేరుపెందియుండ లేదు. అతని పేరు లాక్షణికుఁడుగా నున్నది. ఢిల్లీపాదుసాహిదర్శనార్థము వెళ్లి, అక్కడ జరిపిన చిత్రాతిచిత్రములు చరిత్రములో మనము చూడఁగలము. అతఁడు రచించిన లహరులు, భామినీవిలాసాదులు అతని మహాకవిత్వమును మూదలించును. చిత్రమీమాంసాఖండనము, మనోరమాకుచమర్దనము, రసగంగాధరము—ఈ మూఁడు గ్రంథములు జగన్నాథపండితుని ఆలంకారికులలో, వైయాకరణులలో, నైయాయికులలో ముందు కూరుచుండఁబెట్టినవి. రసగంగాధరమునకుఁ గల విశిష్టత మేరలేనిది. జగన్నాథుఁడు మహాలాక్షణికుఁ డగును, మహాకవియగును, సందేహములేదు. కాళిదాసాదులలో లేని విశిష్టలక్షణ మొకటి యితనిలో నున్నది, అదియే గుండెలులేకపోవుట. ఇది పాండితీదర్పమునుబట్టి వచ్చియుండు నన వచ్చును. 'అబ్ధి ర్లంఘిత ఏవ వానరభటైః కిం త్వస్య గంభీరతాం ఆపాతాళనిమగ్నపీవరతను ర్జానాతి మంథాచలః' అని వ్రాసిన మురారిని దలఁచుకొనినచో, గుండె గుభేలు మనును. ఎంత సాహసిమైన, ఇంత దర్పముతో వ్రాయవచ్చునా యనిపించును. అటువంటిది, మన పండితరాజు—

"ఆమూలా ద్రత్నసానో
ర్మలయవలయితా దాచకూలా త్పయోధే
ర్యావంత స్సంతి కావ్య
ప్రణయనపటవ స్తే విశంకం వదంతు,
మృద్వీకామధ్య నిర్య
న్మసృణరసఝరీమాధురీభాగ్యభాజాం
వాచా మాచార్యతాయాః
పద మనుభవితుం కోఽస్తి ధన్యో మదన్యః."

అని వ్రాయుచున్నాఁడు. ఎట్టి సాహసము! ఎంత పెంకితనము! అతని కవిత ద్రాక్షారసఝరీమాధురీభరితమఁట. అది నిజమే. అతనికి కవితాచార్యపదవి కలదఁట. అదియు వాస్తవమే. 'కోఽస్తి ధన్యో

మదన్యః' అని యనుకొన్న పండితునకు గుండె లుండవని నే ననుకొందును.

మనసతరితీర్ణవిద్యార్ణవుఁడ నని, పండిత నరేంద్రుఁడ నని పదేపదే చెప్పుకొనెను.

"నిమగ్నేన క్లేశై ర్మననజలధే రంతరుదరం
మయోన్నీతో లోకే లలితరసగంగాధరమణిః,
హర న్నంతర్ధ్వాంతం హృదయమధిరూఢో గుణవతా
మలంకారాన్ సర్వానపి గలితగర్వాన్ రచయతు"

ఈశ్లోకములో ఆత్మగర్వము కరడు గట్టినది.

మన తెనుఁగుకవి శ్రీనాథుఁడు 'వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాఱు' ఇత్యాదిగఁ గృతిపతిచేఁ గొంత యాత్మశ్లాఘ చేయించుకొనెను. భీమనభంగి, నన్నయభంగి అని చెప్పించుకొనెఁగాని, ఆ కవిసార్వభౌముఁడు కూడ 'వారిని మించిచెప్పెద'ననుటకు సందేహపడినాఁడు. 'ఈక్షోణి న్నినుఁబోలు సత్కవులు లేరీనేఁటికాలంబునన్'అన్నచోట 'ఈ నేఁటి కాలంబునన్' అనుటలో శ్రీనాథునకును గొంత పిఱికితన మున్నటులు ధ్వనించును. 'ఏనుఁగు నెక్కినాము, ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము, సన్మానము లందినాము' అని ప్రగల్భములు (కాదు, యథార్థములే) చెప్పుకొన్న యాధునికకవులుకూడ, 'యతియో ప్రాసమొ తప్పు మీరికిని రాదా' అని యొకప్పుడు వంగిపోయినారు. అది కవులకు సహజలక్షణము. సజ్జనలక్షణము కూడను.

మఱి, మన పండితరాయలు హేమాహేమీ. అతఁ డాత్మగౌరవము నొకనాఁడును, ఒకరచనలోను తప్పుచేసికొలేదు. అది శ్రుతిమించినటులు అపండితులకు గోచరించునుగాని, అతఁ డాత్మవిషయములో నెంత వ్రాసికొనెనో, అంతయు నక్షరాల యథార్థము. ఆత్మగౌరవము నిలఁబెట్టుకొనని పండితుని జీవితము అప్రతిష్ఠకు పతాక. ఈ ఆత్మగౌరవపరిపాలనచాకచక్యము శ్రీనాథుని పిమ్మట, నేఁటి తిరుపతివేంకటకవులలో వెల్లివిరిసినది. అందుకే వారి రచనలు మాసిపోవు. సంస్కృతసారస్వతములో, అలంకారవాఙ్మయములో జగన్నాథ పండితుఁడు సర్వదా సజీవుఁడు. విశేష్య-అతని 'ఆమూలా ద్రత్నసానోః' ఇత్యాదిపద్యములు నశింపవు.

"నిర్మాయ నూతన ముదాహరణానురూపం
కావ్యం మయాత్ర నిహితం న పరస్య కించిత్,
కిం సేవ్యతే సుమనసాం మనసాపి గంధః
కస్తూరికాజననశక్తిభృతా మృగేణ."

ఇచ్చట 'న పరస్య కించిత్' అనిన మాట జగన్నాథుని అలక్ష్యభావమునకు లక్ష్యమైన మాట. ఎంత సాహసపుమాట చెప్పెనో, ఆ పద్యము నేఁడు చదువుకొన్న మనమట్టునకు మనకు అభిమానము పుట్టుకొనివచ్చును. ఇట్టి పెంకితనము కలవాఁడు లాక్షణికకవులలో మఱొకఁడు క్షేమేంద్రుఁ డున్నాఁడు. అతని ఔచిత్యవిచారచర్చ, కవికంఠాభరణము దీనికిఁ దారకాణలు. ఒక యౌచిత్యమునకతఁడు కాళిదాసునుండియో, భవభూతినుండియో ఉదాహరణము లిచ్చి, అవి సరిగ లేవని యనౌచితికి వానిని జమకట్టును. ఆతరువాత 'మదీయము' అని తాను రచించిన శ్లోకము 'ఔచితీ' పోషణమునకుఁ జూపును. 'మీరును వ్రాసితిరి, నేనును వ్రాసితిని. చూచుకొనుఁ' డన్నటులుండును, అతని స్వోదాహరణములు.

పండితరాజు అందమైన అమరుకకవి పద్యమును బట్టి విమర్శించి తుక్కు తుక్కు చేసి విడిచినాఁడు. ఇదిగో!

"శూన్యం వాసగృహం విలోక్య శయనా
దుత్థాయ కించిచ్ఛనై
ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం
నిర్వర్ణ్య పత్యు ర్ముఖం,
విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకా
మాలోక్య గండస్థలీం
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా
బాలా చిరం చుంబితా."

ఇక్కడ ఉత్థాయ—కించిచ్ఛనైః అన్నచోట సవర్ణఝయ్ ద్వయసంయోగము శ్రావ్యముగా లేదఁట. 'శనై ర్నిద్రావ్యాజ', 'పత్యుర్ముఖం' అన్నచోట్ల రేఫఘటిత సంయోగము సొగసుగా లేదఁట. విలోక్య-ఉత్థాయ-నిర్వర్ణ్య-పరిచుంబ్య-ఆలోక్య అను క్త్వాప్రత్యయాంతావ్యయములు అయిదుసారులు ప్రయోగించుట, ఆలోక్య-విలోక్య అను నేకార్థబోధకములగు నవ్యయములు రెండుమాఱులు వేయుట - ఇదియంతయుఁ జూడ జగన్నాథపండితుని దృష్టిలో 'కవికిఁ గల నిర్మాణసామగ్రీ దారిద్ర్యమే' యని తోఁచుచున్నదఁట.

ఈతీరున విమర్శనమునకుఁ బ్రారంభించినచో కాళిదాసు కాదు, అమరకుఁడు కాదు, అనర్ఘరాఘవకర్త కాదు; ఏవాఙ్మయములో, నేకవియు నాఁగలేఁడు.

కాని, తీఱివచ్చినపుడు లాక్షణికునకు, నిశితముగ విమర్శించుట యధర్మము కాదు. ఇట్టి మోటవిమర్శకు జగన్నాథుఁడు మాత్ర మాఁగునా యని! అది వేఱువిషయము.

పండితరాయలు ఢిల్లీలో యవనకన్యను వలచి, పాదుసాహియనుగ్రహముచే నామెను పెండ్లియాడి యౌవనమును సుఖముగా వెళ్లఁబుచ్చె ననియు, వార్ధకములో వారణాసికి వెళ్లినపుడు తత్రత్యు లితనిని 'యవనీసంసర్గ దూషితుఁ' డని యధిక్షేపించి రనియు, అప్పుడీపండితుఁడు 'గంగాలహరీ' స్తోత్రము గావించుచు, గంగను దగ్గరకు రప్పించుకొని, దానిలో కలసిపోయె ననియు నైతిహ్యములు చెప్పుకొందురు.

"యవనీరమణీ విపద శ్శమనీ
కమనీయతమా నవనీతసమా,
ఉహిఊహివచోమృతపూర్ణముఖీ
సముఖీ జగతీహ యదంకగతా"
"న యాచే గజాలిం నవా వాజిరాజిం
న విత్తేషు చిత్తం మదీయం కదాపి,
ఇయం సుస్తనీ మస్తకన్యస్తహస్తా
లవంగీ కురంగీ దృ గంగీకరోతు."

ఈ మొదలైనవి పండితరాయలకు యవనీసంసర్గ మున్నటులు తారకాణించుచున్నవి. ఈశ్లోకములు చాటువులై నోళ్ల నుండి వచ్చుచున్నవేగాని, సరిగా జగన్నాథ పండితునివే యనుటకు తగినంత వీలులేదు. ఇట్టివి కాళిదాసునిపట్ల, మన శ్రీనాథునిపట్ల, తెనాలిరామకృష్ణునిపట్ల తండోపతండములుగా వదంతు లున్నవి. ఇవి ఔనని-కాదని చెప్పలేము. అసలు, భ్రాంతిగా లేకుండ నిట్టివి పుట్టవు. ఈ యితిహాసము సత్యమైనచో, జగన్నాథపండితుని గుండెలు లేమి కిది యొక లక్ష్యము, పైవానితో సహా.

———:o:———

# బంతిపూవు

## శ్రీ బోయి భీమన్న

వాసన లేని పూవు, సహవాసము కోరని పూవు తుమ్మెదల్ ;
వాసియు, వన్నె ముద్దుగొన వాకిట నున్నది మానివోలె; దూ
ర్వాసుని కూతురా, యెవతెవమ్మ? ఎటన్ జనుదెంచితమ్మ? నీ
కోసమె పూచె నన్నటులు కోసెద, వెంతటి గండ్రగొయ్యవే!

కలదు గులాబిపూ,వల మొఘల్ మహారాణులచేత పాదపూ
జలు గొనియుంటి నన్న బహుజాప్యమునన్ ; కల దల్ల మల్లె వె
న్నెలనెలకాగడా ననుచు, నీరజమున్ సిరిపుట్టినిల్లు గా
బలిసిన గర్వపంకమున భాసిలుచున్నది కోటగుంటలో !

తాతలతో గతించిన శతాబ్దపు సుప్తసమాధులం దిటుల్
ప్రేతములై, ప్రమత్తత జరించెడి నిష్కృతజీవికల్ సుమ
వ్రాతము లెన్నొ యెన్నొ గల ; వాతెరువుం బడి విప్లవింప, కీ
మా తెనుగుందనంపు సుకుమారత జెండెద, వెంత లోకువే !

అంతు దరీ యెరుంగని మహావిభవమ్మున పుష్యలక్ష్మి సం
క్రాంతి గృహాంగణమ్మునకు రంగులుదిద్దుటకై యువాంధ్రనీ
మంతమణీమనోజ్ఞతల మాన్యత నందెదు బంతె గోరి హే
మంతనిశాంతజాలక హిమాంబువులన్ దపియించు, జూచెదో ?

ఇది రైతాంగపు బూవు, శ్రామికప్రజాహృద్యమ్ము, సంతోషద ;
మ్మిది మావాకిటి నందనమ్ము ; అటు పో, మ్మేభాగ్యశాలో నినున్
గదలించున్-గయికొమ్ము ; ఎవ్వతెకుపీకనైనన్ మా గ్రామసం
పదమీదే పడు టింక చూచి సహియింపంబోము, ఆగంతుకీ !!





N.F To

# నేషనల్

ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్
7, కౌన్సిల్ హౌస్ స్ట్రీటు, కలకత్తా.

మదరాసు బ్రాంచి :
నేషనల్ ఇన్సూరెన్సు బిల్డింగు,
362, చైనాబజారురోడ్, ఎస్ప్లనేడ్.
బ్రాంచి ఆఫీసులు: బెంగుళూరు మరియు మధుర



# తళతళలాడే
## కండ్లు....

అవి ఆరోగ్యానికి లక్షణాలు. మీ ఆరోగ్యాన్నీ అందాన్నీ కాపాడుకొనేందుకు ఉత్తమ ఆరోగ్యపోషక రసాయనం కాంతి అశోక సేవించండి. దానిలోని రసాయన వస్తువులకు తోడు అనేక శతాబ్దాలనుంచి స్త్రీ వ్యాధులకు ఉత్తమ ఔషధమని ప్రసిద్ధి కెక్కిన దేశీయ ఓషధి 'అశోక' చేరివున్నది.

# కాంతి అశోక
**ఉత్తమ గర్భాశయ రోగనివారిణి**

కాంతి కుటీరం
తణుకు—పశ్చిమ గోదావరిజిల్లా.
లోకల్ ఏజంట్లు:-శ్రీ కృష్ణా జనరల్ స్టోర్సు, తణుకు.




# బి టా కే ఫి న్

(తలనొప్పి బిళ్లలు)

అన్ని నొప్పులను, జ్వరములను కుదుర్చును. తలనొప్పి, పంటినొప్పి, కాళ్లనొప్పి, నిద్ర లేకుండుట, కీళ్ల నొప్పులు, మలేరియా, స్త్రీల బహిష్టునొప్పులు, అలసట, వగైరా అన్నిటికి గ్యారంటీగా పనిచేయును. వాడు కొను విధము పొట్లములో నుండును.

పొట్లం 3 బిళ్లలు 1 అణా.




# బి టా లా క్సు

చాక్లెట్ భేదిమాత్రలు.

సుఖవిరేచనౌషధము

ఇది సుఖ విరేచనము కలిగించి మలబద్ధమును పోగొట్టి మంచి జీర్ణశక్తి నిచ్చును. పొట్లం 2 బిళ్లలు 1 అణా.

అన్నిచోట్ల దొరుకును.

Stockists: M/S DADHA & Co.,
P. T. Madras.
Ceylon Agent: M. K. Kapadia Esq.
100 Second Cross Street, COLOMBO.

*Manufactured by*
**BOMBAY TABLET MFG.. CO.,**
P. O. Box 2092, BOMBAY. 2




"తాత్కాలికంగా ఉపశమనము కలిగించే మందులను వాడడం చాలా వెఱ్ఱితనం."

అప్పటికప్పుడు వెంటనే గుణ మిచ్చుటయే గాక, ఉబ్బస వ్యాధియొక్క మూలకారణములను రూపుమాపి శాశ్వతంగా నయము చేయునది పురోహిత్ వారి శ్వాసహరి మాత్రమే. శ్వాసహరిని వాడుట ప్రారంభించిన వెంటనే, దగ్గుపోయి, శ్వాస ధారాళమగుటయే గాక, జీర్ణకోశము, ఊపిరితిత్తులు క్రమేణ బలపడి, ఉబ్బసము పూర్తిగా తగ్గిపోవును.

ఉబ్బసము, ఊపిరి సలుపకుండుట, నడుమునొప్పి, గొంతుకలో నసకలిగించు దగ్గు, వెండలగు గుండెజబ్బులకు శ్వాసహరి (నీలిరంగుప్యాకెట్టు)ను వాడుడు. మలబద్ధకము, పులితేపులు, వీటితో బాధపడు ఉబ్బస వ్యాధిగ్రస్తులగువారు శ్వాసహరి కాంపౌండు (ఎరుపు రంగు ప్యాకెట్టు)ను వాడుడు.

అందరు కెమిస్టులవద్దను, 3, 6, 12 ఔన్సులు సైజులలో 3-6-0, 5-12-0, 10-0-0లు ధరలుగలిగినవి లభించును

మద్రాసు స్టాకిస్టులు:
మెస్సర్సు: అప్పా & కో, చైనాబజార్ రోడ్,
,, శ్రీ క్రిష్ణన్ బ్రదర్సు, తంబుచెట్టివీధి,
,, అమృత రత్నాకర ఫార్మసీ, గోవిందప్ప నాయక్ వీధి.
,, పండాలిక్ & కో, హైదరాబాదు, సికిందరాబాదు.

తయారుచేయువారు
పురోహిత్ ఫార్మసీ
కొల్హాపూరు.



**PUROHIT SHWAS-HARI**



# పరిష్కారం



= శ్రీ రాళ్లబండి నరసింహమూర్తి =

రంగయ్యహోటలు ఇంకా కొద్దిరోజుల్లో అట్టిట్టలేటట్లు వుంది. ఈ నాటికి ఎంత కాదనుకున్నా రంగయ్య మేలుకోవాల్సివచ్చింది. అతనికి యిది కలలోకూడా గోచరించని విషమసంఘటన అయిపోయింది. ఎవరికో చెప్పటంమాట అట్టేపెట్టి తనకుతానే ఆ విషయం తలుచుకుంటే... అసలు దానికి కారణం... చాలా నవ్వుతాలుగా వుంది. ఎవరూ నమ్మరుకూడాను. అయితే తన హోటలులో పనిచేసే వెంకన్న చూచాయగా అన్నాడు-ఈ విషయాన్ని గురించి...వాడి మాట తను ఖాతరుచెయ్యలేదు. అదేసుమీ ఈ నాడు కొంప మీదికి తెచ్చింది! ఇంకా యిట్లాగే ఈ అద్దడిరోజుల్లో అందరితోపాటు తనూ గబగబా నిచ్చెనమెట్లు ఎక్కినట్లే ఎక్కేస్తున్నాడు ధనవంతుల అంతస్తుకు. ఎంతమంది కాలేదు?...మరీ గాలిపటాలులాగే ... ఎగిరిపోయారు. కాని ఆ దారం సన్నని దారమేననిమాత్రం తలుచుకున్నప్పుడల్లా ఒళ్లు గగుర్పొడుస్తుంది. అది కాస్తా తెగిందంటే అంతెత్తునుంచీ క్రిందపడితే అదివరకు మెడలువిరుచుకు చూచిన ప్రజలంతా తుపుక్కున వుమ్ముతారు, తామేదో దిగివచ్చినవారిలాగ. మళ్లీ భావనాప్రపంచంలోంచి మేలుకొన్నాడు ... ముందుకర్తవ్యం ఆలోచించటానికి. ఎలా యిది? ఈ పోటీ వదిలించుకునేది ఎట్లా? ఎవర్నన్నా సలహా అడుగుదామంటే, ముందు విన్నవాడు నమ్మడుగదా! అసలు తనుగూడా నమ్మకపోవటంమూలానే ఇప్పుడు కుంపటి నెత్తిమీదికి వచ్చింది!

అసలు కారణం ఇది—ఒక సంవత్సరంక్రితం రాజమ్మ అనే అమ్మాయి...ఎక్కణ్నుంచి వచ్చిందో, ఎక్కడ వుంటోందోగూడా తెలియదు...వచ్చి తన హోటలుప్రక్కనున్న పెద్ద వూడలమర్రిచెట్టుక్రింద ఒక పొయ్యి పెనం పెట్టి పెసరట్లూ అవీ చేస్తూవుండేది. తనూమానేవాడు-ఎవరో అంతా రిక్షావాళ్లూ, బికారీలూ కొనుక్కునిపోతూవుండేవాళ్లు. ఓ మూల, పైనుంచి కాకులు రెట్టలువేస్తూనేవుండేవి! అయినా ఆ ఆకలికీవాళ్లు అ వేం ఖాతరుచెయ్యకుండానే ఆ చోటికీ, ఆ తిండికీ అతికిపోయారు ... అలాంటి వాళ్లమీద ఆధారపడివుంది రాజమ్మబ్రతుకు ... తను, బద్ధకంగా వున్నప్పుడు అలా వీథివైపుకి దృష్టిమరలిచేవాడు. రాజమ్మ పెనంమీద పిండివేస్తూ కనపడేది. రిక్షావాళ్లు ఏమేమో సరసాలూ హాస్యాలూ ఆడేవారుగామాల్ను...వాళ్లకు, చిరునవ్వు నవ్వుతూ ఆ బుగ్గసొట్టకు వచ్చేచెప్పేది వాళ్ల సమాధానాల వంతుని...వాళ్లు దానికే జోగిపోయేవాళ్లు... అసలు వాళ్లే అనేమిటి, ఆమత్తులో వున్న రంగయ్యకు కూడా ఆ చిరునవ్వను చూస్తుంటే...అందులో గురిగి చేసుకుని కులుకుతూన్న సొట్టను చూస్తుంటే తన మనస్సూ...ఎక్కడో దాగి అణిగిమణిగివున్న పురుషత్వమూ సుడిగుండాలుతిరిగేది. కాని మళ్లీ నిగ్రహించుకుని మొహం ఇటు తిప్పుకునేవాడు. అయినా ఎప్పుడో అప్పుడు అతనికి ఆమెమొహం కనపడటం, అతన్ని కలవరపరచటంమాత్రం జరుగుతూనేవుండేది. అలాగ

కలవరపెట్టిన ఒకరోజున ఎందుకనో తన పూర్వజీవితం తన స్వప్నవీథిలో సంచరించింది! అదేమిటో ఒక్క సారి గిరగిరా తిరిగిపోయింది చాపచుట్టలాగ! అప్పుడు తన ఈడెంత?...పదకొండు నిండాయేమో! ఇంటిదగ్గర నాన్న అస్తమానమూ ఏదో పని చెబుతూవుండేవాడు. విసుగెత్తిపోయేది! అసలైన బడికిపోతే—ఏదో సాయంత్రం ఆటల్లో పడి మరిచిపోతేమటుకు?...పాఠం అప్ప చెప్పకపోయినందుకు గోడకుర్చీ వేయిస్తాడా? దానికి మాత్రం ఒక అంతూ పొంతూ లేదూ? రాక్షసుడిలాగ ...సాయంత్రందాకా అలాగే వుండమంటే...అబ్బ! కనుగొలుకుల్లో నీరు గిర్రున తిరిగేది! ఆసమయంలో మాత్రం అనుకునేవాడు రేపట్నించి చక్కగా చదివి గడగడా పాఠం అప్పజెప్పి హడలగొట్టేస్తాను అందర్నీ అని..... కాని స్కూలు వదలంగానే గోపాలం గోటీ బిళ్లకు పిలవటంతో అంతా కుడిదిపెట్టుకుపోయేది! కొంచెం సందెచీకట్లు చిమ్మగానే, ఆటలు బాగా గెల్చి దుమ్ముపడ్డ చొక్కా, లాగూలతో యింటికి చేరగానే- అమ్మ కాస్తా "అయ్యో! నాకింటిమడతలు ఎలా మాపు కున్నావురా!" అని కేకలెయ్యటంకాక నాన్నను పిల్చి..."ఇలా ఒక్కసారి చూడండి మీ పుత్రుడి అవతారం...ఎంత అందంగా తయారౌతున్నాడో మరీను!" అనేది వెటకారంగా. ఇక నాన్న..."చదువు అబ్బకపోయినా మరీ పాడుసావాసాలతో ఆకతాయి వైపోతున్నావు...మొన్న మీపంతులు కనబడి 'ఒక్క పాఠంగూడా అప్పజెప్పటం లేదు మీవాడు. మీ రే మనుకున్నా సరే గోడకుర్చీ వేయిస్తున్నాను రోజూను' అన్నాడు. నాకు పదిమందిలోనూ తలవంపులైంది!..." ...అంటూ వీపు పగిలేటట్లు బాదేవాడు. నిజంగా తలుచుకుంటే ఇప్పుడుగూడా ఏడుపు వస్తుంది...దాం తోనే సొమ్మొల్లి కూడుగూడా సరిగా సయించకుం డానే పడుకునేవాడు. రాత్రంతా కలవరింతల నిద్ర... మళ్లీ తెల్లారగానే ఈ కర్మకాండ అంతా పునశ్చరణ అయ్యేది! పంతులు చదువుచెప్పకపోగా గోడకుర్చీ వేయిస్తాడన్న భయంతో అలా పొలాలగట్లమ్మట తిరిగి యింటికి సరిగ్గా టైముకు చేరుకునేవాడు...ఏవిషయ మైనా ఎన్నాళ్లని దాగుతుంది? అందులో అప్పుడే పూళ్లో 'ముద్దుకొడుకు' అని పేరుమోగిన రంగడి విషయం అంటే ప్రతివాడూ చెవికోసుకునేవాడే! ఇక ఈ విషయం బయటపడగానే నాన్న బెత్తంతోనే బాదే వాడు......అమ్మ అడ్డుచెప్పేది కాదు. రాత్రిపూట అన్నం ఒకోక్కనాడు వుండేది...ఒకోక్కనాడు పస్తు పడుకోవాల్సొచ్చేది! నిద్రపట్టని ఏ అర్ధరాత్రప్పుడో అమ్మతో "ఇదంతా వాణ్ని దార్లోకి తేవాలనే నా ప్రయత్నం...మరీ యింత బండవెధవ అయ్యాడేమా అంట" అంటూ నాన్న గొణగడం వినబడేది! అప్పుడు నాన్నమీద రోషం,కోపం వచ్చేవి! తను బండవెధవా? తలుచుకుంటే అయోమయం. తను చదవడు. చదివితే ఆ క్లాసులో ఎవడూ చాలడు తన చురుకుతనానికి. అయితే, మరెందుకు చదవగూడదూ? అంటే—ఏమిటో అసలు అటువైపే పోదు మనస్సు......ఎంతసేపూ ఏ చెడుగుడో, ఏ గోటీబిళ్లో, లేకపోతే ఏ చిన్నచిన్న దొంగతనాలో—ఇవే సర్దాగాని......ఈవిషయాల్లో ఆ వాడలో తనకు సాటిలేరు.

నాన్న పెట్టే బాధ? ఎక్కువైంది! చదువా? అబ్బలేదు! ఇక ఏం తోచలేదు. ఈ వూళ్లోనే వుండ దలుచుకుంటే మురుగులోదెలో పడి చావటంకంటే గత్యంతరం లేదు! ఇక బ్రతకదలుచుకుంటేమాత్రం ఈ వూరునుంచి శీఘ్రంగా దాటెయ్యాలి.

మంచికో చెడుకో మొత్తంమీద రాకరాక ఆ వూరికి వచ్చింది ఒకసర్కస్సు. ఇంట్లో బేడకాసు దొంగి లించి పోయాడు చూడటానికి. కాని తన ఆలోచన మాత్రం మెదడులో అట్లాగే మెదులుతూవుంది! చూస్తుంటే...తనమీా దెవరో ఒరిగినట్లైంది. తన ప్రక్కనున్న ముసిలాయన నిద్రమత్తుతో తనమీదికి జోగు తున్నాడు. అదే సమయం.....ఎందుకనో.....శరీరం లోని నాడులన్నీ బలవంతంచేశాయి...వెంటనే ఆయన లాల్చీజేబులోంచి బలుపైన పర్సు కొట్టేశాడు. ఇక అక్కడ మరుక్షణం వుండకుండా, గేటువాడు ఔట్ పాసు ఇస్తున్నా వినిపించుకోకుండా పరారైపోయా డు...మరి...ఇంటికి వెళితే-అమ్మో!-నాన్న బడితె పుచ్చు కుని వాకిట్లో కాపలా కాస్తూవుంటాడని గబగబా

స్టేషనుకు పరిగెత్తాడు. పట్నానికి టికెట్టు కొన్నాడు ...ఎవరూ గుర్తుపట్టకుండా తలకోక గుడ్డ చుట్టి ఓమూలగా ఒదిగికూర్చున్నాడు పెట్టెలో! ఆ రైలు పెట్టె తనని పాతాళంలోంచి స్వర్గానికి తీసికెళ్లే పుష్పకంలాగే తోచింది! ఆ పెట్టెలోనే అత్తింటికి పోయే కొత్తపడుచు కామాల్సు పుట్టింటిని తల్చుకు కంట తడిపెడ్తోంది! అనుకోకుండా నవ్వు వచ్చింది ఆ అమ్మాయిని చూడగానే!

పట్నం చేరాడు. అంతా కొత్తగా వుంది! ఏమిటో ఆ పల్లెటూరిలో కూపస్థమండూకంలాగా పడి వున్నా డింతవరకూ! అయితే ఇక ముందు కర్తవ్యం? పర్సు అప్పుడు విప్పిచూశాడు. ఎనభైతొంభైదాకా వున్నది డబ్బు! మనస్సు చివుక్కుమన్నది! ఆ ముసలాడు ఎంత అహోరిస్తున్నాడో ననిపించింది!

సమిష్టిజీవితంలోంచి విడివడి బయటకు వచ్చేప్పటికి తన్నుగురించి తనే—తెలియకుండా తాపత్రయ పడటం మొదలుపెట్టాడు...అది వుందా, ఇది వుందా అని. ఈడబ్బుని దుబారాగా ఖర్చుచెయ్యటం ఇష్టం లేకపోయింది. అయితే ఎక్కడైనా కూలినాలి చెయ్యాలి. బత్తెం గడవాలి. ఈ డబ్బులోంచిమాత్రం చిల్లిగవ్వ తియ్యకూడదు. తన కన్నుపోతుచేసిన చొక్కా, లాగూ కొని తొడుక్కుని పూరివెంట పడ్డాడు. నాలుగైదు ఆఫీసుల్లో పదిరూపాయలమీద తీసుకుంటా మన్నారుగాని ఎరికలేనివూళ్లో తిండిగడిచేది ఎట్లా అని పించింది! ఆపైన శివయ్యకు హోటలుకి వెళ్లాడు. అక్కడ పదిహే నిస్తామన్నారు. తిండికూడా అక్కడే గనుక మరీ లాభం!......అవును కా దనకుండా మరి ఒప్పేసుకున్నాడు. అక్కడ చేరినప్పట్నించి ఆడబ్బు కాక ఈడబ్బుకూడా—ఏమీ ఖర్చు వుండేదికాదా రోను—కూడబెడ్తూవచ్చాడు.

ఏమిటో! కప్పగంతేసినట్లే...నాలుగైదేళ్లు ఇట్టే గడిచిపోయాయి. తనూ కొంచెం భారీమనిషయ్యాడు. డబ్బు బాగా కూడబెట్టాడు. ఆ డబ్బును తలచుకున్నప్పుడల్లా ఈ హోటలుచాకిరీ చాలా కష్టంగా తోచేది! అది అలాగే పెట్టెలో మురిగిపోవటం సహిమిరా తనకు గిట్టలేదు. ఎలాగైనా ఉపయోగపరచాలి. వ్యాపారం సాగిస్తే?...తను ఒంటరిగాడు...ఈ యుద్ధపురోజుల్లో ఏం పుట్టిముంచుతుందో. ఈ సంధిగ్ధావస్థలో వుండగా చక్కని అసరాలాగ....మేఘాలు విచ్చిన చందమామలాగే ప్రత్యక్షమయ్యాడు శివయ్య. శివయ్యకూడా తనతోపాటు హోటలులో చాలా కాలంనుంచీ వుంటున్నాడు! దాదాపు ఇద్దరూ ఒకే అవస్థలో వున్నారు! ఇద్దరికీ బాగా జోస్తీ! అంచేత ఒకళ్ల విషయాలు ఒకళ్లకు విపులంగా తెల్సు. శివయ్య మహా పొదుపైన మనిషి. అతని చేతిమీద కానీకాసు వేసి విదిలించమంటే చచ్చినా క్రిందపడదు! మళ్లీ బొడ్డులోకి అతిసులువుగా దూరిపోతుంది! అలా కూడబెట్టాడు అతనుకూడా!

రంగయ్య అసలు ఆనాటిని మరిచిపోలేదు! ఇద్దరికీ ఎలా తట్టిందో ఒకేసారి! పువ్వుపువ్వులనిదూచి పోసే పూర్ణచంద్రుడి సాక్షిగా...మలయపర్వతాలమీంచి నిద్ర నడకలలో జోగుకూ వచ్చే మలయపవనుడిసాక్షిగా......ఇద్దరూ ఒకరికొకరు మాట యిచ్చుకున్నారు.....పరాయిపురుగుతో చెప్పకూడదని!

మరి వారంరోజులకల్లా ప్రక్కపేటలో తన పేరుమీద హోటలు తెరిచాడు రంగయ్య! తన యజమాని లోలోపల అసూయపడినా...పైకిమాత్రం అభినందించాడు! అయినా అతనికి రంగయ్యఅంటే సుముఖతసంగతి ఎలా వున్నా గాని...ఏవగింపుమాత్రం లేదు.

మొత్తమ్మీద యిద్దరూ సమిష్టిగా సాగించారు. మొదటిరోజుల్లో కొత్త కష్టపడాల్సివచ్చింది! చాలా గడ్డుసమస్యలు ఎదుర్కోవలసివచ్చేది! షావుకారు అరువు మీద వెచ్చాలు తెచ్చేవాడు కాదు.......అప్పటికీ శివయ్యే గాడిపొయ్యిదగ్గర చతికిలపడేవాడు. పై విషయాలన్నీ తనే చూచేవాడు. తను ఆ స్తమానమూ గల్లాపెట్టెదగ్గర కూర్చున్నాగాని శివయ్య ఏనాడూ మూతి ముడిచి ఎరగడు! అలా సజావుగా తామిద్దరూ ఏకమనస్కులతో నడుపుకువచ్చారు కనుకనే ఇప్పుడు హోటలుకు ఒక పునాది ఏర్పడింది! రానురాను శివయ్యకు పనికూడా తగ్గించాడు. కాని శివయ్య తనే

కష్టపడతా నసేవాడు. రంగయ్య అతని స్వభావం తెలిసినవాడుకనుక అడ్డు చెప్పేవాడు కాదు !

అన్నింటికంటే అసాధ్యం! మనం కాలగతిని పోల్చలేము! చాలా విచిత్రాలూ, చాలా వికృతాలూ జరుగుతూవుంటాయి. ఒక్కొక్కప్పుడు నమ్మలేం! శక్తి సన్నగిలి మంచంమీద పడ్డాడు శీనయ్య! అతన్ని గురించి ఎంత తాపత్రయపడ్డా లాభం లేకపోయింది. అతను బ్రతికే ఆశలు కనబడలేదు. డాక్టర్లను తెస్తే శీనయ్య అన్నాడూ—"రంగప్పా, యింకా నాకు బ్రతకాలని లేదు. నీవు వృథా శ్రమపడి కష్టార్జితాన్ని మట్టిపాలుచెయ్యబోక! కాని నేనిదే బాధపడుతాను ...నేనుత్త పనికిమాలిన మనిషిని. జీవితంలో సుఖం అంటే ఏమిటో ఎరగను. ఒక గొడ్డులాగే జీవించాను. సుఖం కోరకపోయినా నీతో వున్నన్నాళ్లూ ఒక తృప్తిని అనుభవించాను. నీవైనా వేయికాలాలపాటు సుఖంగా వుండాలని కోరుతాను" అంతే...శీనయ్య చెప్పిన ఆఖరిమాటలు. అవి తలుచుకుంటుంటేకనుగుడ్లు నీళ్లను చిమ్ముతున్నాయి. తన కుడిభుజం శీనయ్య రాలిపోయాడు. కాని తను బాగా సంపాయించాడు కనుక శీనయ్యచెల్లి తన మనస్సును కలవరపెడ్తోందేకాని హోటలు నడపటానికి ఏమీ అడ్డురాలేదు. అప్పుడే రెండేళ్లు తిరిగి మూడోయేడు ప్రవేశించింది. శీనయ్య గతించి.

ఇంతవరకూ ఏ ఒడుదుడుకులూ లేకుండా, ఏ లోపమూ లేకుండానే సాగిపోతోంది అతని జీవయాత్ర. కాని యిప్పుడే వచ్చింది అసలైన గడ్డు సమస్య! తేలిగ్గా వదిలేది కాదు. ఏకల్లే వచ్చి మేకై కూర్చుంది!

అసలు...రాజమ్మ మొదట్లో ఎందుకు మొదలు పెట్టిందో ఈ సరంజామా అంతా—ఇప్పుడూ అందుకే! ఆమెకి యింకా వ్యాపారదృష్టి కలగలేదు. మోసం యింకా ఆమెలో విత్తునాటుకోలేదు! పసిపాపనవ్వులో వున్న అమాయికత్వమే ఆమె మెదడులో వున్నది! అంచేత ఆమె చేసే ఏ పనిలోగూడా కల్తీ అనేది లేదు. మొదట్లో ఇద్దరుముగ్గురు దడిసేవారు—నడిచే ముందు అక్కడ దత్తిగా కూర్చుని రాజమ్మముందు జేవిరిగా తింటుంటే—దారేపోయేవాళ్లు ఏమనుకుంటారో అని.

అయితే యిన్నాళ్లనుంచీ రంగయ్యహోటలు పెసరట్లకు పెద్దపేరేగాని ఎందుకనో రాజమ్మపెసరట్టు నోట్లో వేసుకోగానే అంతవరకూ రుచిసుఖంలో ఒక నిర్ణయానికి వచ్చామనుకున్న ఆ మసకకన్నులవాళ్లను మరోఅంతస్తు ఎక్కించింది! "నా యింటావిడగూడా ఇలా చేసి ఆప్యాయంగా చేతికందివ్వలే"దని గోజీగాడు ఒకాయన. దీనిని రుచిమాచిన నాలుకమీద రంగయ్యపెసరట్టు వేస్తే అతిసుళువుగా చెప్పేది—కల్తీసెయ్య అని. అదివరకు! మరి యిప్పుడు నాణ్యమైన వస్తువు కనబడుతోంది. అది కొన్ని వీలుకాని పరిస్థితుల వల్ల అనాదరమైన స్థితిలో వున్నది—అంతమాత్రంచేత దాన్ని జారవిడుస్తుందా హృదయం! పైకి పటాటోపంగా కనిపించే ఆ కుళ్లుమాత్రం ఎన్నాళ్లు భరించటం! గత్యంతరం లేకపోతే తప్పుసరే! ఇవతల స్వర్గతుల్యమైనది నీ ఎన్నిక ఎదురుచూస్తోంది. ఈ విధంగా వితర్కించుకున్నారు కొందరు. మొత్తమ్మీద ఒకరొకరే లాంగారు. పైగా రంగయ్యహోటలులో లాగ చిరుబుర్రుల సర్వర్లు కా దిక్కడ! చక్కగా చిరునవ్వులో మెరిసే కనుకొలుకులతో పంచేంద్రియాలకూ తృప్తినిస్తుంది.—అబ్బ! ఆ మహత్తరమైన అవకాశం పోగొట్టుకోవటానికి నిజానికి ఎవరి అంతరాత్మ ఒప్పుకోదు! అందుకనే ఎలాగైనా ఆ కాసేపటికి తమ మానాన్ని చంపుకుని—అది చంపుకోవటమే అయితే—తిని చక్కాపోతున్నారు. ఇంతమంది వస్తున్నా రాజమ్మ తనలో గొప్పతనాన్ని కనబరచలేదు. "భగవంతుడు నాకు మంచిరోజు లిచ్చాడు" అంటుంది. అంతే. ఆ అమాయికహృదయం నిజానికిలాంటి మాటలతో వాళ్లను తన వలయంలో మరింత బిగించుకునేది!

ఇంకా వ్యాపారదృష్టి కలగకపోవటం చాలా మందికి ఆశ్చర్యంగా వుంది. ఏ కొత్త అదను దొరికినా ఆకాశంలోకి ఎగిరిపోవాలని చూచే ఈ రోజుల్లో ఈ పిచ్చమ్మాయి ఇలా ముభావం తాల్చటం కొందరికి తెలివితక్కువగానే తోచింది! అయితే రాజమ్మ ఈ

సంగతి తెలిసి వూరుకొంటా, లేక అసలు తెలియదా అనే మీమాంస వచ్చింది. చివరకు ఓనాడు రాజమ్మతో ముచ్చటించారు. కావాలంటే మేమంతా కలిసి పెట్టుబడి పెడ్తాం అన్నారు. రాజమ్మబుగ్గల్లో సుడిగుండం తిరిగింది. కనుపాపలు కృతజ్ఞత వెల్లడించాయి. కాని రాజమ్మ ససేమిరా వల్ల కాదంది. "బాబూ, నన్నిట్లాగే బ్రతికి మీరిచ్చే నాలుగుడబ్బులతో పొట్టపోసుకోనివ్వండి; ఎందుకు దింపుతారు ఊబిలోకి? నేను స్వేచ్ఛగా బ్రతకటం మీ కిష్టం లేదా" అని ప్రశ్నించాయి ఆమెకళ్లు. మత్తుమందు చల్లినవాళ్లలాగే గోముగా నవ్వారు. అంతే.

కొన్నాళ్లకు రంగయ్య గ్రహించగలిగాడు. ఇదివరకల్లా పరుగైపోయిందని తిప్పికొట్టేసే తన హోటలులో నిలవసరుకు రానురాను పేరుకుంటోంది! అదే రంగయ్యలో సంచలనం కలిగించింది. వెంకణ్ని పిలిచి అడిగాడు! "ఒరే! అదేమన్నా బ్రతిమాలుతోందా ఏం చౌకధర కిస్తానని! అదేమిటి మరీ అంతమంది మూగుతున్నారు" అని. "లేదు బాబూ...దాని పెసరట్టు— కోప్పడనంటే చెప్తా — నేనుగూడా తిన్నానండీ. అబ్బ! ఏం రుచి అని చెప్పను? ఏం పెడ్తదో గాని—" అంటూ, ఆ రుచులు తలపుకువచ్చాయి కాబోల్ను, గుటకలు మింగాడు. ఎందుకనో రంగయ్యకుకూడా రెండుగుటకలు అప్రయత్నంగా జారినయ్! అంతమందిని తననుండి ఆకర్షించేసే మంత్రముగ్ధులను చేసేసిన ఆ పెసరట్టులో ఇది ఏ శక్తికి ఆరోపించాలో తెలుసుకోవాలన్న కుతూహలం ఎక్కువైంది. అటూ యిటూ పరకాయించి ఎవరూ లేకుండా చూచి "అయితే వెంకన్నా, ఆ రుచేమిటో నేనూ చూస్తాను, ఎవరూ చూడకుండా తెచ్చిపెడ్తావు?" అన్నాడు. అది వినగానే యజమానిముఖంలోకి కళ్లు పెట్టి అర్థయుక్తంగా నవ్వాడు వెంకన్న. అది గ్రహించుకుని 'నోరుజారానా' అనిమాత్రం కించపడ్డాడు రంగయ్య.

"రాజమ్మా, పెసరట్లు ఆకులో కట్టిస్తా?" అన్నాడు వెంకన్న. ఇప్పుడే తిని వెళ్లిన వెంకడు మళ్లీ రావటం...ఎందుకా అని అనుమానం కలిగింది రాజమ్మకు. "ఎవరికేం?" అని ప్రశ్నించింది. అతని కెందుకో అదోమాదిరి నవ్వు వచ్చింది! ఇక వెంకన్న వేళ చెప్పక్కర్లేకుండానే రాజమ్మ గ్రహించగలిగింది. వేయిదేముళ్లకు మొక్కుకుంది. కాని ఆశ్చర్యంమాత్రం బాగా పూనింది రాజమ్మని.

వెంకన్న తెచ్చిన పెసరట్లు మొత్తమీద ఎవరూ చూడకుండానే తిన్నాడు. అతనికి ఆశ్చర్యం కలిగించిన మాట నిజం! తనూ విధివశంవల్ల అదేవృత్తివాడు కావటంవల్ల రాజమ్మకు పోటీ నిలవాల్సివచ్చిందిగాని— లేకపోతే వాళ్లలాగే ఆగడవాలో కూర్చోటానికి అవంతా జంకేవాడు కాదు.

ముందు పెసరట్లుబాగోగు లటుంచి రాజమ్మయీపోటీ తనకు గుండం తవ్వుతోంది. ఈ బాధ తొలిగేది ఎట్లా? పోనీ, రాజమ్మని అక్కణ్నించి లేపు పెట్టించి వెళ్లగొట్టిస్తే? ఇది మొదట్లో బాగానే వుందనిపించిందికాని ఇదల్లా 'చేతులు కాలినతర్వాత ఆకులు పట్టుకోవటం'కంటె వేరే ఏమీ కాదనిపించింది! ఎందుకంటే రావాల్సినపేరు రాజమ్మకు ఎట్లాగో వచ్చేసింది! ఈపని ముందే చెయ్యాల్సింది! విషపు ఘడియల్లో మేల్కొన్నాడు తను. ఇప్పు డెక్కడికి వెళ్లగొట్టినా రాజమ్మవునికి తెల్సుకు మరీ చేరుతారు ప్రజలు. అలాంటప్పుడు తన ఎత్తు సాగకపోగా ఇదంతా తన తంతూ అని తెలిసిందా అంటే, తన కెదురుముక్క పొడిచేమాట ఖాయం. మరి యిక గత్యంతరం పాలుపోలేదు.

ఏవిధంగానైనా తన వ్యాపారం,తన హోటలూ ఆటంకరహితంగా సాగాలంటే తన దారిలో ఎటువైపు చూచినా రాజమ్మపొడ వుండగూడదు. దీనికి రెండే ఉపాయా లున్నాయి. ఒకటి రాజమ్మని వెళ్లగొట్టటం. ఊహూఁ, ఇదేం లాభంలేదు. ఇక పోతే... ఆఁ, మంచిఆలోచన తట్టింది! అసలీవూహ మెదడులో మెరుపులాగా జిగేలుమనగానే అతని కొక ఆలోచన పట్టుకుంది! ఇన్నాళ్లనుండీ రాజమ్మని ప్రేమిస్తున్నాడా? అయితే ఈ ప్రశ్న యిదివర కెందుకు రాలేదు? ఉరుమురమగానే లేచే వెదురుమొక్కలాగే కలిగిం దీవుద్రేకం! ఇదివరకు ఈభావం తట్టనన్నాళ్లూ రాజమ్మ తన కొక ప్రతికక్షి. అందుకని ఆదృష్టితోనే

చూచేవాడు. అయినా ఏ పరధ్యాన్నపు సమయాల్లోనో రాజమ్మ ముఖకవళికలలోని సొంపులు తనని కలవర పెట్టినమాట నిజం! ఊహైతే బాగానే వుంది. కాని దాన్ని అమలుజరపటం ఎలా? రాజమ్మకు తన అభిప్రాయం వ్యక్తపరచాలి! మధ్యలో అభిమానం పీకుతోంది! "ఇన్నేళ్లు వచ్చిన రంగయ్యకు అమాంతంగా ఈ పెళ్లేమిటి" అంటారేమో అంతా!

అంతవరకూ స్త్రీ అంటే ఎరగడు. ఎలా పరామర్శ చెయ్యాలో, ఏవిధంగా మంచిచేసుకోవాలో ఏకోశానా తెలియదు. పోనీ, అవన్నీ ఎలాగో అలా ఓపికపట్టి అక్కడ జాగ్రత్తగానే మెలగుతా ననుకున్నా రాజమ్మ యివన్నీ స్వీకరిస్తుందని భరోసా ఏదీ?

ముందు, తన దేహం, తన ఆత్మ, ప్రేమ, వీటికంటె ఏ ఆత్మ ఏ దేహాన్ని యింతవరకూ వాటివాటి పనులు సక్రమంగా చేసుకునేందుకు దోహదమైన మూలకారణం ఏదైతే వుందో ఆ "వ్యాపారం" కోసం త పెన్నవ్వా చెయ్యాలి! తనకు దైహికంగా, ఆత్మీయంగా స్త్రీయే కావాలని అనుకుంటే రాజమ్మే కాదు! ఇంకా లక్షమంది వున్నారు! రాజమ్మ విషయంలో వైవాహికతృప్తి ప్రధానమైనది కాదు! అది వ్యాపారరీత్యా తన హోటలుకు పోటీ లేకుండా చేసుకోవటానికి!

ఈ ఆలోచనలన్నీ అతిగోప్యంగా వుంచాలనుకున్నాగాని ఏఒకరికైనా తెలియకపోతే అసలు అభాసు అవుతుందేమోనని వెంకన్న చెవినిమాత్రం వేశాడు.

ఆనాటిరాత్రే వెంకణ్ణి వెంటబెట్టుకుని ఊరిచివర పేటలో రాజమ్మయింటికి వెళ్లాడు. వెంకడు రాజమ్మయింట్లో కెళ్లి రాజమ్మని పిలుచుకువచ్చాడు.

శుక్లచంద్రుడి సుమ్మశిపూవుకాంతిలో రంగయ్యను పోల్చుకోగలిగింది రాజమ్మ. మొదట నమ్మలేకపోయింది. ఎందుకో ఆమెశరీరం కంపించిపోయింది! తను కలగంటోందా? లేక మామూలు ప్రపంచంలోనే వుందా? ఆమె ఊహా సాదావుడిలోనే అప్రయత్నంగా అంది "వెంకడూ" అని. వెంకడు చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు. రాజమ్మ తలవంచుకు నుంచునివుంది! ఇక రంగయ్యవంతు వచ్చింది! ఉపక్రమించాలి! ఎట్లా? ఏదో తడబడుతూ ఇంటిదగ్గర వల్లించిన సంభాషణే దొర్లిద్దా మనుకున్నాడు.

"కులాసాగా వుంటున్నావా రాజమ్మా?" అన్నాడు. నిజానికి తన కులాసాసంగతి రంగయ్యకెందుకో! "ఆ. దేముడి దయవల్ల!" అని ముక్తసరిగా సమాధానం యిచ్చింది. "వ్యాపారం బాగా సాగుతోందా?" అన్నాడు రెండో ప్రశ్నగా రంగయ్య.

"ఆఁ! ఏం వ్యాపారం? మాలాంటివాళ్లది! ఏదో జీవనం గడుపుకునేందుకు పడే పాట్లుగాని, అదీ ఓ వ్యాపారమేనా?" అని నిదానంగా అంది రాజమ్మ.

ఇక్కడ రంగయ్యకు తన అభిప్రాయాన్ని వ్యక్తపరిచేందుకు సమయం దొరికింది! కొంచెం దగ్గరగా జరిగి అన్నాడు—"రాజమ్మా, నీ వల్లా అరుబైట కూర్చుని ఆ ఎండ పొడలు మీద పడుతుంటే—నీ శరీరం కమిలిపోతూ చెమరుస్తుంటే నా కెంతో జాలివేసేది. నీవు చాలా కష్టపడుతున్నావు పాపం! కాని...కాని...నాదో చిన్నకోరిక వుంది. అది ఎంతో కష్టం కాదు! నీకూ నాకూ కూడా మన భావిజీవితాల్లో ఒకవడి పెట్టేదే! నిజానికి నీకూ ఎవరూ లేరు! ఈ ఒంటరిజీవితం!! నీవు నా దగ్గరికి ఎందుకు వచ్చెయ్యకూడదూ?" ఈ ఆఖరిమాటలు బిగబట్టి అతికష్టంమీద అనగలిగాడు రంగయ్య.

రాజమ్మ ముఖంలో రక్తం చిమ్మింది. ఒళ్లు గగుర్పొడిచింది! ఏం మాట్లాడాలో తెలియటలేదు. అలాగే స్తబ్ధుగా నుంచుంది. ఆదివరకు స్త్రీప్రాపకం ఎరగని రంగయ్యకు ఈ ముఖభావం అవునో కాదో వ్యక్తపరచలేకపోయింది! నిజానికి ఆ సమయంలో రాజమ్మ భావరహిత అనే చెప్పాలి! తను ఆదివరకటి జీవితంలో దేనివిషయమై ఆశ వొదులుకొని ఒక మోడులాగా వుంటోందో ఆ మోడుతో నీకు చిగిరించే అవకాశా లున్నాయి అంటే దానిలో ఏఏ భావాలు స్పందిస్తాయో అనే గిర్రున తిరుగుతున్నాయి రాజమ్మ మెదడులో!

మళ్లీ అందుకున్నాడు రంగయ్య—"ఇంత దాకా వచ్చింతర్వాత దాపరికాలెందుకూ? నిజం చెప్పాలంటే, నే నింతవరకూ స్త్రీతో సమిష్టిజీవనం అంటే ఏమిటో ఎరగను. చిన్నప్పట్నించీ కూడా ఎన్నో కష్టాలు పడి మొరటు తేలింది నా శరీరం. ఈనాటికి కొంచెం నీడక్రింద బ్రతుకుతున్నాను. నిన్ను చూసినప్పుడల్లా ఎందుకనో నా మొదటిరోజులు గుర్తు వస్తాయి. అప్పుడు నాకు చాలా బాధగా వుంటుంది. నేను మొగవాణ్ని! నీవు స్త్రీవి. అబలవు! నాలాగే నీకూ కష్టాలున్నట్లయితే ఎంత బాధపడుతున్నావో ననిపిస్తుంది! ఇదే నన్ను యిన్నాళ్లుగా మథనపెట్టి ఈనాడు నన్ను నీపాదాలదగ్గరకు తెచ్చింది!" ఈ మాట లంటూంటే రాజమ్మకళ్లంబడి జడివానలాగే జలజలా రాలాయి కన్నీళ్లు! అవి దుఃఖకారణంగా వచ్చాయో, లేక ఆనందబాష్పాలో కూడా ఆకట్టటం చాలా కష్టం! నిండుచంద్రుడి వెన్నెల వెలుగులో ముత్యాల్లాగే మెరిసిపోయాయి ఆమెఅశ్రువులు!

రంగయ్య ఆఖరుమాటగా అన్నాడు: "రాజమ్మా, నీవు అడ్డుచెప్పకపోతే నిన్ను నాదానిగా స్వీకరిద్దామని వుంది" అని. ఇక ఏంచెప్పేందుకూ విషయాలు కనపడలేదు రంగయ్యకు! "సరే! రాజమ్మా! వున్న విషయాలు చెప్పాను. ఆలోచించుకో! నేను వెళ్లి వస్తాను." అని కదిలాడు రంగయ్య. "మంచిది" అని మాత్రం చివరి వీడ్కోలుగా అనగలిగింది. అంతే.

ఇంటిముంగిట వెన్నెలలో మంచమ్మీద వచ్చి పడుకుంది! రంగయ్య వచ్చి తనగుండెను ఆమూలాగ్రం కెలకవేశాడు. మళ్లీ ఎన్నాళ్లకో తన విషయం ఆలోచించి, తననిగురించి జాలిపడే వ్యక్తి కనపడ్డాడు. అతనికి తన కృతజ్ఞత చూపటం ఎలా? తన గనుక 'ఊ' అంటే స్వర్గసోపానాలకు తలుపులు తెరువబడతాయి. తన 'ఊ'కు ఈనాడు అంత విలువ వుంది. ఇన్నాళ్ల తన జీవితం అంతా ఒకఎత్తు! రాబోయేది మరొక స్వప్నసీమ. ఈ ఇరవైఏళ్ల జీవితంలోనూ తను ప్రత్యక్షంగా ఏం కష్టాలూ అనుభవించకపోయినా సుఖమూ, తృప్తీ అనేవిమాత్రం ఏనాడూ అనుభవించలేకపోయింది! ఎండమావులలో చిక్కుకుంది తన జీవితం! మరీ నిజానికి దాపుగా పోవాలంటే పసితనంలో అనుభవించిందేమో—ఆ స్వేచ్ఛా, తృప్తీ, ఆనందమూను. అంతే. తొమ్మిదేళ్లు నిండగానే తండ్రి కాస్తా చనిపోయాడు. ఇక మిగిలింది ఎకరన్నరభూమి; ఒక అన్న. అన్న పొలంపనిలోకి వెళ్లేవాడు. తను చిన్నప్రాయంలో వున్నాగాని అన్నం వండటంమాత్రం తెలుసు. ఏ పొరుగుబ్రాహ్మలింటికో వెళ్లి ఆ వాళ్లికి యింత పచ్చడితుద్ద తెస్తే రోజు గడిచిపోయేది! అన్నతో వున్నన్నాళ్లూ అన్న తన మాటకేనాడూ ఎదురు చెప్పలేదు. తనూ అన్నమాటను ఏనాడూ కాదనలేదు. కాని అప్పుడప్పుడు — "రాజీ, నీకు పెళ్లి చేసే యీడు వచ్చింది. కాస్త ఎర్రగా బుర్రగా వున్నవాణ్ని చూసి ముడిపెట్టాలి" అన్నప్పుడుమాత్రం "ఆఁ! పోన్నా, నాన్నదినాలకూ వాటికి చేసిన అప్పూ సొప్పూ ఇంకా అలాగే వున్నాయి. ఇంక నా పెళ్లికూడా చేసి ఇంటికి ఓ గుండం తవ్వుతావా అన్నయ్యా?" అనేది. "గుండమౌతుందని వూరుకునేదా? తప్పుతుందా తల్లీ! ఏనాటికైనా నీవు పరాయియింటిపిల్లవే" అని బరువు గుండెతో నిట్టూర్చేవాడు.

ఓ నాడు తను పొలంవైపుకి ఏదో పనివుండి వెళ్లింది. అక్కడ మాచి కనపడ్డది. మాచి ఆనాడెందుకో ఎక్కువ జోస్తీగా మాట్లాడింది. చివరకు వెళ్తూ అన్నది: "పిల్లా, పెద్దమోతుబరీకొడుకు నీమీద కన్నేశాడు. నిన్నుగురించి పదేపదే నాతో మొరెత్తుతున్నాడు. నీవు ఏదోవిధంగా 'ఊ' అన్నావా అంటే బంగారు వుయ్యాలమీద వూపుతాడు" అని. అవి తన ప్రాయం వికసించి సౌరభాల్ని నల్దెసలా చిమ్ముతున్న రోజులు. తనూ రెండుమూడుసార్లు చూసిందతన్ని. ఆ వూళ్లో చెప్పతగ్గ అందగాడే! అలాంటి వాడు తనమీద కన్నేశాడంటే-తన యౌవనసార్థక్యానికి మురిసిపోయింది. ఆమె పెదవులమీది చిరునవ్వు తొలకరి సమాధానం చెప్పింది మాచికి.

తుమ్మెదకూ, పుష్పానికీ జోస్తీ కలపటంలో కాలంయొక్క అవసరం బహుకొద్ది! అందుకేగామోలు రాజమ్మకూ, మోతుబరీకొడుకు చిన్నప్పకూ త్వరలోనే

పథ్యం కుదిరింది. పొలాలమాటున గంటలు గంటలు గులకరాళ్లలాగా దొర్లించేవాళ్లు!

అవి మాఘమాసపు రోజులు. ఊడ్పులన్నీ అయి బాగా రైతుజనానికి ముమ్మరంగా చేతిలో పైకం ఆడుతున్న రోజులు. ఇదే సమయం అనుకుని కూడబెట్టిన డబ్బుతో రాజమ్మని తీసుకుని పట్నానికి దారితీశాడు చిన్నప్ప. రాజమ్మ అన్నని వదలాల్సివచ్చినా మనసిచ్చిన చిన్నప్పని చూడగానే కాదనలేకపోయింది. దారిలో ఎన్నో కబుర్లు చెప్పాడు చిన్నప్ప! మనం పట్నంలో పెద్ద పెద్ద మేడలూ, వైభవాలూ చూస్తాం అంటూ రకరకాల అనుభవాలనుగురించి ముచ్చటిస్తుంటే రాజమ్మ స్వర్గోద్యానాల్లో విహరిస్తున్నట్లే భావించింది! ఆ వూరు చేరాక ఒక హోటలులో బసపెట్టారు. రోజల్లా వూరంతా తిరిగిరావటం, హోటలులో భోజనం—అబ్బ! సుఖంగా గడుస్తున్నాయి రోజులు!

కాని రాజమ్మకు అనుమానం తగలకపోలేదు. చిన్నప్ప ఈ డబ్బు కాస్తా అయిపోతే ఏం చేస్తాడూ అని! ఆ విషయం తలుచుకున్నప్పుడల్లా గుండెల్లో రాయిపడేది రాజమ్మకు. నిజానికి అం దా కా రానేలేదు రోజులు! ఆమె ఏ మాత్రమైనా సుఖజీవితం గడిపిందీ అంటే ఆ నాల్రోజులే! అంతలోనే వారి ప్రేమకు స్వస్తిచెప్పాల్సివచ్చింది! మరి రెండురోజులకల్లా ఎలా ఆనవాలుపట్టి వచ్చారో చిన్నప్పతండ్రీ, ఆవూరి మునసబు సుబ్బరాజూ తయారయారు ఒక వుదయాన. ఆ ఏమను రూపాల్లో పులిచూపులు కనిపించాయి రాజమ్మకు. లేడిపిల్లలాగే వణికిపోయింది. గువ్వపిట్టలాగే చిన్నప్పవడిలోకి గుప్పెడై ఒదిగిపోయింది! అప్పుడు తెలుసుకోగలిగింది సంఘవిరుద్ధమైన పని చేశాం అని. ఆ అనుభవంతోనే ఓరగా చూచింది చిన్నప్పను. బిత్తరపోయి. అతనూ తనలాగే గాభరాపడుతున్నాడు. రెండుక్షణాలు అమితమైన నిశ్శబ్దంలో గడిచింది. తండ్రి ఏం అనలేకపోయాడు. కాని సుబ్బరాజు అందుకున్నాడు. "చిన్నీ, ఏంపనిచేశావ్! నీ తండ్రికి, ఒక్కడే కొడుకువు. ఆయన సర్వస్వం నీవేననుకుని నమ్ముకునివున్నాడు. అలాంటిఆయనకుటుంబంలో పుట్టి నీ వీ నీచపు పని చెయ్యటం మన వంశానికే తీరని కళంకం అయింది. అయిందేదో అయింది. తెలిసో తెలియకో చేశావు! ఇకనైనా యింటికి పద. అట్టే అల్లరికాలేదు లే!" అన్నాడు.

చిన్నప్ప మెదడు అసలు పనిచెయ్యటం మానేసింది! మూగవాడిలాగా, బిత్తరపోయి యిటు రాజమ్మవంకా, అటు తండ్రివంకా చూస్తూ కూర్చున్నాడు. నిజానికతను ఎదలో ఎంత తీరని ఆవేదన అనుభవిస్తున్నాడో! పాపం! ఇటు ప్రియురాలు, అటు తండ్రి...ఇటు ప్రేమ, అటు వంశగౌరవం! అయినా ఈనాటి లోకపు దృష్టిలో ప్రేమకు సరైన అర్థాన్ని, భావాన్ని యిచ్చి గౌరవించటంలేదు! దాన్ని కాముకంచేసి తుచ్ఛంగా చూస్తున్నారు! ఈదృష్ట్యా యిద్దరు ప్రేమించుకోవటం అంటే వంశగౌరవాలను కూకటివేళ్లతో పెల్లగించటం అన్నమాట. మాగి సంఘానికి బాకానందివ్వటంఅన్నమాట. ఫలానావారమ్మాయి 'లేచిపోయింద'నో, లేక ఫలానావారబ్బాయి 'లేవతీసుకువెళ్లా'డనో అంటారుగాని— "వారిద్దరూ హృదయపూర్వకంగా ప్రేమించుకుని, సంకుచితమైన సంఘవలయంలోనుంచి స్వేచ్ఛకోసం ఎగిరిపోయారు విహంగాలలాగ—సుఖజీవులు" అని అనరు. యిదీ నేటి సంఘరీతి. అందులో పడి నలిగే ప్రస్తుత జీవులు వీళ్లిద్దరూను. అందులో చిన్నప్పదే తప్పంతాను. కాని చిన్నప్ప తన బాధ్యత గుర్తించగలిగాడు! ఈ నడిమంత్రపు సమయంలో రాజమ్మని వదిలేస్తే ఆమె గతి ఏమిటి? ఈ తీవ్రసమస్య అతని మనస్సులో గొప్ప తుపానును లేపింది. చిక్కబట్టి అన్నాడు: "నేను రాజమ్మను ప్రేమించాను. ఆమెనే పెండ్లిచేసుకుంటాను." అని. క్రిందికి చూస్తూ కాలిబొటనవేలితో నేలమీద రాస్తున్నాడు. ఆమాటలకు హృదయంలో పదివేల నమస్కారాలర్పించుకుంది రాజమ్మ! చిన్నప్ప అమాయికత్వానికి ఆమెకు జాలివేసింది.

సుబ్బరాజు ఉరుములాగా మళ్లీ అందుకున్నాడు: "ముక్కుపచ్చలారని పసివాడివి నీకు ప్రేమలేమిటిరా? ప్రేమంటే ఏమిటో తెలియదు. అలాంటి దానిమీద గాలిమేడలు కట్టి గోతిలో పడేవుసుమా!

యిప్పటికే అయిన అప్రతిష్ఠ చాలు. దానికేం! దాన్నెవరూ ఏం అనరు—వూరూ పేరూ లేనిది. మనవూళ్లో మన కెంత తలవంపులు తెచ్చావో తెల్సునా? లోకం కోడైకూస్తోంది. నీకేం! మాపని ఎల్లా వుందనుకున్నావు?" అంటూ మొత్తమ్మీద ఒక యజ్ఞపశువును లాగే లాక్కెళ్లారు తన సమక్షంలోంచి! నిజంగా అన్నిట్టి వచ్చిన చిన్నప్పకు ఈ విషమైన పరాభవం జరుగుతుంటే ... అదీ ముఖ్యంగా తన కారణంవల్ల!... కాళ్లక్రింద భూమి కుంగిపోతున్నట్టే బాధపడ్డది రాజమ్మ. ఆనిర్దయులకు తన సంగతి పట్టనేలేదు. ఆఖరిసారిగా చిన్నప్పకళ్లలోకి చూచింది. అతని కళ్లు ఎంతో జాలిగా క్షమాపణ వేడుకుంటున్నాయి. అతని నిస్సహాయత్వాన్ని వ్యక్తపరుస్తున్నాయి.

మరికొద్దిక్షణాల్లో చిన్నప్ప రాజమ్మకళ్లముందు నుంచి జరిగిపోయాడు. అంతే! తన జీవితానికి మళ్లీ అతన్ని చూడలేకపోయింది! ఇక రాజమ్మ తన గతి తాను చూచుకోవాల్సివచ్చింది. కీకారణ్యంలోకి తీసుకొచ్చినతర్వాత కళ్లకు గంతలు విప్పినట్లయింది. ఎటువైపూగూడా నిర్గమమైన దట్టపుటడవి. అటు అన్నవద్దకు పోదామా! ఛీ! యిన్నాళ్లూ ఎంతో నమ్మకగా వుండి చివరకు రెండువంశాల గౌరవాన్ని మట్టిపాలుచేసిన తను ఆ వూ రేమొహం పెట్టుకు వెళ్లగలదు? పోనీ, క్షమించి చేరదీయటానికి తనేమున్నా చిన్నదా చితకదా? నడివయస్సం, బుద్ధితెల్సిన వయస్సు! కాసేపు స్తబ్ధుఅయిపోయింది ఆమె.

కాని అదృష్టవశాత్తు చిన్నప్ప తెచ్చిన డబ్బు తనదగ్గరే దాచటంవల్ల ఏదోవిధంగా పట్నం నుంచి తంటాలు పడి ఈ వూరుచేరుకుంది. యింతవరకూ లాభమో నష్టమో మొత్తమ్మీద ఈ వ్యాపకంతో తన పొట్ట తాను గడుపుకుంటోంది. రోజులు సాదాగానే గడిచిపోతున్నాయి.

తన జీవయాత్ర యిలాగే ముగిసిపోతుం దనుకున్న రాజమ్మను మళ్లీ ఈ క్రొత్త ఆశ అనుకోకుండా మభ్యపెడుతోంది. యిదీ చిన్నప్పవలె అవుతుందా? అలాకాదు. రంగయ్య నిలకడైన మనిషి. అతని ముఖం ఆ వెన్నెలలో చూడగలిగింది. కాలుష్యం అంటని అమాయికత తాండవిస్తోంది. ఇందులో తను పెద్దత్యాగం చెయ్యాల్సిందేమీ లేదు......ఇంతలోనే రాజమ్మకు నిద్రపట్టింది. ఏవేవో తియ్యనికలల్తో గడిచిందారాత్రి.

ఈ సంగతి రంగయ్య చెప్పినప్పట్నించి అతని వాకిటిముందు తన మామూలుదుకాణం పెట్టటానికి ఎంతో సిగ్గుపడి మానేసింది. మరికొన్నాళ్లకు రాజమ్మ కనపడలేదు. రంగయ్యగూడా నాల్రోజుల్నించీ కనబడటం లేదు.

వెంకన్న నడిగాను. "అయ్యా! మా బాబయ్యే రాజమ్మని పెళ్లి చేసుకున్నాడు. యిద్దరూ అట్టట్టా వూళ్లు తిరిగిరావటానికి వెళ్లారు." అంటూ ముసిముసినవ్వాడు.



# కవిత్వంలో క్రొత్త రీతులు

## వచనములాంటి పద్యాలు

= శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు =

'వచనంలాటి పద్యా లేమిటి' అని ముందరే విరుస్తారని నాకు తెలుసు. అటువంటివి లేకపోలేదని రుజువుపరిచేందుకు నేటికాలపు కవీశ్వరులలో వయోవృద్ధులైన శ్రీ వేంకటపార్వతీశ్వరుల పద్యం ఒకటి ఉదహరిస్తాను, చూడండి. వీరు 'కవిరాజహంస' లనీ, 'మధురకవు'లనీ బిరుదు వహించినవారు. అయినా ఇది వారే వ్రాశారుసుమండీ!

"రజనియా — నీ జేయు ప్రార్థనము పెడచెవిం బెట్టి వెడలిపోయినది;

దీపకళికలా — సదమలకాంతుల దొరగి, వెల్ల మొగముతో గనబడుచున్నవి;

మందిరమన్ననో — చెన్నుదొరగి చిన్నవోయినవగను దోచుచున్నది;

చూడ, నాకన్నులలోనె బల్లున తెల్లవారిపోయినది;

నీవు దరిసెనమ్మీమికే నేను తలగిపోయితివి గదా!

తలుపులు తీసిన వటులే నిరర్థకంబులై, యుండని, మ్మైననేమి ?
కనులు మూసి, నిను మదిలో గాంతును ప్రభు!"

పైన ఉదహరించినది సీసపద్యం. ఇది శుద్ధవచనంలా ఉంది. గణవిభజన చేసిచూస్తే ఛందోలక్షణాలు నిర్దుష్టంగా ఉంటాయి. ఇది వచనంలాటి పద్యం. ఇల్లాంటివి కాకుండా కేవలం 'వచనపద్య'మని ఇంకొకటికూడా వుంది. అది ఒకటి ఉదహరిస్తాను చూడండి.

"నాకు విచిత్రంబగు భావాలు కలవు.

నా కన్నులందున కెలిస్కోపులు మయిక్రోస్కోపు లున్నవి.

నా ఈ వచనపద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాల నడుముల్ విరగదంతాను.

చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని చాల దండిస్తాను;

ఇంగ్లీషు భాషాభాండాగారంలోనించి బందిపోటుం జేసి కావల్సిన మాటల్ని దోస్తాను.

నాయిష్టం వచ్చినట్లు చేస్తాను.

అనుసరిస్తాను నవీనపంథా..."

ఇది 'పఠాభి' అనే ఒక యువకవి వ్రాసిన 'ఫిడేలురాగాలు' అనే పుస్తకంలోని మొదటి పద్యం. ఇది ఇందాకటి ఉదాహరణలాగ సీసపద్యం కాదు; మరి ఏ ఇతరఛందస్సుకీ లొంగదు. ఇది శుద్ధవచనం; అయినా ఇది ఒక పద్యం. రచయిత దీనిని 'వచనపద్యం' అని పిలుచుకున్నాడుగదా! ఈ కవి ఇల్లాంటి పద్యాలతో ఒక పుస్తకమంతా వ్రాసి ప్రకటించాడు. ఈ రచనలను ఆధునికకవులు నవీనవైచిత్రితో కూడిన కావ్యసంపుటిగా ఆమోదించివున్నారు. వచనరచయితలు ఈ 'ఫిడేలురాగాల'ను వచనసాహిత్యంగా స్వీకరిస్తున్నామని చేయిచాపలేరు. కవులే వీటిని తమ సొరుగులోకి తీసుకున్నారు. అంచేత ఇవికూడా పద్యాలే అని ధృవపడింది. ఇవి వచనంలాంటి పద్యాలేకాకుండా కేవలం వచనపద్యాలే అనికూడా అంగీకరించకతప్పదు.

దీనినిబట్టి ఛందోబద్ధమైన పద్యాలు వచనంలా వ్రాయాలంటే వ్రాయవచ్చుననీ, ఛందోబద్ధం కాని శుద్ధవచనపద్యాలు అనేవికూడా ఉన్నాయనీ స్పష్టపడుతున్నది.

ఇందాకటి శ్రీ వేంకటపార్వతీశ్వరుల సీసపద్యంలో ఛందోలక్షణలోపంగాని, రచనాసౌలభ్యలోపంగాని వుందని అనడానికి వీలులేదు. వారి పద్యం చేతకాని కుంటినడకపద్యం కాదు. ఛందోలక్షణాలని చేతికింద బంట్లుగా లొంగదీసుకున్న సిద్ధహస్తం అక్కడ గోచరిస్తూనే ఉంది. పైగా వారు తమ ఇతరకావ్యాలలో లయాన్వితమైన శ్రావ్యసీసాలు విరచించినట్లు

చేను వేరుగా చెప్పనవసరం లేదు. అయినా ఒక సందర్భంలో వచనంలాగు ఛందస్సును నడిపించడం ఒకానొక విశిష్టకౌశలంగా, అపూర్వవైచిత్రిగా వారికి ఉపకరించింది. దేవునితో భక్తుడు ముఖాముఖిని మాట్లాడుతున్న సంతృప్తి పొందేనిమిత్తం వారు ఈ వచనశైలి అవలంబించారు. అంటే కవిభావంయొక్క అభివ్యక్తతకు కవి వచనాన్ని అనుకరించడంవల్లకూడా ఒక వైచిత్రిని సాధించగలడని తెలుస్తుంది. ఛందస్సుయొక్క సహజమైన నడకను అనుసరించడం ఏరీతిగా ఒక కౌశల్యాన్ని తెలుపుతుందో, అల్లాగే వచనస్వరూపాన్ని అనుకరించడంకూడా కవిత్వరచనకి ఒక అలంకారంగా ఉపకరిస్తుందని రుజువవుతున్నది.

కవి తన భావాలను వ్యక్తంచేసే భాష కొన్ని కొలతలకి లోబడితే అది ఛందోబద్ధం అవుతోంది. ఆ కొలతలయొక్క పద్ధతులు ఒక్కొక్క ఛందస్సులో ఒక్కొక్కరూపంలో స్థిరపడిపోయి ఉంటాయి. ఒక్కొక్క ఛందస్సు ఒక్కొక్క ముస్గులాంటి అల్లిక. శ్రీ వేంకటపార్వతీశ్వరుల సీసపద్యంలో ఆ అల్లికను త్రెంచివేయకుండానే వచనాన్ని అనుకరించారు. పఠాభిగారి వచనపద్యంలోని అల్లిక స్థిరపడిపోయింది కాకుండా, స్వతంత్రంగా, ఏవాక్యంలో ఏ కొలత అవసరమైతే అది ప్రయోగించుకుంటూ నడిచింది. అందువల్ల వారి రచనలో అల్లిక అసలు ఉన్నదా లేదా అనే అనుమానంకూడా కలుగుతుంది. అలవాటైతే, అందులోనూ కొన్ని గమనాలూ, కొన్ని శబ్దాలంకారాలూ, అర్థాలంకారాలూ కూడా మన కాళ్లకు బందంవేసి నిలబెట్టి కవిత్వభావంలో మాట్లాడుతాయి.

'మెరీనా' అనేపఠాభిగారివచనపద్యంలో చివరి భాగం పరిశీలిద్దాం. మద్రాసుసముద్రతీరాన చీకటిపడిన తర్వాత నడిచే అవినీతిపరుల చర్యలను వర్ణిస్తూ వ్రాసిన ఆవచన పద్యంలో పాదాలలో వుండే నడకలు గమనించండి:

"రంగుల వలుసులు గల వల్ల తారుల్లాగా"

"ఒకింతసేపసుసరికి"

"శరీరాన్ని సవారికిచ్చే జవరాళ్లు"

"ఆంగ్లోఇండియన్ అభాగినులు"

"అటూ యిటూ తటపటాయించుచున్న మర్యాదస్తుల మంద"

"ప్రకటించుచున్నవి తరంగాలు" అన్నప్పుడు మొదటిసంయుక్తాక్షరంలోని రకారమూ, 'తరంగాలు' లోని రకారమూ ఒక యతికాని యతినికల్పించుచున్నాయి.

"విగ్గరగా తమ యసమ్మతిని" అన్నప్పుడు కలిగే యమకం స్పష్టం.

"గాలి ఏడుస్తూంది" అని లీలగా తేల్చివేయడంలో జాలిపుట్టించే గుణం ఉంది.

"రగులుతున్నవి గగనంలోవ***

భువిగార్చిన కన్నీటిచుక్కల్లాగ ***

తారకలు"

ఇందులో 'గ'కారాల ఆవృత్తి జాలినీ, 'ర'కారంతో ప్రారంభమై అంత్యపదంలో తిరిగి దూరంగా పరుషమైన 'ర'కారం వెయ్యడంవల్ల కత్తినూరినట్లు ధ్వనించి 'క'కారాల చేరికవల్ల బీభత్సరసోత్పాదకంగా పరిణమిస్తున్నది.

"కానీ మనుజుని మనస్సులో

రేగుతున్నవి రకరకాల కోరికలు."

ఈ తుదివాక్యంలో 'న'కారాల తంత్రీనిస్వనంవల్ల నిస్పృహ జనించి, 'రకరకాల కోరికలు' అన్న చివరి భాగంలో మూడు హ్రస్వాక్షరాల వెంబడినే ఒక దీర్ఘాక్షరం, మరొక దీర్ఘాక్షరం వెంబడినే మూడుహ్రస్వాక్షరాలూ పేర్చి తద్వారా ఉచ్ఛ్వాసనిశ్వాసాల సాదృశ్యం చేకూర్చి నిజంగా నిట్టూర్పుతో పద్యం ముగించాడు కవి. ఇక్కడ తన నిస్పృహాపూర్వమైన నిట్టూర్పును పైన చెప్పిన అక్షరాల రంగవల్లికలో చిత్రించి, చదివేవారు కూడా తెలియకుండానే కవిత్వభావానికి అనువుగా నిట్టూర్పు విడిచేలాగ చేశాడు. ఇది ఛందస్సు కాకపోవచ్చుగాని, ఒక విశిష్టమైన రచనావైచిత్రి అని మాత్రం అంగీకరించకతప్పదు.

మొట్టమొదట మనం ఉదహరించిన శ్రీ వేంకటపార్వతీశ్వరకవుల సీసపద్యం తన ఛందస్సుయొక్క సంకెళ్లు దాచుకుని, స్వతంత్రాన్ని నటించింది. యువకవి అయిన పఠాభిగారి వచనపద్యం కేవలం స్వతంత్రంగా పుట్టి, అడుగడుగునా అవసరమైన ముస్గులు మాత్రం పెట్టుకుంటూ, కవితానుభవం మనస్సుకి చెప్పిన గమనాన్ని స్వతస్సిద్ధంగా కాగితంమీద పెట్టింది. అయితే పఠాభిగారి పద్యంలో గమనపు సొగసులు తొంగుకువచ్చి సగర్వంగా కనిపించవు. అడకువగానూ, అమాయికంగానూ తమ పని తాముచేసి ఊరుకుంటాయి.

కాని వచనపద్యాలు వ్రాసిన యువకవులంతా ఇల్లా మర్యాదగా ఊరుకునేవారు కాదు. 'నయాగరా' అనే ఒక పుస్తకంలో రామదాసు అనే యువకవి వచనపద్యాన్ని నయాగరాజలపాతంలా నడిపించాడు. ఈ పద్యంనడక మాత్రాబద్ధఛందస్సులకు దగ్గరదగ్గరగా పోతూపోతూ వెంటవెంటనే విడిపోయి స్వతంత్రమార్గాన్ని సర్పంలా పరుగిడుతుంది.

"చరిత్రలో తిరిగిన మరణపు
తిరగట్లో
విద్యుత్పుగింజల్లా
నలిగినలిగి
మండిన గుండెల్లో
కండలు ఎర్రని జెండాలై
ఎగిరిన వీరోజ్జ్వల!

బాడుబండికి కట్టిన ఎద్దుల
మెడపట్టెడ
గంటల గణగణలో
నినదించిన కంఠాలే
నిప్పుల రణశంఖాలై
పగిలిన వీరోజ్జ్వల!

*    *    *

జగత్తు ఒక పోల్జర్ అడుగై
కదనానికి
కదలిం దీరోజ్జ్వల!"

ఇల్లా పోయిపోయి ఇంకా ఏమంటాడు కవి:

"గట్టరల్లో అట్టడుగున
శోషిల్లిన దీనులార!

మరచక్రం తిప్పితిప్పి
అరిగిన చేతులార!

మీఘర్మజలం అఖండగోదావరిగా
పొంగిం దీరోజ్జ్వల!

పురోగమించిన మీరే
తిరోగమించిన బెర్లిన్!

భవిష్యత్తు మిమ్మల్నే
స్వయంవరం చేస్తున్నది!
మీ మెళ్లో పూలమాల వేస్తున్నది!
మీ కళ్యాణానికి రణధనుస్సు
విరిగిం దీరోజ్జ్వల!"

జర్మనీరణధనుస్సు విరిగి ఫహ్యాసు విజయలక్ష్మి వరించిన ముహూర్తాన్ని కవి ఇంత ఆవేశపూరితంగా ఈ వచనపద్యంలో వర్ణింపగలిగాడు. శివధనుస్సు విరిచి శ్రీరాముడు సీతాకళ్యాణానికి సిద్ధమైనప్పుడు వాల్మీకి కూడా రామాయణంలో ఇంత ఆవేశం చూపాడో లేదో! ఈరచన స్వతంత్రంగా కాకుండా కేవలం మాత్రాబద్ధమై నడిస్తే శ్రీ. శ్రీ. గారి కొన్ని గేయాలలాగా ఒకే కొలతని చేంతాడులా నడిచేది. ఇందులో పాదాలు అసమానమైనవిగా ఉండడంవల్ల విసిగించవలసినంత విసిగించకుండా నడవగలిగా యనుకుంటాను. అయితే, ఈ పద్యంలో కవిని ఉద్రిక్తంచేసిన ఆశాభావం భారతదేశవాసులకు సమకాలికంగా వాస్తవికానుభవం కాకపోవడంవల్ల, రచనావిధానంలోని ఆర్భాటం అతిశయోక్తిగా గోచరిస్తుంది.

వచనపద్యాలలో కరుణరసం ఎంతటి తన్మయత్వాన్ని జనింపజేయగలదో చూపేందుకు తిలక్ అనే మరొక యువకవి వ్రాసిన 'ముసలివాడు' అనే పద్యంలో భాగం ఉదహరిస్తాను.

"కనుగూడులు నల్లనయి
పెనువ్రేళ్ళులు చల్లనయి
కీలుకీలున బాధగా
నాడినాడులు లాగగా
చలిగాలి చూరిలో కసరినటు
చలిచీము మట్టిలో దొర్లినటు
వచ్చినది, మూగినది, ముసిరినది
ముసలితనము

ముసలివాణ్ణి, నాయనలారా,
ముసలివాణ్ణి.
పైకప్పు వంగిపడు
పాడిల్లువలె నిలిచి
తీతిపోయే వింతవింతల
చూసి, రోసి,
బ్రతుకొక్క ఆరిన వత్తికొడిలా తలచి,
మిథ్యలా కలచి
గతించిన జీతించిన
బ్రతుకులోనికి
చూసి, రోసి
బ్రతుకొక్క ఆరిన వత్తికొడిలా తలచి
మిథ్యలా కలచి
పెదవిసందుల వెగటునవ్వును బిగబట్టి
కన్రవానుకు సాగిపోయే

ఎముకల గూడుని
ముసలివాణ్ణి, నాయనలారా!
ముసలివాణ్ణి!
ఒకనాడు నే ప్రొఫెసర్ని
సామ్యవాదిని
గ్రంథకర్తని
అప్పుడు భవిష్యత్తు రంగురంగుల వల
ఈనాడు గుండెలలో మెదిలే పీడకల,
నేను కనులపందుల నిరాశ,
ముసిముసిగ సాగిపోయే
ముసలివాణ్ణి, నాయనలారా
ముసలివాణ్ణి."

ఇల్లా ఈపద్యం సోలుతూ, తూలుతూ, కాలు తడబడుతూ, కర్రపుచ్చుకు తొట్రుపాటుతో నడిచే ముసలివానిలాగే సాగిసాగి—

"చివరకు, చివరకు, అక్కడికే, అక్కడికే,
అది జీవితపరమసత్యం,
అది నాగరకతగమ్యస్థానం,
అది చరిత్రల సారాంశం,
అక్కడ చీకటి, లోతెరుగని చీకటి,
దట్టపుచీకటి, సుడితిరిగే చీకటి,
పాములు బుసకొట్టే చీకటి,
అక్కడికే, అక్కడికే వెళ్లబోయే
ముసలివాణ్ణి నాయనలారా,
ముసలివాణ్ణి!"

అని ముగుస్తుంది.

ఇంతవరకు వచనంలాంటి పద్యాలు, వచన పద్యాలుకూడా ఆధునిక ఆంధ్రసాహిత్యరంగంలో ఉన్నాయని రూఢిచేశాం కనుక, అట్టి సాహిత్యం యొక్క సార్థకత, పుట్టుపూర్వోత్తరాలూ, వాటి వాటి స్వభావం మొదలైన విషయాలను గురించిన సమాలోచన క్లుప్తంగా చేయడం అవసరం.

తన రచనకి వచనపద్యం అని నామధేయం చేసుకున్న పఠాభి తన మొదటిపద్యంలోనే "ఇంగ్లీషు భాషాభాండారంలో బందిపోటు" చేస్తానని చాటి చెప్పుకున్నాడు. దీనినిబట్టి ఈ రీతి స్వతంత్రపద్యరచనకి ఆంగ్లసాహిత్యప్రభావం మూలకందమైవుంటుందని మనం ఊహించుకోడంలో పొరపాటు ఉండదు.

'ఆంగ్లసాహిత్యంలో నవ్యరీతులు' అనే గ్రంథంలో శ్రీ అమియచక్రవర్తిగారు "నేటికాలపు ఆంగ్లసాహిత్యంలో 'Free Verse'—అంటే స్వతంత్రఛందం చాలావిరివిగా ప్రయోగంలో వుంద"ని చెప్తున్నారు. ఆంగ్లంలో ఈ విధానానికి ప్రాతిపదిక మిల్టన్, షేక్స్పియర్లు వ్రాసిన Blank Verseలోనూ, అంతకు పూర్వపు Anglo-Saxon సాహిత్యంలోనూ కూడా కనిపిస్తాయని అప్పటి విమర్శకులు చెప్తున్నారట.

ఒక ఆంగ్లవిమర్శగ్రంథంలో ఆధునికుల స్వతంత్రగమనాలని గురించి వివరిస్తూ ఇలా అన్నారు:

"నీరసించిన కవిత్వరచనావిధానాలకి చేతికర్ర తీసేసి తిరిగి స్వతంత్రగమనం అలవరిచి పునరుజ్జీవనం కలిగించడానికి ఈవిధమైన ఆధునికరచనాపద్ధతి ఉపకరిస్తుంది. రైమ్, మీటర్ మొదలైన ఛందోనియమాలు సాధారణంగా నిర్జీవమైన కవిత్వాన్ని నిలబెట్టేందుకు ఉపకరిస్తాయన్నమాట నిజమేఅయినా, ఏ నియమమూ లేకుండా ఉత్తభావోద్రేకంతో నిండిన రచన—స్వతంత్రరచన అయినా, అస్వతంత్రరచన అయినా సరే—మంచి రచన కాజాలదు. స్వతంత్రపద్యాలను పరిశీలించి చూస్తే, వాటి గమనసౌందర్యం ఛందోలక్షణాలను కేవలం తిరస్కరించడంమీద ఆధారపడదనీ, ఛందస్సులకు మూలకందమైన మాత్రాలలో వినూతనమైన ప్రస్తారాలను సమ్మేళనం చేయడంవల్ల ఏర్పడుతుందనీ తెలుస్తుంది."

కవిత్వంలో ఈ మార్పు ఆధునికత్వానికి ఒక చిహ్నంగా ఏర్పడిపోతోంది. ఆంగ్లకవిత్వంలో నేటికాలపు రచయితలు, ఛంధస్సులు బాగా నడుపగలవారైనాగాని, ఇల్లాంటి స్వతంత్రఛందోరచన సర్వసాధారణంగా సాగిస్తున్నారు. మన తెలుగుకవిత్వంలో కూడా, ముఖ్యంగా ౧౯౩౦ సంవత్సరం తర్వాత గమనిస్తే, ఇట్టి స్వతంత్రరచన రానురాను పరిపాటి అయిపోయింది. ఇవ్వాళ యువకవులూ, నవకవులూ చాలామట్టుకు ఈ రీతి వచనపద్యాలే సృష్టిస్తున్నారు. క్రొత్తకవులలో మన పూర్వపు ఛందస్సులు తరుచుగా వ్రాసేవారు తక్కువ.

సాహితీసమితి తొలిరోజులలో వృత్తాలు, గీతాలు బాగా ప్రయోగించారు. మిగతా తెలుగుఛందస్సులు విరివిగా వినియోగించుకోలేదు. అంతేకాక అనేకవిధాలైన గేయాలు, అంటే మాత్రాబద్ధమైన ఛందాలు సృష్టించారు. ఛందోరహితంగా వ్రాయాలని ఆరోజులలో కుతూహలం లేదు. తరువాతి తరంకవులు

గణబద్ధమైన ఛందాలని వాడడం తగ్గించారు. మాత్రాబద్ధమైన నడకలలో కేవలం క్రమపద్ధతిని వ్రాయడం మాని, ఆ నడకలలో అనేకవిధములైన తారుమారులు, కూడికతీసివేతలూ కల్పించుకున్నారు. భావోద్రేకం యొక్క అవసరాన్ని బట్టి నెమ్మదిగా నడపడం, వేగంగా నడపడంగాని, ఒక నడక చేయవలసిన పని అయిపోగానే మరొక గమనం ఎత్తుకోడం, అందువల్ల పద్యం పూర్తిఅయ్యేసరికి అనేకమాత్రాఛందాల ఛాయలు తోపించడంగాని, ఇల్లాంటి కిటుకులు చాలారకాలని తమ రచనలలో ప్రతిబింబపజేస్తూవచ్చారు. ఇంతకన్నా ముఖ్యమైన అంశం ఏమిటంటే, వీరి భాషయొక్క నుడికారం మాట్లాడుకునే భాషయొక్క నుడికారానికీ ఉచ్చారణకీ చేరికగా వుండటం. ఈమార్పులన్నీ —తెలిసీ, తెలియకుండానూకూడా—యువకవుల రచనలలో ద్యోతకమౌతున్నాయి. ఏగమనమూ లేని వచన రచనగా దీనిని పరిగణించేందుకు వీలులేదు. ఇందులో ఇంద్రధనుస్సులాగ అనేకరంగులు, అనేకగమనాలు, అనేక అలంకారాలు, అనేక ఆలోచనలు, లోతు, వైశాల్యం, ఉద్రేకం మొదలైన గుణాలన్నీ కనిపిస్తాయి.

ఆంగ్లకవిత్వంలో ఈ మార్పులను సమర్థిస్తూ విమర్శకులు ఇల్లా అన్నారు : "సాంఘికజీవితంయొక్క గమనం మారి, పరిసర పరిస్థితులు అనుకోని విధంగా వేగంగా మారిపోతూ వున్నప్పుడు మన అభివ్యక్తతకు ఆధారమైన భావంలోనూ, రచనావిధానంలోనూ కూడా నూతనమైన పరివర్తన కలుగుతుంది."

ఆధునికయుగంలో సాహసం ప్రధానగుణం. మనం మార్పులకి వశంఅవుతూవున్నాం. మనం మార్పులని అభిలషించి ఆహ్వానిస్తూకూడావున్నాం. ఒక క్రొత్తవిషయం తెలియగానే ఒక పాతవిశ్వాసం వొదిలిపెడుతున్నాం. క్రొత్తపరిసరాలూ, క్రొత్తఅనుభవాలూ ఏర్పడగానే పాతమాటలూ, పాతఛందాలూ వాటిని వ్యక్తపరచడానికి చాలనట్లు తెలుసుకుంటాము. సంఘజీవితంలో క్రొత్తనిర్మాణవిధానం అన్వేషించి, అంగీకరించినట్లే కవిత్వరచనలోకూడా కవులు క్రొత్తగమనాలకోసం అన్వేషించి, వాటి ప్రయోజనాలని ప్రయోగంద్వారా రుజువుచేస్తున్నారు.

పతనమైన ఆంధ్రసాహిత్యాభిరుచిని ఆదర్శప్రాయం చేయాలని ఆధునికులలో మొదటితరంలోని కవులు ప్రయత్నించి అభిరుచినీ, అనుభూతినీ ఒక స్వప్నలోకంలోకి తీసుకుపోయారు. ఆంగ్లసాహిత్యంలోనూ మొదటిప్రపంచయుద్ధానికి క్రితం ఇల్లాగే జరిగింది. అప్పటి కవులు ఆదర్శప్రాయమైన ఒక దంతహర్మ్యాగ్రాన్ని కవితని బంధించారని నేటి ఆంగ్లవిమర్శకులు వర్ణిస్తారు. ఇప్పటి తెలుగుయువకవులు మనతోటి జనుల స్వప్నానుభూతిని భూతలానికి దింపాలని యత్నిస్తున్నారు. కవిత్వాన్ని గగనలోకంలో కాకుండా వాస్తవమైన ప్రజాజీవితంలోనూ, ప్రజల హృదయావేశాలలోనూ, నడివీథిలోనూ, రాజకీయసాంఘిక పరిసరాలలోనూ దర్శించేందుకు ప్రయత్నిస్తున్నారు. ఇప్పుడు ప్రజానీకంయొక్క జీవితం ఎక్కువ ప్రబుద్ధమై మెలకువగా ఉంది. ప్రబుద్ధజీవితంయొక్క మెలకువలన్నీ కవిత్వరచనలో ప్రతిబింబించాలంటే మన కావ్యసాహిత్యంలో ప్రచారంలో వున్న అయిదారు ఛందస్సులూ సరిపోవడం లేదు. పైగా అవి అతికడమూ లేదు. అందువల్ల స్వతంత్రించి, విషయభావాలకు అనుగుణమైన క్రొత్తగమనాలు కనిపెట్టుకు, నవకవులు సంపూర్ణవ్యక్తతకు మార్గాలు నిర్మించుకుంటున్నారు.

ఇది సామాన్యప్రజలకు కవిత్వాన్ని చేరువచేసే మార్గమే కాకుండా, నూతన ఛందోరీతులు సృష్టికావడానికికూడా ఈ ప్రయత్నాలన్నీ సహకరిస్తాయి. ప్రతి నవకవీ వ్రాసే వచనపద్యంలోనూ కొన్నికొన్ని నూతనఛందోగమనాలయొక్క బీజాలు ఇమిడివున్నాయని నానమ్మకం. ఈ నూతనఛందస్సులకోసం జరిగే అజ్ఞాతాన్వేషణ ఆయారచయితల రచనలలోనే ప్రతిబింబిస్తూవుంది. శ్రీ పద్మరాజుగారు 'చీకటి' నిగురించి వ్రాసిన వచన పద్యంలో—

"జీవిజీవికీ వెనుకనున్న భావం
రూపొందిన ఏకైకారావం
ఆ సుప్తఛందమే—
వ్రాయని పద్యమయింది
నాజాగృతిలో" అన్నారు.

ఆ 'వ్రాయనిపద్యాన్ని' వారు వ్రాయడానికి పూనుకునేటప్పటికి ఈ వచనపద్యం పుట్టింది. ఇది వారి కవిహృదయంయొక్క అభివ్యక్తతకి ఒక సోపానంగా ఉపకరించింది.

'తిలక్' అన్నాడు ఒక వచనపద్యంలో—
"నా అక్షరాలు కన్నీటిజడులలో తడిసిన
దయాపారావతాలు.
నా అక్షరాలు ప్రజాశక్తి వహించే
విజయ ఐరావతాలు.
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే
అందమైన ఆడపిల్లలు."

వీరి రచన వచనపద్యం అయినా, వీరి అక్షరాల పొందికలో దయారసమూ, విజయోత్సాహం, అందం సమ్మిళితమైనా యనే ధీమాతో పలుకుతున్నా డీకవి.

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు 'మహాకవి ఆశ్చర్యం' అని ఒక వచనరచన చేశారు. ఆ రచనలో ఇమిడిన భావవైచిత్రివల్లా, శైలీవైచిత్రివల్లా అది పద్యం లాంటి వచనం అయిపోయింది. దానినికూడా నేను వచనపద్యమని పిలుస్తాను. ఆ రచనలో చివరని వారు నేను ఇంతవరకు చెప్తున్న సమర్థనల నన్నిటినీ క్రోడీకరించి కవిత్వభాషలో చెప్పేశారు. చూడండి:

"......ఛందస్సు (గాయత్రిసాక్షిగా చెబుతున్నాను) ఎటు తిరిగితే అటే ఒరుగుతుంది. విధానంలో వికారం. మాత్రలు మింగడం నాకు చేతకాదు. అల్లిక రంగవల్లి. అంకెలు మన సంకెళ్లు. అసగవయ్యా, ఆర్థికశాస్త్రపండితుణ్ణి. పర్వతం పండి బద్దలవుతోంది. లావా...... దేవీ......

అన్నిటిలో అందం వుంది. అర్థంవుంది. కావలసినన్ని ఉపమానాలకి అక్కరలేనన్ని ఉపమేయాలు. ఎక్కడో పోలిక దొరుకుతుంది. ఎక్కడో చేతులు కలుస్తాయి. స్నేహం చేసుకుంటుంది. ఇంద్రనీలమణులను కరగించి ఎవరో సముద్రాన్ని సృష్టించారన్నారే, ఆమాట రుజువుచెయ్యగలవా? కార్మిక ఘర్మకకోర ఘోరతలో కదలికి రూపం కలిగిందని నే నంటేనా కోపం. అదో దృక్పథం.. అదో చిత్తవృత్తి. ఆస్థితిలో అన్నీ క్షమిస్తావు. అన్నీ రుచిస్తాయి.

దృక్కోణం.

స్వప్నాలను కోస్తున్నాడు శస్త్రవైద్యుడు... ...లలో, మేఘాలలో,......యలలో, లోయలలో ఉన్నవి ఉంటాయి. పోయినవి పోతాయి. నీ కెందుకు బాధ? బా......ధ......బా...అబ్బా...బా...

బా...బా...బా...బాం...బాం....బాం... బాంబు!"

ఈ శ్రీ. శ్రీ. గారి వచనంలో నేటి ప్రపంచంలోని ప్రసవవేదన, నేటి కవితారీతులలోని ప్రసవవేదన, ధ్వన్యనుకరణంతో సహా బాంబులా బ్రద్దలయింది. ఈ వచనం వచనపద్యచమత్కారానికి ఒక అంచు. నూతన ఛందోనిర్మాణానికి ఒక ప్రాతిపదిక. నవకవుల స్వతంత్రస్వప్నాలకీ, స్వతంత్రఛందాలకీ జటిలమైన భాషలో చెప్పే స్పష్టమైన ఒక సమర్థన.

పఠాభిగారి 'ఫిడేలురాగాల'నే వచనపద్య సంపుటానికి శ్రీ. శ్రీ. గారు వ్రాసిన పరిచయవాక్యాలలో ఈ అభిప్రాయాలే మామూలు వచనంలో విమర్శకుడుగా మాట్లాడుతూ చెప్పారు. ఆ ముక్కలతో ముగిస్తాను: "ఛందస్సుల చండశాసనానికికూడా కాలం వెల్లిపోయింది. కవిహృదయంలోని రాగాలాపన ఎట్టి తీగలుగాసాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి. లయగ్రాహిలో వసంతవర్ణన, మహాస్రగ్ధరలో యుద్ధగీతం ఒకప్పుడు బాగానే నడిచాయి. నవకవికి అనుకరణ అసహ్యం. క్రొత్తశక్తులు క్రొత్తరూపంలో సాక్షాత్కరించాలి."

ఈ క్రొత్తరూపమే ప్రస్తుతం మనం ఉదహరించిన వచనపద్యవిధానం అని నామనవి.

[ఇటీవల మద్రాసు రేడియో కేంద్రమున నొసగిన ప్రసంగమునకు విపులీకరణము.—ము. వి. రా.]



# — సంక్రాంతి —



= శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి =

తొలికొండ నదిగో నరుణప్రభల్ జిమ్మెనోయ్
కులుకు జెడి పలుగాకి చీకటులు చెదరెనోయ్,
పలువలువ జిరునవ్వ, తొలుకాడు జవ్వనులు
పొలమేగ యిలువదలి చనుచుండి రదెగనుము
పల్లెసొగసుల గందువా!
సంక్రాంతి
సర్వశోభల గాంతువా!

ఖంగారుచిందులతో ఛెంగుఛెంగున మొగురు
నందివాహన మదిగొ కందోయికిం దోచె
సింగార మొలికించు మందారపూలతో
బంతిపూదండతో, బొంతరటిపండ్లతో
హారతులు పై కెత్తెనోయ్
సంక్రాంతి
పల్లెపడుచును చూడవోయ్.

కౌశల్య మెలయించి, రంగవల్లియ లల్లి
కమ్మతేనెల జిమ్ము పూగుత్తులం దెచ్చి,
గొబ్బిళ్ళపై గ్రుచ్చి, గొంతు సవరించుచుఁ
కలకంఠజనితహా, కోమలశృతులతో
గొబ్బెమ్మ నర్చింతురోయ్,
సంక్రాంతి
ప్రొద్దు లెటు మరువగలనోయ్.

బంగారురాసులతో రంగారుచేలగని,
అందాల గుళ్ళపే రందింతు నతి కంచు,
పందేరములతోడి విందులే గూర్తునని,
శృంగార మానంద మెదనింపె కర్షకుడు.
యీసుఖం బెట కందువోయ్
సంక్రాంతి
పల్లెపట్టుల నుండునోయ్.

పాడిపంటలతోడ, పసిడికాన్కలతోడ
ఆడుపడుచుల బిలచి, అల్లుళ్ల మురుపెంచి,
పడుచు లేచుచు దిరుగు పసిపాప నొడిసెత్తి,
కనుపండు వౌనట్లు, గడపనా పండువుల
కడగండ్ల మరుపుగనెనోయ్
సంక్రాంతి
తొలిప్రొద్దు వినుతించెనోయ్.

సుఖమైన పొగ లెగయు నగరుధూపాలతో
మమకార మొదవించు మంచిగంధాలతో
యీనాళ్ళ మానాళ్ళ సౌఖ్యముల్ సంపదల్
భోగభాగ్యాలతో తులతూగుచుండునోయ్,
కలతపడు మనసె లేదోయ్,
సంక్రాంతి
కలిమిలేములు చూడదోయ్.

తన తాకిడికి యొడలు పులకలిడ చలిగాలి
వెనువెంట వదలకయె, చనుదేర పయనమై
నడయాట నుడికార మెడలించు చిరుతలతో
పసిచెడని సొరకాయ తంబురా మీటుచును,
సాతాని యరుదెంచెనోయ్
సంక్రాంతి
మేలుకొలుపులు పాడెనోయ్.

శిశిరార్ద్రనిశలందు చివురొందు సౌఖ్యమును
తుహినాంశుకిరణాల తొలుకాడు శాంతియును
పండువుల మెండౌచు నిండు సౌభాగ్యమును
యలదోట విహరించు నెలదేటి స్వేచ్ఛలును
మీకునై నెలయించునోయ్
సంక్రాంతి
నవ్యాబ్ది మొదటిగుర్తోయ్.

# సేలందొమ్మి కేసులు

= శ్రీ దిగవల్లి వెంకటశివరావు =

౧౯౪౨ వ సంవత్సరము ఆగష్టు ౧౫-౧౬ తేదులలో సేలములో జరిగిన దొమ్మిసందర్భములో మాణిక్యం మొదలియారును, ఇంకను మరికొందరును హత్యచేసి, ఇండ్లు తగులబెట్టిన నేరమునకు మద్దతుచేయుటకు కుట్ర చేసి రను అనుమానముపైన మేజస్ట్రీటుసంతకముతో జారీచేయబడిన వారంటులనుబట్టి అరెస్టుచేయబడి ఖైదులోనుంచబడిరి. తమ్మెందుకు పట్టుకొనిరో వివరములు తెలుపవలసినదని వారడిగినను తెలుపలేదు. జెయిలులో వారి గౌరవమునుబట్టి వారి కొసగవలసిన సౌకర్యములను జైలు ధికారులు వారి కొసగలేదు. వారిని జామీనుపైన విడుదలచేయవలసిన దని కోరినను విడువలేదు.

ఆ సందర్భములో ఆగష్టు ౩౦ వ తేదీన ౭ మందిని, ౩౧ వ తేదీన ఒకరిని అరెస్టుచేసిరి. చినకైలాస గౌండనును ౩ వ సెప్టెంబరు తేదీన అరెస్టుచేసిరి. ఆగష్టు ౧౬ వ తేదీన జరిగిన దొమ్మిని జరిగించుటకు వీరు కుట్రచేసినట్లు అనుమానించుటకు బలవత్తరమైన కారణములు తనకు చూపబడినట్లు జిల్లా మేజస్ట్రీటు ౩౦ వ తేదీన స్వదస్తూరీతో వ్రాసినాడు. అయితే ముద్దాయీలను అరెస్టుచేసి తెచ్చినప్పుడు ఫిర్యాదినిగాని, మరియెవ్వరినిగాని మేజస్ట్రీటు విచారించలేదు. ఈ సంగతులు హైకోర్టువారికి మనవిచేసినను వారు జామీనుపైన విడుదలచేయలేదు.

ఈ కేసులవిషయమై సేలములోను, సేలముజిల్లాలోను ప్రజలందరు చెప్పుకొనుచు గొప్ప ప్రచురణము జరిగియున్నందున అక్కడ విచారణ జరిగినయెడల తమకు నిష్పక్షపాతమైన న్యాయము జరుగ దనియు, ఈ కేసుల నింకొక జిల్లాకు మార్చవలసినదనియు ముద్దాయీలు హైకోర్టువారిని వేడుకొనిరి. గాని నేరము జరిగినచోటనే కేసులు విచారించుట యుచితమనియు, సాక్షులను ఇతరచోటులకు హాజరుపరచుట కష్టమనియు చెప్పి హైకోర్టువారు ముద్దాయీలకోరికను నిరాకరించిరి.

ఈ సంగతులు ప్రభుత్వమువారు ప్రకటించు హైకోర్టున్యాయస్థానతీర్పులలో ౬ వ సంపుటములో ౬౩ వ పుటలో గల మాణిక్యంమొదలివగైరాల క్రిమినలు రివిజను కేసులో ప్రచురింపబడినవి. ఈ తీర్పు ౧౯౪౨ వ సెప్టెంబరు ౭ వ తేదీన చేయబడినది.

పొన్నుసామిచెట్టిని, మరికొందరిని పైసందర్భములోనే ఆగష్టు ౩౧-వ తేదీనను, సెప్టెంబరు ౭, ౧౩ తేదీలలోను అరెస్టుచేసి జిల్లా మేజస్ట్రీటుయెదుట హాజరు పరుపగా ఆయన ఎట్టిసాక్ష్యమును తీసుకొనకయే వారినందరిని ఖైదులో నుంచెను. జామీనుపైన విడచుటకు నిరాకరించినాడు. దీనిని గురించి వారు హైకోర్టుకు క్రిమినలురివిజనుపిటీషను దాఖలుచేయగా అది ౧౯౪౨ సెప్టెంబరు ౨౨-వ తేదీన విచారణకు వచ్చెను. అప్పటికే ఈకేసుల విచారణకు స్పెషల్ మేజస్ట్రీటు నియమింపబడి విచారణ ప్రారంభించియున్నందున వారిని జామీనుమీద విడుదలచేయుటకు నిరాకరించిరి. ఈకేసు ఇండియన్ లారిపోర్ట్సు ౬-వ సంఖ్య మద్రాసుసంపుటములో ౬౯-వ పుటలో ప్రకటింపబడినది.

౧౯౪౨-వ సం. ఆగష్టు ౧౬-వ తేదీన సేలం దగ్గర సెవ్వయిపేటలోని మసీదును తగులబెట్టిన నేరము

వకు మద్దతుచేసి రను జేరమునకు సుందరం పెట్టి, పొన్నుసామి పెట్టి మొదలైన ౧౫ మందికి సేలంజిల్లా అడిషనల్ సెషన్సుజడ్జి కారాగారవాస, ద్వీపాంతరవాసశిక్షలు విధించినాడు. సెషన్సుజడ్జిగారి తీర్పుపైన ముద్దాయీలు మద్రాసు హైకోర్టువారికి అప్పీలుచేసికొనిరి. గాని ఆ కోర్టువారుకూడా శిక్షలను ఖాయపరచిరి.

ఈ కేసు సంగతు లన్నియు సెషన్సుజడ్జిగారి తీర్పులో చక్కగా వివరింపబడినవి.

౧౯౩౧ ఆగస్టు ౧౬-వ తేదీన జరిగిన దొమ్మి యొక్క నిజస్వభావమును గ్రహించుటకు ఈ మసీదు చరిత్రను తెలిసికొనుట అవసరము.

సేలముదగ్గర సెవ్వాయిపేటలోని మహమ్మదీయులు ౧౯౨౫-వ సం. మేనెలలో ఒక మసీదు కట్టుకొనుటకు కలెక్టరుఅనుజ్ఞను కోరిరి. అప్పుడక్కడి హిందువులు ఇది వల్లకాదనిరి. అంతట అప్పటి కలెక్టరు లాంగ్లే దొరగారు అనుజ్ఞ నిచ్చుటకు ౧౯౨౬లో నిరాకరించిరి. ఈవిషయమై మహమ్మదీయులు ౧౯౨౭ లో మరల దరఖాస్తుపెట్టుకొనిరి. అంతట హిందువులుకూడా ఒక ఎదురుబడిఅర్జీని దాఖలుచేసిరి. హిందువుల ఊరేగింపులకుగాని, ఇతర యూరేగింపులకుగాని మహమ్మదీయులు అభ్యంతరములు పెట్టకుండు పద్ధతికి లోబడి మసీదుకట్టుకొనుటకు మహమ్మదీయుల కనుజ్ఞ నిచ్చుటకు లాంగ్లేగారు నిశ్చయించి ఆప్రకారము ౧౯౨౭-వ సం. జనేవరు ౧౨-వ తేదీన ఉత్తర్వులు జారీచేసిరి.

౧౯౨౮-వ సం. మే ౭-వ తేదీన మద్రాసుప్రభుత్వమువారు జారీచేసిన జీ. ఓ. ఉత్తర్వులప్రకారము తురకల మసీదుదగ్గరనుండి హిందువుల ఊరేగింపులు, ఇతరయూరేగింపులు పోవునప్పుడు మేళతాళములను, బాజాలను ఆపుచేయవలెననికూడా లాంగ్లేగారు ఉత్తర్వు చేసిరి. పూర్వము మహమ్మదీయులు మసీదుకట్టుకొనుటకు అనుజ్ఞ కోరినప్పుడు, ఆప్రదేశమున నొక వారధి (Cause-way) కట్టుటకా స్థల మవసరమగునని అనుజ్ఞ నివ్వలేదనియు, ఇప్పుడావారధి యింకొకచోట కట్టబడినందున ఆ స్థల మవసరములేదనియు, మహమ్మదీయులు తమ మసీదును నిర్మించుకొనుటకు కావలసిన సామానంతయు సిద్ధముచేసికొనిరనియు, మూడేండ్లనుండి ఆస్థలముదగ్గరనే ఇంకొక చిన్నకట్టడములో తమ ప్రార్థనలు జరుపుకొనుచున్నారనియు, మునిసిపలుకమిషనర్లను, ఇతరులను తా నాలోచించితిననియు, మహమ్మదీయులకోరిక న్యాయమైనదే యని తా నభిప్రాయపడుచున్నాననియు, హిందువులు కేవలము కక్షకొరకే అభ్యంతరపెట్టుచున్నట్లు తనకు తోచుచున్నదనియు చెప్పి కలెక్టరుగారు హిందువుల అర్జీని త్రోసిపుచ్చినాడు.

మసీదునిర్మాణమువిషయములో హిందువులయాక్షేపణలు కేవలము నిరాధారములేనా యను సంగతిని కొంచెము చూతము. మహమ్మదీయులు తమ మసీదును కట్టుకొనుటకు నిర్దేశించిన స్థలము నదియొడ్డున గల ఒక ఎత్తైన ప్రదేశము. అది చాలా ప్రాముఖ్యమైనది. ఉత్తరమునుండి యొక రోడ్డును, పడమటినుండి రెండు రోడ్లును వచ్చి అక్కడ కలియును (Converge). అక్కడనుండి యింకొక బాట ఏటవాలుగా పోయినది. మీదివంతెనపైకి పోవును. అందువల్ల అక్కడ మసీదు కట్టినయెడల హిందువుల యూరేగింపు లన్నియు పోవు రెండురోడ్లను దానికి రెండుప్రక్కలను చుట్టుకొని యుండును. ఆప్రదేశమునకు తూర్పున ఒక బీటిభూమి (Waste) ఉన్నది. దానిలో పాడుపడిన దేవాలయ మొకటి యున్నది. దాని దగ్గర నొక చిన్న విఘ్నేశ్వరాలయముకూడా ఉన్నది. దాని దగ్గరనుండియే నదిలోని స్నానఘట్టమునకు పోవు మెట్లు కలవు. అందువలన అక్కడ మసీదు కట్టుటకు హిందువుల కిష్టము లేకపోవుటకు కారణము కేవలము అన్యమతముపట్ల అసహనముమాత్రమే గాక తమకు ఇబ్బంది కలుగు నను కారణముకూడ లేకపోలేదు.

ఈ కేసులో సాక్షిసాధనములలో నొకటిగా ప్రదర్శింపబడిన ఫోక్సుదొర వ్రాసిన మెమోరాండము వలన కొన్ని విశేషములు తెలియుచున్నవి. ఊరిలోని ఇతర దేవాలయములలోని దేవతలను ఊరేగించునప్పుడెల్ల పైనచెప్పిన రోడ్డుప్రక్కనున్న ఖాళీస్థలములోని విఘ్నేశ్వరాలయముదగ్గర మేళతాళములు నృత్యముతో కొలువు జరిగితీరవలయు నను ఆచార మొకటి చిరకాలానుగతముగా నున్నది. అయితే సేలములో ఊరే

౫

వుల విషయమై హైకోర్టుకు పోయి, మద్రాసు హైకోర్టు తీర్పుల రెండవ సంపుటము ౧౮౦ వ పుటలో ప్రచురణముకాబడిన కేసుసందర్భములో ఈ ఆచారముసంగతి చర్చకు వచ్చియుండలేదు. మశీదుకు తూర్పున గల కోడ్డుమీదుగా పోవు హక్కునుగురించి మాత్రమే వాదన జరిగినది. బహుశా ఈ ఆచారము కొంతకాలము నుండి సరిగా ఆచరణలో లేకుండియుండి ౧౮౮౧ వ సం. డిశంబరులో హిందువులు దీనిని మరల ఉద్ధరించుటకు ప్రయత్నించియుందు రని యూహించవచ్చును.

హిందువుల యూరేగింపులు ఈ క్రొత్తమశీదు దగ్గరనుండి పోవునప్పుడు మేళతాళములను ఆపివేయవలెనని జిల్లా మేజస్ట్రీటు (కలెక్టరు) చేసిన యుత్తరువు సశాస్త్రీయమైనది కాదని తలచి ఈ కేసులోని ముద్దాయియైన సుందరము సెట్టిగారును, సెవ్వాయిపేటలోని మరికొందరు హిందూప్రముఖులును సేలముజిల్లా మునసబు కోర్టులో ౧౮౮౨ వ సంవత్సరపు ౨౦౮ వ నెంబరు వ్యాజ్యమును దాఖలుచేసిరి.

అప్పుడు జిల్లామునసబుగా నొక బ్రాహ్మణుడు. హిందువు లితరప్రదేశములలో నెంత స్వేచ్ఛగా నూరేగింపులు చేసికొందురో మశీదుప్రక్కనుండి కూడా అంత స్వేచ్ఛగాను ఊరేగింపులు చేసికొనవచ్చునని ఆయన ౧౮౮౫ వ సం. మార్చి ౩౧ వ తేదీన తీర్మానించిరి. మహమ్మదీయు లీ తీర్పుపైన జిల్లాకోర్టులో అప్పీలుచేసిరి. జిల్లాజడ్జియైన హేస్టింగ్సు దొర గవర్నమెంటువారి ౧౮౮౪ వ సం. మే ౯ వ తేది జి. ఓ. ననుసరించి జిల్లామునసబుగారి తీర్పును ౧౮౮౫ వ సం. జూలై ౨౭ వ తేదీన రద్దుచేసి హిందువుల దావాను కొట్టివేసిరి. అంతట హిందువులు హైకోర్టులో సెకండ్ అప్పీలు దాఖలుచేయగా నది ౧౮౯౦ వ సం. అక్టోబరు ౧౧ వ తేదీన విచారణకొచ్చి జిల్లాజడ్జిగారి తీర్పును రద్దుచేయుచు న్యాయసమ్మతమైన (**Lawful**) సమయములందెల్ల ఇతర ప్రజలనుగాని దైవారాధనమును గాని మతసంబంధమైన కర్మలుగాని చేసికొనువారి శాంతికి భంగము కలిగింపకుండ న్యాయసమ్మతమైన విధముగా ఊరేగింపులు చేసికొనుటకు హిందువులు అర్హులే యని హైకోర్టువారు తీర్మానించిరి. ఇది యొక విశదమైన తునితగవుగా తీర్మానమైనది. హిందువుల యొక్క అసలు ఆక్షేపణ నిది గ్రహించలేదు. తమ యూరేగింపుమార్గమున కీ క్రొత్తమశీదు అన్యాయముగా నాటంకము కలిగించుచున్నదనియు, పురాతనమైన మశీదుకు చూపవలసిన మర్యాదల నిటువంటి క్రొత్త మశీదు పొందుట కర్హత లేదనియు హిందువుల అసలు వాదము. ఇది తీర్మానింపబడనేలేదు.

౧౮౯౧ వ సం. మార్చి ౧౫-౧౬ తేదులలో మారియమ్మ కోలంపుల యూరేగింపు మశీదు ప్రక్కనుండి పోవునప్పుడు తమకు తగిన బందోబస్తు నివ్వవలసినదని సుందరము సెట్టిగారును, సెవ్వాయిపేటలోని ఇతర హిందూప్రముఖులును (మార్చి ౯ వ తేదీన) అర్జీ దాఖలుచేయగా నది అసిస్టెంటు మేజస్ట్రీటు అయిన ముల్లాలీగారి దగ్గర విచారణకు వచ్చినది. అంతట ఆయన సుందరం సెట్టిగారిని, మారియమ్మగుడి ధర్మకర్తను, ఒక మహమ్మదీయప్రముఖుని విచారించినాడు. ఈ మశీదులో సర్వకాలసర్వావస్థలయందును దైవప్రార్థనము జరుగుచుండునని ఆ మహమ్మదీయుడు సాక్ష్యము చెప్పినాడు. అంతట ముల్లాలీగారు మార్చి ౧౩ వ తేదీన ఉత్తర్వులు జారీచేసిరి. మశీదులో ఎప్పుడు ప్రార్థన జరుగునో చెప్పుటకు వీలు లేదుకనుకను, శాంతికి భంగము కలుగునుగనుకను దానిప్రక్కనుండి పోవునప్పుడు మేళతాళములు వాయించకూడదని తన యుత్తరువులో వ్రాసెను. దానిని పురస్కరించుకొని ౧౩ మంది హిందువులను, ౧౩ మంది మహమ్మదీయులను శాంతికి భంగము కలుగకుండా పూచీకత్తుల నివ్వవలసినదని కోరెను. అంతట హిందువులు తమ యూరేగింపును మానుకొనిరి. ఈ మేజస్ట్రీటుగారి ఉత్తర్వుపైన ఒక హిందువుడు హైకోర్టులో క్రిమినలురివిజన్ పిటిషను దాఖలుచేసెను. అది విచారణకు వచ్చునప్పటికే ఊరేగింపుల కాలము గడచిపోయినందున హైకోర్టువారు ఆ పిటిషనును పరిహరించిరి. అయితే లోగడ మశీదు దావాలో హైకోర్టువారు చేసిన తీర్మానముప్రకారము మహమ్మదీయులకు ఒక నిర్దిష్టమైన ప్రార్థనకాలము లేని యెడల అట్టికాలములను వారు నిర్ణయించుకొనవలెననియు, వా రట్లు నిర్ణయించుకొననంత మాత్రమున

హైకోర్టుతీర్పు నిరర్థకముగాకుండా చూడవలెననియు హైకోర్టువారు ౧౯౨౧-వ సం. జూలై ౧౧-వ తేదీన ఆ తీర్పులో సూచించిరి. అయితే ఈతీర్పు సేలం జిల్లా మేజస్ట్రీటు స్టోక్సుగారికి సెప్టెంబరు ౬-వ తేదీవరకూ చేరలేదు. అంతట ఆయన ౧౯౨౧ నవంబరులో మహమ్మదీయులకు తమ ప్రార్థనసమయములను నిర్ణయించుకొనవలసిన దని కోరిరిగాని వారు సమాధానము చెప్పలేదు. అంతట అతడే యొక ప్రణాళికను తయారుచేసి కొన్ని కాలములలో హిందువులు మశీదుప్రక్కనుండి మేళతాళములతో పోవచ్చునని నిర్ణయించినాడు.

౧౯౨౧-వ సం. డిశెంబరులో సేలముగ్రామములో జరిగిన భద్రకాళికొలుపు మొదటిదినము ఊరేగింపుటుత్సవము, స్టోక్సుగారు దగ్గరనుండగానే, మశీదు ప్రక్కనుండి మేళతాళములతో ఎట్టి యాటంకమును లేకుండా పోయినది. మూడవ దినమున సుందరముసెట్టి గారు హైరోడ్డు వదలి మశీదుతూర్పుప్రక్కనున్న ఒక తూము (Culvert) దగ్గరనుండి అడ్డముగా పోవుటకు ప్రయత్నించగా పోలీసువారు ఆటంకపరచినారు. అంతట నాలుగవ దినమునాటి యూరేగింపు ఆగిపోయినది. కాని అయిదవదినమునాటి యూరేగింపు సక్రమముగనే జరిగినది. ఇట్లు హిందువులు మశీదుప్రక్కనుండి ఊరేగింపుచేయు హక్కును చాలా వ్యయప్రయాసలకులోనై కోర్టుద్వారా పొందగలిగిరి. ఈ తగవులలో మహమ్మదీయులు ఓడిపోయిరి.

హిందువులకు కలిగిన విజయమువలన వారు చాలా ఉత్సాహమును జెంది తమ యూరేగింపుల నింకను వైభవముగా జరుపుకొనదలచి మశీదుప్రక్క రోడ్డుదగ్గరనున్న తూమును పెద్దదిగా చేసి రోడ్డును విశాలముచేయుటకు ప్రయత్నించిరి. వారి యదృష్టవశమున అప్పుడు సేలము మునిసిపలుకమిషనర్లుగా ఎన్నుకొనబడినవారు హిందూసంఘముయొక్క క్షేమలాభములను, అభిప్రాయములను మన్నించుటకు కృతనిశ్చయులైనవారైయుండిరి.

ఇట్టి స్థితిలో ౧౯౨౨ వ సంవత్సరము జూను నెల ౧ వ తేదీన చెన్నపట్టణప్రభుత్వమువారి క్రొత్త జి. ఓ. ఉత్తరు వొకటి వచ్చినది. బహుశా ఫిక్లిన్ దొర గారి తరువాతి చర్యల కీయుత్తరువే కారణమైయుండును. సేలముపట్టణమున శాంతిభద్రతలను స్థాపించుటకొఱకు అదనపుపోలీసులను సమకూర్చిన స్టోక్సుగారి చర్యలను ప్రభుత్వమువారు ఖండించిరి. సామాన్యప్రజల అల్లరులను (Civil Tumult) అణచుటకు తమ పోలీసు సిబ్బంది చాలనే చాలదనియు, అల్లరులు కలుగునని తోచినప్పుడు సివిలుహక్కులను చలాయించుటనే నిషేధించు విషయములో సాధ్యమైనంత వివేచనను, జాగ్రత్తను ఉపయోగించవలసినదనియు ప్రభుత్వమువారు హెచ్చరించిరి.

న్యాయమును పరిపాలించు విషయములో హైకోర్టువా రిచ్చిన తీర్పును, దానిని అమలుజరుపుటలో నుపేక్షాభావమును సూచించు ప్రభుత్వమువారి యుత్తరువును ఒకదానికొకటి విరుద్ధముగా నున్నట్లు భారతీయప్రజాసామాన్యములోని సామాన్యశక్తులకు తోచుటలో నాశ్చర్యమేమున్నది?

౧౯౨౨ వ సంవత్సరము, జూలై నెలలో మారియమ్మ ఉత్సవములు జరుగును. ఆ సమయములోనే ఆ సంవత్సరము రంజాన్ పండుగ వచ్చెను. ఆ సందర్భములో మహమ్మదీయులు తమ మశీదులో నిరంతరాయముగా ప్రార్థనలు జరుపుచుందురనియు, హిందువులు గండవతరగతి మేజస్ట్రీటుదగ్గరకు వెళ్లి తమ మారియమ్మయుత్సవములలో మేళతాళములతో మశీదు ప్రక్కనున్న కన్నారువీధిలోనుండి యూరేగింపులు తీసికొనిపోవుట కనుజ్ఞను పొందినారనియు, అట్లు చేసినయెడల శాంతికి భంగము కలుగగలదనియు, మహమ్మదీయులు గ్రామాంతరమున మకాములో నున్న జిల్లా మేజస్ట్రీటుకు జూలై ౨౦-వ తేదీన అర్జీపంపుకొనిరి. అంతట జూలై ౨౧ వ తేదినుండి ఆగస్టు ౩ వ తేదివరకును హిందువులు మశీదుదగ్గర మేళతాళములతో ఊరేగింపులు జరుపరాదని జిల్లామేజస్ట్రీటు హిందువులను విచారించకుండా వారి పరోక్షముననే ఉత్తర్వుచేసినాడు. అంతేగాని అటువంటి పరిస్థితులలో తాను సేలమునకు వచ్చి వేయుట యుక్తమని తలంపలేదు.

ష్టోన్సుగారి హయాములో సేలములోని హిందువుల ఇండ్లలో జరుగుచున్న శుభకార్యముల సందర్భములోకూడా కొన్ని నిర్దిష్టసమయములందు మశీదువద్ద నుండి మేళతాళములతో నూరేగింపులు పోవుట కనుజ్ఞ నిచ్చుచుండిరి. ష్టోన్సుగారి తరువాత వచ్చిన జిల్లా మేజస్ట్రీటుకాలములో నటువంటి యూరేగింపులు రెండు నిషేధించుట తా నెరుగుదు నని ముల్లాలీగారు సాక్ష్యమిచ్చినారు.

౧౮౮౨-వ సం. జూలై ౨౮-వ తేదీన అటువంటి యూరేగింపు ఒకటి అక్కడనుండి పోవుటవలన నక్కడ దొమ్మి జరిగెను.

కొంతమంది చాకలివాండ్రు తమ కులములో నొకడు మరణింపగా వా శవమును మేళతాళములతో నూరేగించుచు అప్పసెట్టివీథినుండి నదిదగ్గరకు తీసికొని పోవుచుండగా నలుజదిమంది మహమ్మదీయులు వారిపైన బడి దౌర్జన్యము చేసిరి. అంతట నదిదగ్గర సెవ్వయిపేటవైపునను, గోగైవైపునను రెండువేలమంది జనము ప్రోగైనట్లు జాన్సనుగారు సాక్ష్యాలు చెప్పినారు. అప్పుడు హిందూమహమ్మదీయుల కొట్లాట జరిగినది. చాలా రక్తపాతమైనది. గాయపడి ఆసుపత్రికి వచ్చిన వారిలో హిందువులును, మహమ్మదీయులును సమానముగానే యున్నారని జిల్లాసివిలుసర్జనుగారి సాక్ష్యములో నున్నది. జూలై ౨౯, ౩౦-వ తేదీలలోకూడా అల్లరి సాగినది. ఆయుధములతో మిలిటరీదళము వచ్చినందువల్ల కొట్లాట ఆగినది. అప్పుడు దౌర్జన్యమును ప్రారంభించినది మహమ్మదీయులేయనియు, హిందువులు తిరుగబడి దానికి ప్రతిక్రియ జరిగించిరనియు ఆగస్టుకొట్లాట కేసులను విచారించిన సెషన్సుజడ్జిగా రభిప్రాయపడిరి. అంతేకాదు; ఈకొట్లాటలో పాల్గొనినవారిపట్ల జరుపబడిన చర్యకూడా చాలా అసంతృప్తికరముగ నున్నదనియు అభిప్రాయము వెలిబుచ్చిరి. దొమ్మిచేసినవారిపైనదాఖలుకాబడిన కేసులను మేజస్ట్రేటుగారు సెషన్సుకోర్టుకు కమిటుచేయక తానే విచారించినాడు. మలబారునుండి వచ్చి దొమ్మిలో నాయకత్వమును వహించిన యొక మాపిళవానికి ఒక సంవత్సరము కారాగారశిక్షయు, జుల్మానాయుమాత్రమే విధించిరి. మేజస్ట్రేటుకోర్టులో శిక్షింపబడిన తక్కిన మహమ్మదీయులు అప్పీలుకోర్టులో తప్పించుకొనిపోవగలిగిరి. దీనివలన సేలములో హిందువులకు న్యాయము దొరక దను భావము కలిగినదనియు, రాజకీయముగా నీ భావము చాలచిక్కులను తెచ్చిపెట్టుటకు కారణమైనదనియు సెషన్సుజడ్జిగా రభిప్రాయపడిరి.

కొట్లాట జరిగిన మరునాడు, అనగా జూలై ౨౯-వ తేదీన జిల్లా మేజస్ట్రేటు ఊరిలో హాజరుగా లేనందువలన "డిప్యూటీ" సహాయ మేజస్ట్రేటుగా రొక నిషేధపుటుత్తరువును జారీచేసిరి. ఇది చాలా విచిత్రముగా నుండెను. సెవ్వయిపేట బజారువీథిగాని, మశీదుదగ్గరగాని హిందువు లెవ్వరును మేళతాళములు వాయించరాదనియు, ఖాజీగారును పేష్‌ఇమాంగారును తప్ప మహమ్మదీయు లెవ్వరునుకూడా సెవ్వయిపేట మశీదులోనికి ప్రార్థనల నిమిత్తము పోరాదనియు సాదరు చేయబడిన ఈ విపరీతపు ఉత్తరువు జిల్లా మేజస్ట్రేటుగారు ఊరినుంచి వచ్చి ఆగస్టు ౧౫-వ తేదీన రద్దుచేయు వరకును అమలులో నుండెను.

సేలములో నింతఘోరములు జరిగినతరువాత కొన్నాళ్లకు జిల్లా మేజస్ట్రేటుగారు గ్రామమునకు తిరిగివచ్చిరి. ఆయన రాగానే మారియమ్మగుడిధర్మకర్తలైన సుందరముసెట్టిగారును, మరియొకరును పైన చెప్పిన యుత్తరువువలన తాము ఆపియుంచిన మారియమ్మ యుత్సవములను జరుపుకొనుటకును, ఊరేగింపు చేసికొనుటకును తగిన పోలీసుబందోబస్తుగాని, మిలిటరీబందోబస్తుగాని సేలములో హాజరుగా నుంచవలసినదని కోరుచు జిల్లా మేజస్ట్రేటుగారివద్ద అర్జీని దాఖలుచేసిరి. ఈ అర్జీలో తమకు సహాయ మవసరమైన సందర్భములు బాగుగనే వివరించిరిగాని ఒక పేరాలో వ్రాసిన మాటలు మాత్రము జిల్లా మేజస్ట్రేటుగారికి ఆగ్రహమును కలిగించెను.

డిప్యూటీమేజస్ట్రేటుగారు జారీచేసిన నిషేధపుటుత్తరువువలన మహమ్మదీయులు తాము బలవంతులమైనందువల్లనే ఈ యుత్తరువు జారీచేయబడినట్లు వారనుకొనునట్లు చేసినదనియు, మహమ్మదీయులు పేచీకోరులైనందువల్ల (Troublesome) బాధింతు రను

నభిప్రాయముతో ప్రభుత్వమువారు వారిపట్ల పక్షపాతబుద్ధితో నీ నిషేధపుటుత్తరువును జారీచేసిరనియు హిందువులనుకొనుటకు కారణమైనదనియు, మఱియు నా యుత్తరువునకు ప్రజలను లోబఱచియుంచుటకు అధికారబలము లుపయోగించి దానిని అమలుజరుప వలసివచ్చినందువలనను, దాని నుల్లంఘించినందువలన కలిగిన శాంతిభంగము నివారణచేయదలచిన శాంతిభంగముకన్న ఎక్కుడుగ నున్నదనియు శాసనమును అమలుపరచి ప్రజల హక్కులను కాపాడుటకు వలసిన బలములను సమకూర్చియుంచనియెడల కొట్లాటలను అణచుట కవసరమైన బలములను సమకూర్చవలసివచ్చు ననుసంగతి అనుభవమువలన విశదమగుచున్నదనియు, ఆ యుత్తరువు అన్యాయముగను, నష్టకరముగను ఉన్నదనియు అర్జీదారులు వ్రాసిన మాటలు జిల్లామేజస్ట్రీటుగారికి కొంత ఆగ్రహముకలిగించెను. ఈ అర్జీవిషయమై జిల్లామేజస్ట్రీటుగారు ౧౯౨౭ సం. ఆగష్టు ౮ వ తేదీన ఇట్లు తీర్మానించినారు:—"ప్రస్తుత పరిస్థితులలో అర్జీదారులు కోరు రక్షణను ఇచ్చుటకు జిల్లామేజస్ట్రీటుకు ఎంతమాత్రమును సావకాశము లేదు. అట్టి సావకాశమున్ననుకూడ అట్టి రక్షణ నొసగుట తన విధి యని జిల్లామేజస్ట్రీటుకు తోచుట లేదు. ప్రస్తుతము నెల్లాయిపేటలో ఊరేగింపులు జరుపుట క్షేమకరము కాదనియు, శాంతిభద్రతలను కాపాడుటకు మేజస్ట్రీటులును, పోలీసువారును తమ యధికారముల నన్నిటిని అవసరమునుబట్టి వినియోగింతురనియు అర్జీదారులకు హెచ్చరించవలసినదైనది." అని తన తీర్పులో వ్రాసినాడు. ఈ యుత్తరువువలన సుందరముసెట్టి మొదలైనవారి కింక కోర్టుద్వారమునగాని, అధికారులద్వారమునగాని తమ హక్కులను కాపాడుకొనుట కవకాశము లేదని రూఢియైనదనియు, అందువలన వీరందరు నాలోచించుకొని కుట్రచేసి తమ హక్కులను నిలువబెట్టుకొనుటకు అక్రమచర్యలకు దిగి ౧౯౨౭ వ సం. ఆగష్టు ౧౬ వ తేదీన జరిగిన దుర్మార్గపునేరములను జరిగించినారనియు వీరిపైన మోపబడిన కేసులలో ప్రాసిక్యూషను (ఫిర్యాదుల) తరఫున వాదింపబడినది. ఆ కేసులను విచారించిన సెషన్సుజడ్జిగారికిని ఈ యభిప్రాయమే కలిగినది. ఆగష్టు ౧౬ వ తేదీన జరిగిన ఘోరములకు కేవలము మతావేశమే కారణము కాదు. తమ సివిలుహక్కులను కాపాడుటకు న్యాయపరిపాలనాధికారము అసమర్థమైనదని హిందువులకు తోచినది. అనగా అధికారులు మహమ్మదీయులను చూచి భయపడిపోయినారని హిందువులకు తోచినది. ఈ మహమ్మదీయులు దౌర్జన్యపరులై విజృంభించినందువల్ల ఇకముందు వారి మాటయే చెల్లుబడియగుననియు, మసీదుదగ్గర నిక మేళతాళములు వాయించుట కెంతమాత్రమును వీలుండదనియు, ఎంతో కష్టపడి హైకోర్టువరకును పోయి సంపాదించుకొనివచ్చిన హక్కు లిట్లు అన్యాయముగా తీసివేయబడినవనియు హిందువులలో సామాన్యజను లందరికిని తోచినది. వా రాగ్రహముతో మండిపడిరి.

హిందువులకు న్యాయముగా నున్న హక్కుల ప్రకారము వా రూరేగింపులు చేసికొనుటలో నెట్టియాటంకమును లేకుండా రక్షించి వారి హక్కులను కాపాడుట ప్రభుత్వాధికారుల విధి యనుమాట నిజమే. అయితే అప్పటి పరిస్థితులలో అట్టి హక్కులను చెలాయించినయెడల శాంతిభద్రతలకు భంగము కలుగు ననుఅభిప్రాయముతోనే పైన చెప్పిన నిషేధపుటుత్తరువులు జారీచేయబడినవి. అట్టి పరిస్థితులలో నట్టి యుత్తరువు జారీచేయుట పట్టణములో నక్రమములు, అల్లరియు చెలరేగుననియు, వానిని అణచి న్యాయరక్షణముచేయుటకు తా మసమర్థుల మనియు అంగీకరించుటయేకదా! అట్టి యుత్తరువులు పలుమరు జారీచేయబడినప్పు డవి ప్రజాశాంతిని కాపాడుట కవసరములే యని న్యాయమైన హక్కులకు భంగము కలిగి బాధపడువారు సరిపెట్టుకొని యూరకుండగలరా? న్యాయమైన హక్కులను తృణీకరించుటకు దౌర్జన్యమునకు దిగిన బలవంతుల పక్షమువారిని అధికారు లేమియు చేయలేక న్యాయపక్షమువారిపై నిట్టినిషేధాజ్ఞలను ప్రయోగించి బాధించుచున్నారనియు, అక్రమపక్షమువారివలెనే తాముకూడా పశుబలమును జూపి దౌర్జన్యములకు దిగినచో తమ హక్కులు మన్నింపబడి స్థిరపడగలవనియు ప్రజాసామాన్యమునకు తోచుటలో నాశ్చర్య మేమున్నది? ఇట్టి భావములు ప్రజలలో వ్యాపించినప్పుడు సివిలుహక్కులను కాపాడుటవలన వచ్చు చిక్కులకన్న సివిలుహక్కులను రద్దుచేయుటవలన వచ్చు చిక్కులే యధిక

ముగా నుండును. సుందరము సెట్టి మొదలైనవారు నేలముజిల్లా మేజస్ట్రీటుదగ్గర దాఖలుచేసిన అర్జీలో పైన చెప్పిన భావములు ధ్వనించినవి. అధికారులకు పక్షపాతబుద్ధి నారోపించుటవలన నా అధికారులకు ఆగ్రహము కలిగిన దని హైకోర్టువారు గ్రహించిరి. కాని అర్జీదారులట్టి యారోపణము చేయుట తగదని నిరసించిరి.

పైన చెప్పబడిన సందర్భములలో జాలైకొట్లాట అప్పటి పరిస్థితుల కొక ప్రత్యక్షనిదర్శనముగా కనబడుటయేగాక ఎవ్వరో కొందరు బుద్ధిపూర్వకముగా శాంతి భంగమును కలిగించుటవల్లనే ఆ కొట్లాట జరిగియుండును నని మేజస్ట్రీటుమనస్సులోపల నున్న అనుమానము సుందరము సెట్టివగైరాల అర్జీలోని మాటలలోని ధ్వని వలన బలపడినట్లుకూడా మేజస్ట్రీటు తన తీర్పులో వ్రాసిన మాటలనుబట్టి కనబడినది. ఆ యుత్తరువులోని ధ్వనికూడా అసమంజసముగానే యున్న దని హైకోర్టు వారికి తోచినది. "అర్జీదారుల మనవిని త్రోసిపుచ్చుటకు మేజస్ట్రీటుకు హక్కు కలదుగాని ప్రజాశాంతిని కాపాడుటకొరకు అర్జీదారులకు అసౌకర్యము కలిగించవలసివచ్చినందువలన వారు దానిని భరించుట విషయములో మనస్సులను సరిపెట్టుకొనులాగున మేజస్ట్రీటు కొంత సానుభూతితో ప్రవర్తించియుండవలసినది. అప్పటి పరిస్థితులలో వారి హక్కులను నిరోధించవలసివచ్చిన దనియు, మునుముందు పరిస్థితులు చక్కబడిన పిదప వారి హక్కులను కాపాడెదమనియు మంచి మాటలనైన చెప్పక తన ఉత్తరువుతబట్టి ఎన్నటికిని కూడ వారి హక్కులను కాపాడవలసిన బాధ్యత తనకు లేనేలేదని వారికి నింతకలుగునట్లు వ్రాసినాడు" అని హైకోర్టువారు తమ తీర్పులో వ్రాసిరి.

## మశీదులవద్ద మేళతాళములు

మశీదులదగ్గరనుండి హిందువుల యూరేగింపులు పోవుటకు గల హక్కులవిషయమై మశీదులయెదుటనుండి హిందువులు మేళతాళములతో పోవరాదను ఆచారము బహుశా హిందూదేశము మహమ్మదీయరాజ్యాధిపత్యము క్రింద నుండినకాలమునాటి దై యుండునని సెషన్సుజడ్జి యభిప్రాయపడినాడు. అట్టి మర్యాద పురాతనమైన మశీదులకేగాని క్రొత్తమశీదులకు చెల్లుబడి కాదనియు కూడా వ్రాసినాడు. మఱియు పూర్వము మశీదు కేసులలో హైకోర్టువా రిచ్చిన తీర్పు ఈపురాతనాచారమును ఖాయపరచుటయే యగునుగాని క్రొత్తహక్కులను ప్రసాదించుట కాజాల దనియు తీర్మానించినాడు. హైకోర్టువా రీవిషయమై ఇట్లు వ్రాసిరి: అట్టి యాచార మున్నట్లే కోర్టులో వాదింపబడి యుండలేదు. అట్టి ఆచారము నే హైకోర్టువారు నింతవరకు అంగీకరించియు నుండలేదు. ఈ రాజధానిచరిత్రను బట్టి చూచినచో నేకాలమునందును కూడా ఈ ప్రాంతములన్నియు పూర్తిగా మహమ్మదీయుల పరిపాలనకు లోబడియుండలేదని తెలియగలదు. అందువలన అట్టి యాచారము సర్వసర్వత్రా ఉండుట కవకాశము లేదు. మహమ్మదీయరాజ్యాధిపత్యము స్థిరముగా నెలకొల్పబడిన జిల్లాలలో మతావేశపరులైన పరిపాలకవర్గమువారు తమ మతముపట్ల పాలితులైన దేశీయులు గౌరవమును చూపునట్లు శాసించియుందురు. ఆ రాజ్యాధిపత్యము పోయినతరువాతకూడా ఆ మతాభిమానులు తమ యభిమతమే అమలుజరుగునట్లు చేసియుందురు. మశీదుల విషయములో ఆ స్థలముయొక్క పవిత్రతను పురస్కరించుకొని అట్టి మర్యాదను వారు కోరియుందురను సెషన్సుజడ్జియూహకూడా సరియైనదే యైయుండవచ్చును. అట్టి ఆచారము రుజువుచేయబడిన యెడల న్యాయస్థానమువారు దాని నెంతవరకు పాటించెదరో నేను చెప్పజాలను. కాని ఇట్టి హక్కులవిషయములోను, మతధర్మములనుబట్టియు, కులాచారములను బట్టియు కోరు మర్యాదల విషయములోను పూర్వకాలమున రాజ్యముచేసిన ప్రభువుల రాజాదరణమునకు పాత్రములైన మతధర్మము దేశముయొక్క (పబ్లికు, ప్రైవేటు) ధర్మశాస్త్రమునందు మార్పులు కలిగించిన రోజులకు చెందినది. ఇప్పుడట్టి యవకాశములు లేవు. ఈ ఇంగ్లీషుప్రభుత్వము ప్రజల మతవిషయములందు జోక్యము కలిగించుకొనదుగాని ప్రజలందరును సర్వసమానమైన పౌరసత్వహక్కులు గలవారే యనుసూత్రముపైననే పరిపాలన జరుపును. రాజబాటలను స్వేచ్ఛగా నుపయోగించుకొనకుండ ఒక కులమువా

రింకొక కులమువారి కట్టి యాటంకమును కలిగించుట కీ ప్రభుత్వ మంగీకరింపదు. మలబారులోని అస్పృశ్యులుకూడా ప్రభుత్వమునకు బాహ్యులుగా నెంచబడరు. లోగడ నున్న కొన్ని యాచారములు ఇప్పటి కాలమునుబట్టి అనుచితములుగా నున్నవి. అరాజకమునకు, నిరంకుశత్వమునకును బదులుగా క్రమపద్ధతి గల ప్రజాస్వాతంత్ర్య మేర్పడినప్పుడు మార్పులు కలుగక తప్పదు. అయితే ఆ మార్పులు దేశములోని బుద్ధిమంతులు హర్షించునట్టివిగా నుండవలెను. ఊరేగింపుల విషయములో నవి మతమునకు సంబంధించిన వైనప్పుడు ఒక మతావలంబులైనవారిని తమ దేవాలయముల ప్రక్కనుండి అట్టి యూరేగింపులను స్వేచ్ఛగా పోనివ్వమని కోరుటకన్న తమ ఆరాధనలను ఒక్కొకప్పుడు నిలుపవలసినదని కోరుట ఎక్కువ కష్టమును కలిగింపదు కాని ఏ పక్షమువారి మతాభిమతములును న్యాయశాస్త్రమును మార్చుటకు వీలులేదు. ఒక మతస్థుడు తాను సత్యమని నమ్మిన మతమునకు సంబంధించిన మతమువారి యారాధనస్థలమును పవిత్రవంతమైనదిగా నంగీకరింపమని నిర్బంధింపబడుట కిష్టపడకపోవచ్చును గాని ఇతరమతములవారు ప్రార్థనచేసికొనుటకు సమావేశమైనప్పుడు వారి శాంతికి భంగము కలిగింపకుండ నుండుటకు వారికి గల సివిలుహక్కులను మన్నించుట కభ్యంతరము చెప్ప వీలులేదు.

ఆచారమునుబట్టియే అట్టి హక్కులు స్థిరపరుపవలసివచ్చునెడల ఆ యాచారము న్యాయమైనదిగను, నిర్దిష్టమైనదిగను ఉండవలెను.

౧౮౨౦ లో చెన్నపట్టణమునకు గవర్నరుగా నుండిన సర్ తామస్ మన్రోగారు జూలై ౧౨ వ తేదీన వ్రాసిన మినిట్సులో మేజస్ట్రీటులు సాధ్యమైనంతవరకు క్రొత్త యాచారములను సమర్థింప బ్రయత్నింపక పూర్వాచారమునే సమర్థింపవలె నని వ్రాసియుండెను. అది పల్లకులలో వీథులయం దూరేగుటనుగూర్చి వ్రాసిన మాట. ఆ హక్కులనుగురించి ౧౯౪౭ లోను, ౧౯౫౧ లోను న్యాయస్థానములు తీర్మానించియేయున్నవి.

మతసంబంధమైన ఆరాధనముకొరకుగాని, ప్రార్థనకొరకుగాని సమావేశమైనవారికి ప్రత్యేకరక్షణము నొసగు న్యాయవిధి వ్యక్తులు ప్రైవేటుగా చేసికొను ఆరాధనలకు, ప్రార్థనలకు వర్తించునది గాక ఒక జనసమూహము సమష్టిగ చేసికొను (Congragational) దానికి వర్తించునదై యున్నది. అట్టితరి ఇతరుల హక్కులకు ఇబ్బంది కలుగకుండ నుండుటకుగాను తామెప్పుడెప్పుడట్టి ఆరాధనలను, ప్రార్థనలను జరుపుకొనునదియు నిర్దిష్టముగా ఆ జనసంఘమువారు చెప్పవలసియుందురు.

తాము ప్రార్థనలు, ఆరాధనలు చేయు స్థలము పవిత్రమైన దను కారణమునగాని, అచ్చట రాత్రింబవళ్లు ఆరాధనలు, ప్రార్థనలు జరుగుచుండు నను నెపమునగాని ఇతరజనసంఘములు రాజబాటలపైన యథేచ్ఛగా పోవు హక్కులకు భంగము కలిగింపరాదు అని హైకోర్టువారు తీర్మానించిరి. రాజబాటల నుపయోగించు ఒక శాఖవారి నింకొకశాఖవా రాటంకపరచుటకు ప్రయత్నించినందువలన శాంతిభద్రతలకు భంగము కలుగునని తోచినప్పుడు మేజస్ట్రీటులు అవలంబింపవలసిన పద్ధతులనుగురించికూడా హైకోర్టువారు చర్చించిరి.

హైకోర్టువారు లోగడ ఇచ్చిన తీర్పులో నెట్టి మార్పును చేయవలసిన అవసరము లేదనియు, ఈవిషయమై సెషన్సుజడ్జి చేసిన సూచనలు అప్రస్తుతములనియు తీర్మానించిరి. హైకోర్టువా రీవ్యవహారమునెల్ల చర్చించి ఈదకు అగస్టు ౧౬ వ తేదీన జరిగిన కొట్లాట సందర్భములో శిక్షింపబడిన ముద్దాయీల శిక్షలను మాత్రము రద్దుచేయక వానిని ఖాయపరచిరి.

ఈకేసులకు మద్రాసుహైకోర్టులో ముగ్గురు న్యాయమూర్తులు గల ఫుల్ బెంచివారు ౧౯౫౨ వ సం. నవంబరు ౨౧-౨౩, ౨౪-౨౮ తేదీలలోను, డిశంబరు ౧-౨-౫ తేదులలోను, ౧౯౫౩ వ సం. జనేవరి ౯ వ తేదీనను విని పరిష్కరించిరి. ఇది ఇండియన్ లారిపోర్టు ౬ వ సంపుటము ౨౦౩ వ పుట మొదలు ఇరవై పుటలుగా ప్రచురణమైనది.

---

# మద్రాసు ప్రభుత్వపు ఖాదీప్రణాళిక

*

## — శ్రీ సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మ —

ప్రపంచమున ఉపకార మొనరింపగల మహానుభావులు జన్మించుటయే అరుదు. వారి ఉపకారమును సమకాలికులు కృతజ్ఞతతో స్వీకరించుట మరింత అరుదు. స్వార్థరహితులై, త్యాగశీలురై ప్రపంచప్రజానీకమునకు మహత్తరసేవ చేసిన మహానుభావులు స్వార్థపరుల దుర్నీతిచేష్టలకు బలియైపోయిరి. వ్యక్తిసిద్ధాంతములు, ఆదర్శములు ఆ వ్యక్తిజీవితకాలములో అంగీకరింపబడు భాగ్యము బుద్ధభగవానునివంటి ఏ కొద్దిమంది మహాత్ములకో లభించినది. తమకు తోచినట్లు ప్రజానీకమునకు ఆదర్శములను, ధర్మములను, జీవనపద్ధతులను ఏర్పరుచుటకుగాక గౌరవముకొరకై పాటుబడి ఆత్మవంచన చేసికొన్నవారిని చరిత్ర ఏనాడూ స్మరించదు. మహానుభావుల గొప్పతనము వారి ఆదర్శములందేగాక, ఆ యాదర్శములందు వారికి గల విశ్వాసము, ధ్యేయనిష్ఠలయందుకూడ గోచరించును.

నిష్పాక్షికదృష్టితో మద్రాసుప్రభుత్వగ్రామపునర్నిర్మాణ, ఖాదీప్రణాళికలను గమనించినవారు కల్లోలిత ఆర్థికప్రపంచమున కది యొక విసూత్న, అమర శాంతిసందేశ మని అంగీకరింపకపోరు. గ్రామీకవర్గజీవితములో ఇది యొక నూతనయుగారంభమే కాగలదు. తోటిమానవునకు, ధనమునకు, యంత్రమునకు బానిసయైన గ్రామికుడు దేశాభ్యుదయకారి కాడు. స్వతంత్రుడై, ధనమునకు, యంత్రమునకు యజమానియైన గ్రామికుడే భారతదేశ రాజకీయ, ఆర్థికప్రజాస్వామ్యమునకు పునాది కాగలడు. దురదృష్టవశాత్తు, మద్రాసు ప్రభుత్వఖాదీప్రణాళికను విమర్శించువారిలో చాల మంది ఆ ప్రణాళికవలన నష్టపడెడువారే; మరికొందరు క్రొత్త ప్రత్తియంత్రములకు సమ్మతి నీయరని విని అనవసరాందోళన చెందినవారు.

ప్రభుత్వఖాదీప్రణాళికను కొంతవరకు గత నవంబరు భారతిసంచికలో వివరించితిని. విమర్శలనుకూడ కొన్నింటిని కొంతవరకు వివరించితిని. కాని తరువరి వెలువడిన కొన్ని విమర్శలను విచారించి, ప్రణాళికను గూర్చి ఒక నిశ్చితాభిప్రాయమునకు వచ్చిన బాగుండునని తోచుచున్నది. అందువలన అట్టి విమర్శలను ఈ క్రింద విచారించుచుంటిని. ఇందు ఉదాహరింపబడిన అంకెలు నేను ప్రోగుచేసినవిమాత్రము కావు. విమర్శకులు తమ వాదములను సమర్థించుకొనుటకై చూపిన అంకెలనుమాత్రమే నేనుపయోగించుచుంటిని. విమర్శకు లొసగిన అంకెలు వారి వాదములను బలపరచుటకన్న ఎట్లు బలహీనమొనర్చుచున్నవో పరిశీలింతము.

ఖాదీప్రణాళికవలన ప్రత్తిఉత్పత్తిదారులు నష్టపడిపోవుదు రని ఒకరి అభిప్రాయము. ఇందుకు ప్రధాని వివరముగా సమాధాన మొసగియేయున్నాడు. గత పదునైదుసంవత్సరములలోను మన రాష్ట్రములో మరకదుళ్లు రెట్టింపు, మరమగ్గములు ఒకటిన్నరరెట్లు వృద్ధి పొందినవి. కాని అవి ఉపయోగించు ప్రత్తిమొత్తము మాడింతలైనది. ఈ క్రింది అంకెలను గమనింపుడు:

| | (మరకదుళ్లు) | (మర మగ్గములు) | (ఉపయోగింపబడిన ప్రత్తి. బేళ్లు) |
|---|---|---|---|
| ౧౯౩౦ | ౭,౮౬,౨౦౪ | ౫,౧౯౦ | ౨,౧౧,౦౦౦ |
| ౧౯౪౫ | ౧౫,౬౦,౭౦౪ | ౭,౪౯ | ౬,౦౪,౦౦౦ |

మన రాష్ట్రములో సామాన్యముగా ప్రత్తి వేయు పొలము ౨౪,౧౭,౯౧౦ ఎకరములు. సామాన్యముగా పండించబడు ప్రత్తి ౫,౪౨,౩౬౦ బేళ్లు (బేలు = ౪౦౦ పౌనులు). ఇందులో దాదాపు ౨ లక్షల బేళ్లు కంబోడియాప్రత్తి. ఇది మంచిరకముప్రత్తి. ఈ మంచి

రకము ప్రత్తి చాలక ఈజిప్టు, అమెరికాలనుండి యిప్పుడే దిగుమతులు చేసుకొనుచున్నాము. మన రాష్ట్రమునకు ఇప్పుడు ఇచ్చిన 3,౫౨,౦౦౦ మరకదుళ్ళనుకూడ స్థాపించిన మనము యింకా ఎక్కువ ప్రత్తిని దిగుమతి చేసికొనవలెను. అంతేగాని మన దేశములో ఇంకా ఎక్కువ ప్రత్తి పండే అవకాశము లేదు. గత ఇరువ దేండ్లనుండి ప్రభుత్వము, ఇతరులు చేసిన కృషిమూల ముగా ప్రతి ఎకరములోను ఇప్పటికన్న ఎక్కువ ప్రత్తి పండించుటకు గల అవకాశము చాల తక్కువయని నిర్ధారణయైనది. అదిగాక ప్రత్తికి పనికివచ్చు పొల మంతయు అప్పుడే ప్రత్తి పండించుచున్నది. ఇక తుంగ భద్రాప్రాజెక్టు మొదలైనవాని మూలమున కొంతభూమి ప్రత్తినుండి వేరుపంటలకు మార్చబడునేమో! కాబట్టి యిప్పుడు ప్రత్తిపండించు, ఇకముందు పండించబోయే రైతులకు ఖాదీప్రణాళికవలన ఏమి నష్టము? కంబో డియా మొదలైన మేలురకముల ప్రత్తి పండించువారి సంగతి విచారింతము. ఇప్పుడు అట్టిజాతుల పంట ౨ లక్షల బేళ్లు. ఈపంట వృద్ధియగుటకు అవకాశము లేదు. ఈప్రత్తి పండించుటకు పనికివచ్చు ప్రదేశము లన్నియు ఈప్రత్తిని ఇప్పుడే పండించుచున్నవి. ఇప్పుడు short staple (పొట్టిపింజ) ప్రత్తి పండించుచున్న రాయలసీమ మొదలైన ప్రదేశములలో Long staple (పొడుగుపింజ) ప్రత్తి పండించుటకు అవకాశము లేదు. ఇప్పుడున్న (పొడుగుపింజ) long staple ప్రత్తి యిప్పుడున్న మిల్లులకే చాలుటలేదు. అదిగాక, ఖాదీప్రణాళిక అభివృద్ధిచెందినకొలదియు, వ్యక్తులు నూలుతీయుటయందు మంచి ప్రావీణ్యము సంపాదింతురు. వారు ౬౦, ౮౦ నెంబర్ల నూలుకూడ తీయ గల్గుదురు. అట్టివారికి మంచిరకముల ప్రత్తి కావలసి వచ్చును. కాబట్టి మంచిరకముల ప్రత్తికి ఎప్పుడును చాలా అవసరము ఉండియేతీరును. ప్రత్తిపండించు రైతులకు మామూలుధరలు గిట్టునుగాని, నష్టపడు నవ కాశమే లేదు. పొట్టిపింజ ప్రత్తిని యుద్ధకాలములో అమ్ముట చాల కష్టమైపోయినది. ఇకముందు ఇట్టి ప్రత్తి లేలికగా అమ్ముడుపోవును. మంచిరకము ప్రత్తి దుర్వినియోగముచేయబడు ననుకొనవలసిన అవ సరము లేదు.

మిల్లుయజమానులకూ, విమర్శకులకూ చేనేతపని వాండ్రు నష్టపడిపోవుదు రని, పాపము, చాల భయము. ప్రజలను నమ్మించుట, డబ్బు ప్రోగుచేసుకొనుటవలె, సులభమైన కార్యమని బహుశః వీరి తలంపైయుండ వచ్చును. మనరాష్ట్రములో పనిచేయుచున్న చేతిమగ్గముల సంఖ్య ౪,౯౬,౦౦౦; సుమారు ౫ లక్షలు. మన రాష్ట్రములో నెలకు ౪౭,౪౦౦ బేళ్ళ నూలు తయారగును. అందు అల్లికమిల్లులు, మరమగ్గములు మొదలైన వాటి అవసరములు తీరిపోగా ౩౫,౭౦౦ బేళ్ళు చేనేత పనివారికి మిగులును. కాని అఖిలభారతప్రణాళికప్రకారము మనకు ౧౯,౦౦౦ బేళ్ళుమాత్రము ఇచ్చి, మిగిలి నది యితరరాష్ట్రములకు ఎగుమతిచేయబడుచున్నది. ఈ ౧౯,౦౦౦ బేళ్ళనూలు చేనేతపనివారికి నెలకు ౧౦, ౧౨ రోజులుమాత్రమే పనియిచ్చును. నెలంతా వీరికి పని దొరకుటకు ౪౬,౫౦౦ బేళ్ళ నూలు కావలెను. కాబట్టి మనము అఖిలభారతప్రణాళికను అనుసరించి నంతకాలము మన చేనేతపనివారికి కావలసిన నూలు దొరకదు. మనకు క్రొత్త మరకదుల్లు కావలెనన్న అ. భా. ప్రణాళికను అంగీకరింపవలసినదే కదా; మనము "క్రొత్త మరకదుర్లు కావలెను. నూలు మాత్రము ఈయుము" అన్న భారతప్రభుత్వము ఒప్పుకొనునా? అది మిగతారాష్ట్రములకు నష్టముకదా? అ. భా. ప్రణాళికప్రకారము మన రాష్ట్రములో మిల్లులు వృద్ధిపొందునది ఇప్పు డున్నదానిలో ఎనిమిదవ వంతు. కాబట్టి యిప్పుడున్న మిల్లులు, పెట్టబోయే క్రొత్తమిల్లులు అన్నియు కలిసినా చేనేతపనివారికి నెలకు ౧౫ రోజుల పని దొరకదన్నమాట. నూలుదిగుమతుల మాట తలపెట్టుట లేదుకదా. కాబట్టి యీ అఖిల భారతప్రణాళికయే యింకొక పదేండ్లపాటు అనుసరించిన, చేనేతపనివారు ఏమగుదురో దురూహ్యము. వారికి నష్టమేమున్నది? నెలరోజుల కూలి ౧౦, ౧౨ రోజుల పనితోనే గడింతురు. బ్లాక్‌మార్కెట్టులో నూలు కొందురు. అందువలన నేకదా చేనేతగుడ్డఖరీదు దాదాపు ఖద్దరుగుడ్డఖరీదంత యున్నది. కొన్నిరకములకు ఎక్కువ

కూడ ఉన్నది. చేనేతపనివాండ్ర శ్రేయోభిలాషులు మనము అ. భా. ప్రణాళికను అనుసరింపవలెనని కోరరు. అంటే మనకు క్రొత్తమరకదుప్పు అవసరములేదు అని చెప్పగల ధైర్యము మనకు ఉండవలెను. మనము అ. భా. ప్రణాళికనుండి బయటికి వచ్చివేసితి మనుకొనుడు. అప్పుడు మన చేతిమగ్గములకు ౩౫,౮౦౦ బేళ్ళ నూలు (నెలకు) దొరకును. కాని యిది చాలదు. ఇంకను ౧౨,౦౦౦ బేళ్ళు కావలసియుండును. మన కీక మిల్లులు కొరకవుకాబట్టి మనము ఖద్దరుపైననే ఆధారపడియుండవలెను. ఖద్దరునూలు వ్యక్తి రోజున కొక చిట్టెము తీసె ననుకొనుడు. నెల కది సుమారు ౩ పౌనుల నూలగును (పౌనునూలు ౪౪ అంగుళముల పన్నా గల ౩ గజములకుపైగా గుడ్డ అగును) మన రాష్ట్రములో మొత్తము ౧౩,౨౫౦,౦౦౦ కుటుంబము లున్నవని అంచనా వేయబడినది. కుటుంబమున కొకరుచొప్పున వడికిన నెలకు ౩౯,౭౫౦,౦౦౦ పౌన్లు, లేక ౯౯,౩౭౫ బేళ్ళ నూలగును. మన చేనేతపనివారికి చేతినిండ పనియిచ్చుటకు ౧౨,౦౦౦ బేళ్ళుమాత్రము ఇంకను కావలెను. కాబట్టి రాష్ట్రములో ఎనిమిదవవంతు కుటుంబములకు ఈ ప్రణాళికను వెంటనే అమలుజరుపవలెను. ఇప్పుడు పనిచేయుచున్న మిల్లులు పాతవైపోయినప్పుడు ఇంకను ఎక్కువ చోట్ల ఈప్రణాళికను అమలుజరుపవలయును. ఒక్క కలంగీతతో ౮ జిల్లాలలో మద్యనిషేధము జరిగినప్పుడు, మూడుజిల్లాలలో ఖాదీప్రణాళిక ఏల అమలుజరుపకూడదు ? సారాంశము : అ. భా. ప్రణాళికప్రకారము చేనేతవారికి కావలసిన నూలు ఈ దశాబ్దములో దొరకుట అసంభవము. వారు ఏనాటికైనా ఖద్దరునూలువైపుకు తిరుగవలసినవారే.

ఖద్దరుధర చాల హెచ్చు, బీదజనులు కొనలేరని చాలమంది జాలిపడుచున్నారు. అటువంటివారు ఏ గ్రామమునకైనా పోయి గతనాలుగైదేండ్లలో ఎవరెవరు, ఎంతెంత మిల్లుబట్ట కొన్నారో, ఎంత చేనేతగుడ్డ ఎంత ధరకు కొన్నారో విచారించిన బాగుండును. మిల్లుబట్ట, రేషనురాకపూర్వము, బస్తీలోని జనులకు— అందును ధనవంతులకే—గాక, నిజమైన బీదజనులకు దొరకనే లేదని అందరును ఎరుగుదురు. బీదవానికి శాపము వాని బీదతనమే! ఈనాడు బీదవారికొరకు మొసలి కన్నీరు గార్చు పెద్దలకు ఆనాడు మెదల్పుటకు నోరు లేకపోయినది. అసలు మిల్లుబట్టకన్న ఖద్దరుబట్ట ఎంత ఖరీదు, అనువిషయమును పరిశీలింతము. మిల్లుబట్ట ౨౦వ నెంబరు గజము తయారుధర ౦-౫-౬; అమ్మకము ధర ౦-౮-౦; అంటే తయారైన నెలలోగా, కొట్టులోనికి వచ్చిన గంటలోగా—బ్లాక్ మార్కెట్టుకు దాటినదితప్ప—అమ్మకుపోవు గుడ్డకు మధ్యస్థులైన వర్తకులకు గజమునకు ౦-౨-౬ లాభము. ఇది నిర్ణయింపబడిన ధర. ఈధరకు రేషనింగు రాకపూర్వము ఏఐదారుగురో (నూటికి) కొనెడివారు. ప్రభుత్వఖాదీప్రణాళికప్రకారము ఖద్దరుగుడ్డఖరీదు ౧-౭-౧౦. చాల హెచ్చు. కాని మనము ఇచ్చు ధరలో సగము వడకువారి కూలియే. అంటే ఎవరికి కావలసిన నూలు వారే తీసికొన్న గుడ్డఖరీదులో సగం యివ్వనక్కరలేదు. మిగిలిన దానిలో గజమునకు ౦-౪-౦ ప్రభుత్వము బహుమతి యిచ్చును. పోగా ఖద్దరుకు గజమునకు యివ్వవలసిన ధర ౦-౮-౦ మాత్రమే! వడకుట యిష్టములేనివారు, భాగ్యవంతులు ఎక్కువ యివ్వవలసియుండును. కాలక్రమేణా ఒకటిరెండు సంవత్సరములలో వడకుట బాగా చేతనగునప్పటికి, నేతకూలికూడ కొంతవరకు తగ్గును. అప్పుడు ప్రభుత్వము బహుమతి తీసివేయును. అయినను మనము నికరముగా యివ్వవలసిన డబ్బు గజమునకు ౦-౮-౦ కు మించు నవకాశము లేదు. కాని కంట్రోలు తీసివేయుటతో మిల్లుబట్టధర తప్పక పెరుగును. కాబట్టి సామాన్యపరిస్థితులలో మిల్లుబట్టకు మన మిచ్చు ధరకన్న మనము వడకుకొన్న నూలుతో తయారుచేసికొన్న బట్టకు తక్కువయే యివ్వవలసి వచ్చును. మనము అన్యథావృథాపుచ్చుకాలమును వడకుటకు ఉపయోగింతుముకాబట్టి మనకు మొత్తముమీద ఖద్దరుబట్టవలన ఖరీదులో నష్టమేమియు ఉండదు. చేనేతపనివారు చాలనూలు బ్లాక్ మార్కెట్టులో కొనుచున్నారు; నెలకు ౧౦, ౧౨ రోజులకన్న ఎక్కువ పనిలేదు. కాబట్టి చేనేతబట్టధర చాల పెరిగిపోయినది. చాలరకముల చేనేతబట్టకన్న ఖద్దరుబట్టయే చవుకగా బజారులో దొరుకుచున్నది. చేనేతపనివారు ఇప్పుడు

నేయుచున్న నూలు ఎక్కువగా ౨౦, ౪౦ నెంబర్ల నూలు. ఒకసంవత్సరముపాటు రాట్నముపై అనుభవమున్నవారు ఆనంబర్ల నూలును తీయగల్గుదురు. ఖాదీ ప్రణాళిక ప్రకారము మనగుడ్డకు యివ్వవలసిన ధర యీ క్రిందివిధముగా నుండును : ప్రత్తిధర, ఏకులు చేసినచో ఆకూలి, నేతకూలి, చాకలికూలి, ప్రభుత్వపుసొమ్ము. ప్రత్తిధర గజమునకు ౦-౧-౬ కు మించి ఎప్పుడూ వుండదు. మిగిలినఖర్చులు ఇంకొక ౦-౧-౬ వుండును. నేతకూలిమాత్రము చాల పెద్దమొత్తము. సామాన్యపరిస్థితులు నెలకొల్పబడి జీవనవ్యయము తగ్గి, నెలంతా పని దొరకుచున్న ఆ నేతకూలికూడ తగ్గునని మనము ఆశించవచ్చును. ఆ నేతకూలి ఎంత తగ్గిన బట్ట మనకు అంత తక్కువకు గిట్టును. కాగా ఒక్క ప్రశ్న వేయవచ్చును. మనము శ్రమపడ నవసరములేకుండా మిల్లు బట్ట, రోజా శ్రమపడి ఖద్దరుబట్ట ఒకటే ధరకు గిట్టిన మనము అనవసరముగా శ్రమపడనేల! కాని మిల్లుబట్ట మనకు చాలినంత దొరకుటలేదు. అది చాలినంతవరకు హెచ్చుధర యిచ్చి చేనేతబట్ట కొనుచున్నాము. మనకు కావలసినంత మిల్లుబట్ట యిప్పుడు దొరకు చిహ్నము లేవియు లేవు. కాబట్టి మనము చేనేతబట్టపై ఆధారపడియుండవలెను. దానికన్న, మనము మనపైననే ఆధారపడియుండుట మంచిదికదా ? అదియుగాక, ఖద్దరుబట్ట చాలరకముల మిల్లుబట్టకన్న చాల ఎక్కువ మన్నికగలది. ముఖ్యముగా ధోవతులు, చీరెలు మొదలైనరకములు. గ్రామస్థులు మిల్లుబట్టను ఏనాడూ ఆదరించలేరు. మిగిలిన చొక్కాగుడ్డలు మొదలైన రకములలోగూడ మిల్లుబట్టకన్న ఖద్దరుబట్ట చాల నయము. ఇవియన్నియు లెక్కవేసి చూచిన, మిల్లుబట్టకన్న మనము వడికి నేయించుకొను ఖద్దరుబట్ట చాల చవుక అనవలయును.

ఈమధ్య సర్ గోపాలస్వామయ్యంగారు స్టేటు కౌన్సిలులో ఒక పెద్ద తీర్మానమును ప్యాసుచేయించినారు. వారి యుద్దేశ్యముప్రకారము "చేనేతపరిశ్రమను ప్రోత్సహించుటకు, సంఘటితపరుచుటకు, వృద్ధిపరుచుటకు; దేశములో గుడ్డకు, నూలుకు దినదినాభివృద్ధి చెందుచున్న అవసరమునుతీర్చుటకు; మిల్లుబట్టలలో ప్రోత్సాహకరమైన ఎగుమతివ్యాపారమును నిర్మించుటకు; అన్నిటికి మించి, పల్లెలలోని, పట్టణములలోని సామాన్యమానవుల జీవనప్రమాణమును వృద్ధిచేయుటకు" క్రొత్తబట్టల మిల్లులు కావలెను. ఇది మేడిపండువాదమునకు మెచ్చైన మతలబు.

చేనేతపరిశ్రమవారినిగురించి వారి వాదమును ఇంతకు ముందే గమనించితిమి. సర్ విక్టర్ ససూన్ గారు, చేనేతమగ్గములకు విద్యుచ్ఛక్తినికూడ సరఫరా చేసినచో అవి మరమగ్గములతో పోటీచేయగలవని చెప్పుచున్నారు. అది మిల్లుయజమానులకు సంతోషకరమా ? వారు నెమ్మదినెమ్మదిగా చేనేతమగ్గములను నాశనము చేయుటకు ప్రయత్నించకపోయినచో వారి మిల్లులగతి ఏమగును ? మన రాష్ట్రములో క్రొత్త మరమగ్గములు కూడ పెట్టుచున్నారే. అవియు చేనేతపనివారి అభివృద్ధికేనా ? ఎప్పుడైన, చేనేతపనివారిని రక్షించుటకు ప్రభుత్వము ఏమైన తలపెట్టిన, మిల్లుయజమానులు ఇంత గందరగోళము మరల చేయరా? మిల్లుయజమానులు తమ మేలును కోరుచున్నారని చేనేతపనివారు తలచిన వారి వినాశమునకు వారే త్రోవతీసికొన్నవా రగుదురు. మిల్లులవలన మనము ఎంతవరకు బట్టలవిషయములో స్వయంపోషకము కాగలము ? మన దేశమునకు సంవత్సరమునకు ౭,౨౦౦ మిలియన్ల గజముల గుడ్డ కావలెను. కాని యిప్పుడు ౪,౮౦౦ మి. గజముల గుడ్డయే తయారగుచున్నది. పోగా మిగిలిన ౨,౪౦౦ మి. గజములు ఎప్పుడూ కొరతయే నన్నమాట. అందుకుగాను అ. భా. ప్రణాళిక ౧౭౦౦ మిలియనుల గజముల గుడ్డఉత్పత్తిని తలపెట్టినది. ఈ కేంద్రప్రభుత్వప్రణాళిక ౧౯౪౮ నుండి ౧౯౫౨ వరకు నెమ్మదిగా కార్యరూపము దాల్చును. అంటే ౧౯౫౨ లో మనకు మొత్తము ౭౦౦ మి. గజముల గుడ్డ యింకనూ కొరతగనే యుండును. అదియును బొంబాయిరాష్ట్రములో తలకు సంవత్సరమునకు ౨౪ గజముల చొప్పున యిస్తురట ; మద్రాసురాష్ట్రములో తలకు సంవత్సరమునకు ౧౬ గజముల చొప్పుననేనట! కాబట్టి ఎప్పుడో అ. భా. ప్రణాళికను తీసివేసి, విదేశములనుండి మిల్లులు

తేలికగా దిగుమతిచేసికొన వీలైనప్పుడుగాని, లేక మన దేశములో బట్టలమిల్లులు తయారుచేయు యంత్రాగారములను స్థాపించి, కావలసినన్ని మిల్లులు తయారుచేసినప్పుడుగాని మనకు కావలసినన్ని బట్టలు దొరకును. ఇందుకు నిశ్చలదృష్టితో పనిచేసిన ఒక దశాబ్దము పట్టవచ్చును. అప్పటివరకు మనగతి వీరు చెప్పు తీయటి మాటలు వినుచుండుటయే! దేశములోని స్థితి యిట్లున్నప్పుడు ఎగుమతుల సంగతి చెప్పనవసరము లేదు. దేశస్థులకు చాలినంత గుడ్డ లేనప్పుడు, విదేశములకు గుడ్డ ఎగుమతిచేయుటవలన నష్టపడున దెవ్వరు? ౧౯౩౬ సంవత్సరములో మనదేశమునుండి మొత్తము బట్టల ఎగుమతులు ౫౭ లక్షలరూపాయలు; ౧౯౪౫ సం.లో అది పది కోట్ల రూపాయీలకు పెరిగినది. ఇది నిజముగా సంతోషకరమా? దేశములో ప్రజలు బట్టలకొరకు అల్లాడుచుండ ఎగుమతిచేసిన ప్రభుత్వము, దానికి మద్దత్తిచ్చిన ధనికవర్గమూ, అట్లు చేసితిమని చెప్పుటకు సిగ్గయిన పడవలెనే!ఏ అమెరికా, ఇంగ్లాండు దేశములలోనో ప్రజావసరముల నిట్లు తృణీకరించి, నిర్లక్ష్యముచేసిన ఆప్రభుత్వ మపాటు ఏమైయుండెడివో! ప్రపంచమున సుస్థిరశాంతి నెలకొల్పుటకు మార్గములు పెద్దలు అన్వేషించుచున్నారు. ఒక దేశమును వేరొక దేశము కొల్లగొట్టుట, (ఆర్థికముగా) పీడించుట సుస్థిరశాంతికి సోపానములా? మన దేశమునకు మన మింత కష్టపడి స్వరాజ్యమును సంపాదించుకొన్నది ప్రపంచమున వెనుకబడియున్న జాతులను ఆర్థికముగా మన చేతిక్రింద నుంచుకొనుటకా? వారిని మనతో సమానుల జేయుటకా? ఇట్లున్న విదేశవ్యాపారము కూడదని మాత్రము కాదు. దాని కొక హద్దుండవలెను. మన దేశములో వస్తువులు నిజముగా ఎక్కువ యుండి, ఆదేశములో కొంతయేయుండి, వ్యాపారములో ఏ దేశమునకు ఎక్కువనష్టము లేకున్న యెడల వర్తకము చేయవచ్చును. కాని దేశప్రజలకు సున్నచుట్టి, అధికలాభములకు విదేశములలో అమ్ముట ధనికవర్గవిధానము. మనదేశము ఆ పంథాను ఏ నాడూ అనుసరించదు. అయ్యంగారు చెప్పిన రెండు, మూడు ఉద్దేశ్యములు కేవల పరస్పరవిరుద్ధములు; అవి జరుగునని వారునూ నమ్మియుండరు.

అన్నిటినీమించిన దున్నది. సర్వప్రజానీకముయొక్కయు జీవనప్రమాణమును అభివృద్ధిచేయుట. క్రొత్త మిల్లుల స్థాపనవలననే యిట్టిది జరిగినట్లు ఏదేశ ఆర్థిక చరిత్రలోనూ సూచనలు దొరకకపోవచ్చును. మిల్లులలో పనిచేయుచు తక్కువజీతములు, అనారోగ్యకరమైన యిండ్లు, పొట్టనిండని తిండి మొదలగు బాధలు పడలేక కూలీలు యూనియనులు స్థాపించి, సమ్మెల ద్వారా తమ కోర్కెలను కొంతవరకు నెరవేర్చుకొనుటచే, వారి జీవనప్రమాణము వృద్ధిపొందుచున్నది. అది గాక, వారి జీతములు చాలవని తోచి ప్రభుత్వము సాంఘికాధారములను (social security) కల్పించుచున్నది. ఆరోగ్యభీమా, నిరుద్యోగభీమా మొదలయిన ఆధారములను ప్రభుత్వము శాసనములద్వారా కల్పించవలసిన అవసరములు కల్గినప్పుడు, ఆ శ్రామికవర్గము మిల్లులున్నచే బాగుపడుదురని చెప్పుట. ఏమి సమంజసము? ఈ విధముగా ధనికవర్గము, వారిచే నడుపబడు పెద్ద పెద్ద యంత్రాగారములు మన దేశములో సాగుచునేయున్న అవి ఆర్థిక, సాంఘిక విప్లవములకు దారితీయగలదు. ప్రపంచమునం దన్ని దేశములలోను పరిశ్రమలను ప్రభుత్వము తమపరము చేసికొనుట లేదా? చివరికి బ్రిటనులోకూడ. అది యంతయు ఎందుకు? గత పదిఏండ్లుగా మన రాష్ట్రములోని మిల్లులు భాగస్వాములకు, శ్రామికులకు ఎంతెంత డబ్బు పంచిపెట్టినది లెక్క చెప్పమనుడు; ఎవ రెక్కువ లాభముపొందుచున్నది తెలియగలదు. కొందరు మిల్లుయజమానులు తమ కూలీల సౌకర్యముకొరకు తక్కువరేటుకు ధాన్యము మొదలైనవి అమ్మి నష్టమును తామే భరించుచున్నారు. మంచిదే, అది కూలీల అభ్యుదయమును, ఐశ్వర్యమును సూచించునా?

ఈ ప్రణాళికవలన రాయలసీమ చాల నష్టపడునని ఒకరికి విచారము. మన రాష్ట్రములో ప్రత్తిపండించు పొలము మొత్తము ౨,౪౧౩,౯౧౦ ఎకరములు. అందులో ౧,౦౭౪,౫౩౭ ఎకరములు రాయలసీమలోనే. మన రాష్ట్రములో మొత్తము ప్రత్తిపంట సామాన్యముగా ౫,౪౨,౩౧౦ బేళ్లు; అందు ౧,౦౯,౯౧౦ బేళ్ళు రాయలసీమలోనే. అందే దాదాపు సగంపాలము,

నాలుగవవంతు పంట అన్నమాట. కాబట్టి రాయల సీమ ఎంత వెనుకబడియున్నదో తెలియగలదు. రాయల సీమలో ఎక్కువ పొట్టిగింజ ప్రత్తి పండును. అది ముదుకనూలుకు, రాట్నములకు బాగుగా పనికి వచ్చును. రాయలసీమలో ౮౦,౨౧౧ చేతిమగ్గములు కలవు. రాయలసీమలో బీదవారికి కొదవ లేవల్లే ధన వంతులకును కొదవలేదు. ఇంతవరకు అసలు ఒక్క మిల్లయినా ఎందుకు స్థాపింపబడలేదు? అ. భా. ప్రణాళిక ప్రకారం మొత్తం ౬౨,౦౦౦ మరకదుళ్లతో, ౫ మిల్లుల స్థాపనకు అనుమతివచ్చినది. దానితో రాయల సీమలోని ప్రత్తి యంతయు నూలు అగునా? ఎట్లును కొంత భాగము ఎగుమతిచేయవలయును. పోనీ, ౫ మిల్లుల నూలు ౮౦,౨౧౧ మగ్గములకు సరిపోవునా? మిల్లులు తీసిన నూలును అ. భా. ప్రణాళిక ప్రకారం ప్రభుత్వము ఎక్కడికి పంపమన్న అక్కడికి పంపితీరవలెను. యుద్ధకాలములో రాయలసీమ ప్రత్తి అమ్మట చాల కష్టమైపోయినది. రాట్నములు వృద్ధిఅయినచో అట్టి బాధ యుండదు. తుంగభద్రా ప్రాజెక్టువలన చాల విద్యుచ్ఛక్తి జనించును. అది యంతయు క్రొత్తగా స్థాపింపబడు ౫ మిల్లులు ఉపయోగింపలేవు. అదిగాక ఆ విద్యుచ్ఛక్తిని గ్రామగ్రామములకు అందింతుమని ప్రభుత్వము చెప్పుచున్నది. దానితో కుటీరపరిశ్రమలు వృద్ధి చేయబడునని కూడ చెప్పినది. కాబట్టి తుంగభద్రా ప్రాజెక్టు విద్యుచ్ఛక్తి నిరుపయోగమగునని అనుకొనవలసిన అగత్యము లేనేలేదు. ౫ మిల్లుల స్థాపనతో రాయల సీమ ప్రజానీకము ఎట్లు సర్వసంపదలను గడించుకొనగలదో తెలియదు. ఇప్పటివరకు "కష్టములపాలై యున్న బీదజనులు" మిల్లుల స్థాపనకు ఎట్లు ధనము సమకూర్చిరో తెలియదు. రాయలసీమప్రజల మేలు గోరువారు బహుశః గృహపరిశ్రమలను అభివృద్ధిచేయవలెనని, వానికి విద్యుచ్ఛక్తి విధిగా అందింపవలెనని కోరుదురుగాని ధనవంతులకు లాభముచేకూర్చు ౫ మిల్లుల స్థాపనను ఎట్లు బలపరుపగలరు?

**Location factor** ఆయా ప్రదేశములలో ఆయాపరిశ్రమలు ఆప్రదేశముయొక్క జనాభాకు తగినంతగా వృద్ధిపొందినవా లేదా సూచించును. వస్త్రపరిశ్రమ **location factor** మనరాష్ట్రమునకు ౦.౯ వున్నది; **location factor** ౧.౦ వుంటే ఆపరిశ్రమ మొత్తము దేశజనాభానుబట్టి మనరాష్ట్రములో జనాభాకు తగినంత ఉన్నదని యర్థము. కాని యిందు ౫ లక్షల చేతి మగ్గములను లెక్క వేయలేదు. కాబట్టి మన రాష్ట్రములో వస్త్రపరిశ్రమ మన జనాభానుబట్టి యుండవలసినంత ఉన్నదనియే అర్థము.

మన దేశములో సంవత్సరమునకు తలకు ౧౬ గజముల గుడ్డ ఖర్చుఅగుచున్నది. కొన్నిదేశములలో ౭౪ గజములుకూడ ఖర్చుఅగుచున్నది. సంవత్సరమునకు వ్యక్తికి ౩౦ గజముల బట్ట సరఫరాచేయవలెనని పెద్దల అభిప్రాయము. ఇప్పుడు మన రాష్ట్రములో బట్ట వ్యక్తికి సంవత్సరమునకు ౧౨ గజములకు మించి దొరకుట లేదు. కాని అ. భా. ప్రణాళికప్రకారము బొంబాయిరాష్ట్రమునకు ౨౪ గ., మనరాష్ట్రమునకు ౧౬ గ. సంవత్సరమునకు, వ్యక్తికి వచ్చునట్లు ఏర్పరిచిన చాలును. ఖాదీప్రణాళికప్రకారము తలకు సంవత్సరమునకు ౨౦ గజములు వచ్చును. కాని మిల్లుబట్టకన్న ఖద్దరుబట్ట మన్నిక ఎక్కువగాబట్టి యీ ౨౦ గజములు ౨౫-౩౦ గజముల మిల్లుబట్టకు సరిపోవును.

ఖాదీప్రణాళిక ఏవ్యక్తికీ పూర్తికాలము పని యిచ్చుటకు ఉద్దేశింపబడలేదు. ప్రతివ్యక్తియూ విశ్రాంతి కాలములో కొంతభాగమును వడకుటకు వినియోగించవచ్చును. ౧౦ సంవత్సరములు దాటిన బిడ్డలు, స్త్రీలు ముఖ్యముగా ఈప్రణాళికను అమలుజరిపెదరు. నలుగురు వ్యక్తులు గల కుటుంబములో, ఒకరైనా లేక అందరైనా కలిసి రోజునకు ౨౨ గంటల చొప్పున వడికిన సంవత్సరమునకు వారికి ౮౦ గజముల గుడ్డ తయారగును. కాలక్రమేణా రోజూ వడకవలసిన కాలము ౨౨ నుండి ౨ గంటలవరకు తగ్గవచ్చును; నూలు మంచిదికూడ వచ్చును. మన రాష్ట్రములోని ప్రజలలో ఎక్కువ కుటుంబములకు రోజుకు ౨౨ గంటలు విశ్రాంతికాలము లేకున్నదా? ఉన్నచో, వారిని తమకొరకై ఆకాలమును వినియోగింపుడని కోరుట నిర్బంధమా? వృథాపుచ్చుకాలమును సదుపయోగ మొనరించుకొను డని

# కొద్ది మొత్తములను దాచుకోగలవారికి కలుగు ఒక సమస్యను పరిష్కరించుట—

AC 9176



సమస్య:— ఆరు అగ్గిపుల్లలతో నాలుగు ముక్కోణములను ఏర్పరచుడు.

జవాబు:— బల్లమీద 3 అగ్గిపుల్లలను ఒక ముక్కోణముగా అమర్చుడు. మిగిలిన మూడింటితో పటమునందు తెలిపినట్లు ఒక పిరమిడ్ (బహుభుజ గోపురము)ను పూర్తి చేయుడు.



పనిలేక తీరికగ నుండునపుడు ఇట్టి సమస్యలు ఆలోచనలను కలిగించి, ఆనందమును ఆసక్తిని చేకూర్చును. అయితే, ఆర్థిక రక్షణ విషయము అన్నిటికంటెను ముఖ్యమైన సమస్య. అయినప్పటికి ఈ సమస్య ఎట్టి భయమును కలుగజేయ నవసరములేదు. ఎందుకనగా, డబ్బును దాచుకొనుటకు చక్కని ఏర్పాటునుచేసి ఈ సమస్యను పరిష్కరింపవచ్చును. నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లను, స్టాంపులను లెక్కవమంది ప్రజలు కొనుచున్నారు. మీరుకూడ కొని సంవత్సరము సంవత్సరము దాచుకొనిన డబ్బును వృద్ధిచేసికొని ఆర్థికరక్షణను పొందుడు. డబ్బును చక్కగ పెట్టుబడి చేయవలయుననినచో నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లను కొనవలసినదే. వాటిమీద మంచి వడ్డీ గిట్టుటయేగాకుండ అవి ఎంతో భద్రమైనవి.

## నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లు

### వీటివలన కలుగు ముఖ్యమైన లాభములు ఏవనగా:—

1. మీరు నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్లను 5, 10, 50, 100, 500, 1000, లేక 5000ల రూపాయలకుంట కొనవచ్చును.

2. ఒక కుటుంబములోని ప్రతివ్యక్తియు (ఈడువచ్చినవారైనను లేక మైనరు) 5,000 రూపాయలవరకు కొనవచ్చును. ఇద్దరు కలిసి 10,000 రూపాయలవరకు కొనవచ్చును.

3. 12 సంవత్సరములలో వీటి విలువ 100 కి 50 వంతులు పెరుగును. పెట్టుబడిచేయు ఒక్కొక్క రూపాయ రూ. 1-8-0 లు అగును. ఇది గవర్నమెంటు పత్రముల మీద ఇవ్వబడు అత్యధిక వడ్డీ.

4. వచ్చే వడ్డీమీద ఇన్కంటాక్సు కట్ట నవసరములేదు.

5. 2 సంవత్సరములు దాటిన తరువాత వీటిని ఎప్పుడైనను మార్చుకొనవచ్చును. (5 రూపాయల సర్టిఫికేట్ల విషయములో 18 మాసములు దాటిన చాలును)

6. కొద్ది మొత్తములను దాచుకోగలవారు 1 రూపాయను, 8 అణాలను లేక 4 అణాలను సేవింగ్సు స్టాంపులను కొనవచ్చును. ఇట్లు కొనగా కొనగా, స్టాంపుల మొత్తము 5 రూపాయలైనపుడు, వాటికి బదులుగా ఒక సర్టిఫికేటును పుచ్చుకొనవచ్చును.

7. సర్టిఫికేట్లు, స్టాంపులుకూడ పోస్టాఫీసులలో గాని, గవర్నమెంటువారిచే నియమింపబడిన అధికారముపొందిన ఏజెంట్లవద్దగాని, సేవింగ్సు బ్యూరోలలో గాని దొరకును.

## మీ సేవింగ్సు గ్రూపులో మీరు ఇప్పుడే చేరండి!

MYSORE SANDAL OIL

# ఇంతవరకు కూడ సాటి మెరుగనిది!

ఇప్పుడు లభించు మంచిగంధం నూనెలన్నింటిలోనూ మైసూరు మంచిగంధం నూనెమాత్రమే స్వచ్ఛమైనది, అత్యుత్తమమైనదియున్నూ. మందులలో ఉపయోగించుకోడానికి, సబ్బులను తయారుచేసుకోడానికి, సువాసననిచ్చు తదితర వస్తువులను తయారుచేసుకోడానికి.'మైసూరు' అని పేరుగల శాండల్‌వుడ్ ఆయిల్ అత్యుత్తమమైనది,

## మైసూరు శాండల్ వుడ్ ఆయిల్

మైసూరు ప్రభుత్వం వారిది

# జీవితమాధుర్యాన్ని అనుభవించుడి



యువకుడా, ఉత్సాహివి కమ్ము. విచారించెద వేల? జీవిత మాధుర్యాన్ని అనుభవించుటకు సుప్రసిద్ధ సెక్సాలజిస్టు డా॥ నారును సంప్రదించుము. రహస్యవ్యాధులు మూలవ్యాధి, వీటితో యిక బాధపడవద్దు.

## డాక్టరు నారు, సెక్సాలజిస్టు,

నారూ హాస్పిటలు,

## 24, బ్రాడ్వే, మదరాసు.

జవాబుకొరకు తపాలబిళ్ళలు పంపవలయును.

సంప్రదించుకాలము :—8 మొదలు 12 వరకు, సాయంత్రము 4 మొదలు 7 వరకు.

ఆదివారము 8 మొదలు 12 వరకు. సాయంత్రము మూసివేయబడును.

ఉత్తర ప్రత్యుత్తరాలు రహస్యంగా ఉంచబడును.

చెప్పుట నిర్బంధమైనచో మరి నిర్బంధము కానిదేది? ఒకవేళ రోజునకు ౮ నుండి ౧౨ గంటలవరకు నూలు తీయుట కష్టమైనచో రాట్నమును అభివృద్ధిచేయుమని కోరవచ్చును. ఇప్పుడున్న రాట్నముపై ౧౨ గంటలకు ఒక చిట్టము తయారైన, ౧ గంటకే ఒక చిట్టము తయారగునంత వేగముగా, సులువుగా తిరుగు రాట్నమును ప్రవేశపెట్టుడని ప్రభుత్వమును ఒత్తిడిచేయవచ్చును. రాట్నమును విద్యుచ్ఛక్తితో నడుపుటకు వెంటనే ఏర్పాటుచేయుమనవచ్చును. సర్ విక్టర్ ససూన్ గారు విద్యుచ్ఛక్తిసహాయముతో తిరిగిన చేతిమగ్గము మరమగ్గముతో పోటీచేయునని చెప్పినారు; అటులే విద్యుచ్ఛక్తితో తిరిగిన రాట్నము మరకదురుతో పోటీచేయగలదు. ఇట్టి రాట్నమును కనిపెట్టినట్లు వారే చెప్పియున్నారు. ఐనప్పుడు ఈరెంటిని జోడించి పనిచేయకూడదా? ఇట్టియంత్రములుమాత్రము చవుకవై, సర్వప్రజానీకమునకు అందుబాటులో నుండవలెను. ప్రభుత్వము వానిని అందించు బాధ్యత తనపైననే వేసికొనవలెను.

ఒక ప్రముఖ న్యాయశాస్త్రవేత్త యీ మధ్యనే రాష్ట్ర ప్రభుత్వమునకు క్రొత్తమిల్లును నిరోధించుటకు అధికారము లేదని సిద్ధాంతీకరించినాడు. పరిశ్రమలన్నియు రాష్ట్రప్రభుత్వముఅధికారములోనివేగాని, యుద్ధకాలమునందు కేంద్రప్రభుత్వము కొన్నిటిని తన అధికారములోనికి తీసికొన్నది. ఇప్పుడు యుద్ధము ముగిసి సాధారణపరిస్థితులు తిరిగి నెలకొల్పబడుచున్నవిగాబట్టి తిరిగి వానిని తన అధికారమునకు ఇచ్చివేయుమని రాష్ట్రప్రభుత్వము కోరవచ్చును. మంత్రిత్రయసూచనలప్రకారము పరిశ్రమలేగాక సుంకములుగూడ రాష్ట్రప్రభుత్వాధికారములోనే యుండును కదా. త్రోసివేయబడుచున్న పూర్వకాలపు రాజ్యాంగ చట్టమును పట్టుకొని ఎంతకాలము ప్రాకులాడుదురు? రాష్ట్రప్రభుత్వసిఫార్సుపై ఇచ్చిన మరకదుళ్ళను రాష్ట్రప్రభుత్వకోరికపై కేంద్రప్రభుత్వము ఎందుకు రద్దుచేయదు? ఇటువంటి విషయములో రాష్ట్రప్రభుత్వము, కేంద్రప్రభుత్వము తగాదా కల్పించుకొనునా? అదియు తాత్కాలికముగా తన అధికారములో నున్నదానికి? పరిశ్రమను స్థాపించినతరువాత దానిని రక్షించునది రాష్ట్రప్రభుత్వమేకదా. రాష్ట్రప్రభుత్వము నష్టపరిహారమును ఇత్తుమన్నప్పుడు, క్రొత్తగా వచ్చునవి ౨౦ మిల్లులైనా లేవే, యింత దింపుడుకళ్ళఆశ ఎందుకు? రాష్ట్రప్రభుత్వపుఆశయములపై చన్నీళ్ళు జల్లి కేంద్రప్రభుత్వము ఎన్నాళ్ళు నిలువగలదు? ఐనను ఇపుడు కేంద్రమున పనిచేయుచున్నది ప్రజాప్రభుత్వము. సంయుక్తమంత్రివర్గము లున్నంతమాత్రమున అధిక సంఖ్యాకులు అల్పసంఖ్యాకుల అడుగులకు మడుగులొత్తవలసినదేనా?

విమర్శకులందరు ఖాదీయన్న తమకు కోపము లేదనియు, దానికి దేశముయొక్క ఆర్థికవ్యవస్థలో తప్పక తావు గలదనియు, కావలసిన ప్రభుత్వపు అవసరములన్నియు ఖాదీతోనే తీర్చవలసినదనియు బూటకములాడెదరు. ఖాదీని వీరు నిజముగా ప్రేమించిన మిల్లులను ఎట్లు ప్రేమింపగలరు? ఒకేమారు దొంగయందు, నష్టపడినవానియందుకూడ మీకు జాలికల్గునా? ఖాదీకి గృహపరిశ్రమలలో కెల్ల మేల్బంతిగా స్థానమున్న తప్పక మిల్లులు దానిని పాడుచేయుచున్నవని ఒప్పుకొనవలెను. అంతేకాని ఇతరులను సంతృప్తిపరచుటకు రెండువైపులను మాట్లాడుట సమంజసము కాదు.

రాష్ట్రపతి కృపాలనీ పదివేలమంది ప్రజాప్రతినిధుల సభలో భారతదేశ రాజకీయ, ఆర్థిక ప్రజాస్వామ్యమునకు, విద్యుచ్ఛక్తితో నడుపబడు గృహపరిశ్రమలలో పనిచేయు శ్రామికుడే మూలకందమని ప్రపంచమునకు ఎలుగెత్తి చాటినాడు. పరిశ్రమల సహకార సంఘములను, వినిమయసహకారసంఘములను స్థాపించవలసినదని సలహాయిచ్చినాడు. జవహరలాలుకూడ యిదే అభిప్రాయమును చాలరోజులక్రిందనే వెలిబుచ్చినాడు. వారు చెప్పిన మాటలను రాష్ట్రమంత్రులు విని తలయూచిరి; ప్రధాని ప్రకాశం కార్యరంగమున ముందుగా తానై ప్రవేశించినాడు. తక్కినవారు కలిసిరా రనుకొన నవసరము లేదు. ఒకవేళ రాకపోయి

వను వారి నైజమే బయటపడును. కాని మదరాసు ప్రధానిపథకము సరియైనది కాదనిమాత్రము కాదు.

ఫలితమంతయు వ్యక్తుల విశ్వాసముపై ఆధారపడి యుండును. వారు చిత్తశుద్ధితో పనిచేయకపోయిన కార్యము తప్పక విఫలమైపోవును. వారు అకళంక చిత్తముతో పనిచేసిన తప్పక సఫలీకృతులు గాగలరు. అట్టివారిని తప్పక దీవించవలసినదే.

---



ఢిల్లీలో రాజ్యాంగ పరిషత్సభా భవనము.



# గ్రహణం

[కథానిక]

•

= శ్రీ జీవనశర్మ -

"భాయీ ఫరీద్, ఈ వేళ శెలవు. రాత్రికి చంద్ర గ్రహణం. సాయంత్రం ఏడుగంటలబండిలో వైజాగ్ వెళ్లి సముద్రస్నానం చేసివస్తాము మారామం గాడు, నేనున్నూ. మళ్లీ రేపు ఫస్టు పేసింజరులో వచ్చేస్తాము. నువ్వు రేపు కొంచెం ఎర్లీగా లేచి కూలీల మస్తరు తీసుకో. అంతే. యింతలో నేనూ వచ్చేస్తా" నన్నాను. అందుమీద వాడు "బాగుంది మోహన్ భాయీ. మీ హిందూస్ బ్రూటుస్. సముద్రస్నానం యేమిటి! నువ్వు చదువుకున్న వాడివికూడాను. గ్రహణంనాడు సముద్రస్నానం చేస్తే ఒళ్లు బంగారం అవుతుందివోయ్! యేదో పదిమంది ఆడాళ్లు స్నానం చేస్తుంటే మసక చీకట్లో మజామూసింద్ కీ వోయ్, నాకి తెల్సు. మంత్రాల్ గింత్రాల్ సదివేదీ లేదు, ఏమీ లేదు." అని ఆగి అదోలా కొంటెగా కన్నుకొడుతూ "నేనూ వచ్చేందికి సూస్తున్నాన్ భాయి-రామాలాగా" అన్నాడు. "చాల్లేవోయి, తురకసన్నాసీ! నీ కెందుకు గోలలాష్ట"మన్నాను. కాని, ఊహూ, వాడు ఊరుకోలేదే! "అరే, మీ భ'మ్మర్లు మడిగామంఛాలో మాట ఖట్టింది మాకూ కొంచం యిర్వండోయి. నేనూ మూస్తాను. నేనూకూడా కంఫర్టు, మఫ్లర్ అంతా సిద్ధం చేసివచ్చా"నన్నాడు. "భచ్చానురా భగవంతా! యీ తురకగ్రహణం పట్టేగాని విడుపుండదు. పిల్లిని చంక బెట్టుకున్నట్లు వీ డెందుకురా" అనుకున్నాను. కానైతే ఏమనలేక, సరే కానీ అన్నాను. ఇంతలోకి మారామం గాడు రైలైపోయాడు. పదండని స్టేషను వేపు నడిచాం. లక్కీగా ఫరీదుగా డన్నాడుగదా-"భాయి, కొంచెం నంబర్ టూకి వుంది." అన్నాడు. నేనుకూడా ఫ్రాడ్ గా "అరరే, గ్రహణం భాయి! మించిపోతుంది. నడుస్తూంటాం రా"అన్నాను. వాడు పోయాడు. "సైతాను వదిలిందిరా బాబూ, హుషారు చె"య్యన్నా మారామం గాడితో. ఫరీదో అన్నాడు వాడు, పాపం, అమాయికంగా. "వాడే వస్తాడు. లేకపోతే పోతాడు. పదరా" అన్నాను. కిక్కురుమనకుండా నడిచేడు మారామం. అదృష్టవశాత్తూ ట్రెయిన్ ప్లాటుఫారమ్మీద నిలబడీదా అన్నట్లు మెల్లిగా ఆగుతూంది. "పదరా, బండెక్కు" అన్నా మారామం గాడితో. వాడింకా "ఫరీదో"అన్నాడు. నేను చించుకుంటూ "వాడికోసం వుండిపోతావేంటి? ఇంతకీ తురకముండావాడి కెందుకు తొందర?" అన్నాను. రైలెక్కేశాం. బండి కదిలిపోయింది. జన సమ్మర్దం జాస్తిగా వుంది. జాగా చూసుకునే సరికే 'వాల్తేర్' అన్నారు. పైకిచూచా. నిజఁవే. గేటు దగ్గరకి చేరవగాచేఋకుని రామంగాణ్ణి యీడుస్తున్నా. బండి ఆగింది. గమ్మున దిగేశాం యిద్దరమూనూ. మాకు టిక్కెట్లు లేవుగదండీ. ఇహా కల్లీ,

సోడా, సిగరెట్ వగైరా సరంజామీకరణకి బయల్దేరాము. యెప్పుడు పోయాడో మా రామంగాడు, ఎక్కడికి పోయాడో - కనపడడు. తెగవెతికా. స్టేషను ప్లాటుఫారంఅవతల చివర యెవరో గలభాపడుతూంటే చూడడానికి పోయాడు. ఇహ నాకు వాణ్ణి కనుక్కోడం సీతాన్వేషణకి హనుమంతుకైనంత పనైంది. ఎలాగైతేం కనుక్కున్నా. రైలుడిపార్ట్మెంటువారి స్టైముకి గ్రహణశంక పట్టేసిందేమో - నిప్పులు గక్కుకుంటూ పోతున్నాది. అక్కడి గొడవలో మా కాస్టార్టింగే తెలియలేదు. వెధవ బొగ్గుబస్సులే నయం. గంటముందు నుంచి స్టార్టింగు తెలుస్తుంది. పోనీ అన్నాను. రామంగాడికి కొన్ని రానిచ్చాను. నేను కొన్ని స్వీకరించాను. దాంతో పురుషప్రవరణ్ణయి అకాపుట్ పెట్టన్నాను. రామంగాడు వెనకా, నేను ముందున్నా. తోవగడవలేదు. అదృష్టవశాత్తు- చావులమదుం దాటేసరికి ఓ అగ్రహారబ్రాహ్మణసంఘం తగిలింది. సంఘం అంటే పంచాయతనే అనేనా కాదు. శుద్ధత్రయం- ఒకటి నేను సుమా అని చిరకాలసమాశ్రితస్వేదప్రదరామోదం జల్లుతూన్న ధావళీ తొంగి చూస్తున్న దర్భాసనకట్ట- చిన్న గావంఛాకురి వేయబడి వేలాడుతున్న పెండ్లి ఝూరీ, నెత్తిన మూడుపరకలో తక్కువో లెక్క తెలీదు-పిలకా, చేతులో క్రా—రివటలాంటి శాస్త్రిలుగారు. ఆ వెనక మారుగట్టుపంచ మడిపొత్తుపంచ చుట్టిన చంకలో మూట. విడిపోయిన జుట్టు ముడివేసుకోబోతూంటే చేపట్టు దప్పి సగం జారుతూంటే ఉహూ అని విసుక్కుంటూన్న వలపైరేళ్ళ ముత్తైదువ అనుకుంటా. ఇహ మూడు. ముసుగు. యెత్తయిన పైట-బొట్లా వున్న గుత్తమైన ఉత్త కాళ్లూ నడుస్తున్నాయి. కాలుని వేయిరా రామం అన్నాను. వాడు యీడిగిలబడుతూ నేవున్నాడు. నానడకా బరువెక్కింది. పట్నంలో హైరోడ్డు విడిచి సందులంట పోతూంది యింజను. అంటే అప్పత్తిడిబ్బ యెక్కుతూంది. ఆ లూపుకే మా బోగీకూడా స్లోఐంది. నాచురల్ గాను. యెక్కుడు అయిపోయింది. గేర్ లో కొంచెం స్పీడు రేజైంది. కాని కొంచెంసేపులో నెంబరు త్రీ బోగీ డిటాచై రోడ్డువార ఆగింది. నేను నంబరు త్రీ అయ్యాను. ఒక పదిగజాలు నడిచాను. అక్క డొహ మలుపుదగ్గర నేను తప్పుకుని మా రామంగాడికి నా స్థానం యిచ్చా. బండి సాగింది. జాలారిపేటదాను చేరింది. యింతలో వెనకటి నెంబరు త్రీ దగ్గరగానిద్ది దగ్గా. దాంతో మెల్లగా దేవురవ్వా. ఆవిగ్రహం అనుగ్రహంగా తమాయించి ముఖందగ్గర చూసి "మీదేవూ"రంది. "రాంపురం" అన్నా. అంటే నీకం పేట అంది. సముద్రస్నానానికా అన్నా. యేదో వూసుపోక అని సమాధానంవచ్చింది. యేంస్నానమో అన్నా. "నాబతుకు సముద్రంకంటె యిది గొప్పది గాదు. నా జన్మకదే చా"లంది "ఏం" అన్నా. డైరెక్టుప్లయి రాలేదు. మౌనంగా సైడుబైసైడు స్లోగేస్ సాగిస్తున్నాం. ఏవో ఒకటిరెండు జీవాలు మమ్మల్ని తప్పించుకు నడిచాయి. కాని విడ్డూరంగా కనపడలేదుగాబోలు. మూగజీవాలవి. మెల్లిగా నే నొక్కర్తినీ యింటి దగ్గరుండడం యిష్టంలేక పోరితే మానాన్నతో వచ్చానంది ఆధ్వని. అహాఁ అన్నాను. అంతలో ఆగి "మీరు రెండు అరటిపళ్లు కొనిపెట్టం"డని కప్పుకున్న దుప్పటి పైకెగేసి పోకముడిదగ్గరగాబోలు దాచిన డబ్బు విప్పి తీస్తూ నావేపు చూస్తూంది. "అక్కర్లేదు. నే నిస్తా"నని ఫోరవచేసి ఆ మెచే కులకు తాకి వారించాను. "ఊఁహూ, సరే"నని ముసిముసినవ్వుతో "పదం"డంది. బ్రేకు లాఫై బండి స్టార్టయింది. మేమూ జాలారిపేట చివర కొచ్చేశాం. ముందు ట్రైయిక్ హోల్టయివుంది. అల్లంత దూరంనుంచే "సుందీ-" అని అరుపొచ్చింది. అరిగిపోయి బిరుసెక్కిపోయిన ఆడగొంతు. "ఆఁ" అని ఆవిగ్రహం ముందుపోయింది. నే తగ్గా. నడుస్తున్నా అడుగులెక్కెడుతూ. ఇంతలో ఆగొంతే "యెక్కడికొచ్చినా బాగానేవచ్చిం దీదిక్కుమాలిన సంత- అయితే దూరంగా తగల"డంటూ గర్జించింది. నేను హడిలాను, రామాన్ని పిలిచి "ఒరే నాకంట్లో బాగులేదు. చలిగా వుంది స్నానం చెయ్యను. తాతగారితో పోయి నువ్వు చేసిరా. నే నడుగో" అని చూపుతూ "ఆ యిసకదిబ్బమీద కూచుంటాను రా." అన్నాను. వాడు పారిపోయాడు. మందలో కలిసి పోయాడు. నేను మెల్లిగా ఫర్లాంగుకూతాన్నున్న దిబ్బ కేసు

ఒక్కడినే. అటేపు ఖాళీగానే వుంది. వెన్నెల పాలొలకబోసినట్లుంది. చూచున్నాను. యేదో తెల్లని రూపం నావేపు వస్తూంది. నాగుండెలు వేడెక్కాయి. ఆముసుగు దగ్గరయింది. "ఎవ"రన్నా. "మీరా" అంది. "ఏ మిలా వచ్చా"రన్నా. "ఈచల్లో స్నానం యెవరుచేస్తారని అలా అన్నాను అంతే" అంది. "సరే అయితేచూచో" అన్నా. ఆకాశంవేపూ, చంద్రుడివేపూ చూస్తున్నాం. ఓ చిన్నమబ్బు చంద్రుడిదగ్గిరైంది. ఇదుగో అని అవ్యక్తి దగ్గిరై "గ్రహణమే కాబోలు" అంది. ఆమెగుండెధ్వని నాకు వినిపించింది. నాగుండె ప్రతిధ్వనించింది. "ఊ"అని నిదానంగా చూస్తున్నా. ఇంతలో నాకళ్ల కడ్డంగా చెయ్యిసెత్తినది వచ్చి. "అదిగో పడుతూం"దని ధ్వనించింది. ఔనన్నా ఏకో యిదిగా. నిజంగా గ్రహణమే. చుట్టుప్రక్కలకు చూచా. వెన్నెల మసగ్గావుంది. నాకు వెచ్చగా యేదో తగిలింది. సగంపైగా గ్రహణం పట్టివుంది. క్రమంగా చీకటి హెచ్చింది. ఓ పావుగంట. మళ్లా వెలుగు హెచ్చుడం మొదలుపెట్టింది. "గ్రహణం సరా"అం దాధ్వని. "యిక విడుపే" అన్నా. అప్పటి వెన్నెలలాగే తెల్లబోయిం దామొహం. చెమట బిందువులు మొహమ్మీద అవుపించాయి. నానొసలు చెమట నాకు చల్లగా కనిపించింది. మసగలో మా రామంగాడు వస్తున్నాడు. రోడ్డుమీదికి జారింది చంద్రుడిప్రక్క మబ్బులాగ. రామంగా డొచ్చి "యిహ సరేనా బావా" అన్నాడు. "అయిపోయింది పదరా, పోదా" మన్నాను. దార్లో యేదో కొందా మన్నాడు రామంగాడు. "కావలిస్తే కొనుక్కో" అన్నా-ఒక అణా యిచ్చేసి. నాకు వాడి ధ్యానం యేమేనా వుంటే గాదూ. యేదో కలలోలాగ అడుగులుపడుతున్నాయి. ఏవో ఆలోచనలు. ఏం చెప్పగలను? ఆ తీయని పలుకుల్లో, ఆ మెత్తనలో, ఆ సంతుష్టిలో యీదుతూ ఊపిరిసలపక, "పేరేనా అడగలేదూ" అన్నా గట్టిగా. మా రామంగాడు "ఎవరి పేరు బావా" అన్నాడు. "ఫకీరుగాడురా" అన్నా. "ఫకీరుపేరు యెరగవేమిటి? అడగడ మెందుకు" అన్నాడు. "కాదురా"అని సర్దుకొని యిదేం గ్రహణమో తెలియక పేరడగలేదన్నా. కాబోసని పూరకున్నాడు పాపం వాడు. మళ్లీ కళ్లముంతకీగలుమూగినట్లు ఆలోచనలు మూగుతున్నాయి. యింతలో "వాల్టేరుస్టేషను కొచ్చాం బావా" అన్నాడు. నిద్దరోతున్న నాకళ్లు విప్పా. నిజమే... బండెక్కాము. యింటికి చేరాం. తెల్లారిపోయింది. పక్కమీద చేరవాలేను. అంతే. "ఇప్పుడు పడకేంటి? లే" అంది మా చెల్లెలు. విసుగ్గా "గ్రహణం స్నానం చెయ్యడానికెళ్లాను. బడలిక. లేప"కన్నా.

౨

పదిగంటలైంది. లేచా. మా చెల్లెలు కాఫీ తెచ్చింది.

యిల్లాలు "రాత్రి గ్రహణం పట్టింది. స్నానమేనా లేదు. అసలు మొహమేనా తోలుచుగోకుండా కాఫీ యేంటే" అంది. నాగుండె యెందుకో ఝల్లుమంది. లేచి దంతధావనసంస్కారం లఘుమార్గంగా తేల్చేసి, కాఫీగళాసు ఖాళీచేసి వాకట్లోకి చూచా. నీడ లప్పుడే దగ్గిరకొచ్చేస్తున్నాయి. వొళ్లు విరుచుకుని లేచి, పైని తువ్వాలు వేసుకుని, ఫకీ రేమయ్యాడా అని వాళ్ల యింటి కెళ్లా. మధ్య రామశాస్త్రిగారి ఇల్లొక్కటే. ఆవలదే వాళ్లిల్లు. అంటే యిరుగూపొరుగే - మూడో యిల్లు మరి. గేటుగా వున్న తడిక నెట్టిచూచా. ఫకీర్దు చెల్లెలు చాందుమాత్రం ఒక పురిటిపిల్లకు సంకతుణ చేస్తూ అవుపించింది. నన్ను చూచి లేచిపోయింది. చాందుని చిన్నప్పటినుంచీ యెరుగుదును. 'చంద్రీ' అని మా చనువుగానే వుండేది. అయితేనేం, పద్దెనిమిదేళ్లొచ్చాయి. కలకత్తాదగ్గ రేదో పని దాని పెనిమిటికి, అంతా పదిరోజులైంది. అక్కడ అల్లర్లలో ఆమెభర్త తెగిపోతే యిక్కడ కొచ్చేసిందిట. యీ మధ్య నాకళ్లబడక పోల్చలేకపోయాను. నిజమే. కాని, "అన్న మస్తరికి యెల్లిందు" అని చెప్పిన గొంతు పోల్చాను. అయితే, యెందుకో పలకరించి విశేషా లేమిటని అడిగి తెలుసుకోలేదు. మనస్సినీటో యింకా తొలినాటిరాత్రి కలల పాలిమేరల్లోనే తిరుగుతూంది. సరే అనిమాత్రం అనేసి పనిమీదికే బయలుదేరాను. ఊరుబాట పడిదారులు వెళ్లేను. ఫకీరు యెదురయ్యేడు. అల్లంతదూరంనుంచీ

"భాయి, మీది మంచిగ్యానం బట్టింది. నాకి వచ్చే దాన్కి యాల్లేకపోయింది భాయీ, క్షమించు" అన్నాడు చిన్నమొహంతో. దాంతో నేను సర్దుకు న్నాను. "మా బలేగా చేశావులే! మీ తురకమతానికి గ్రహణం యేంటని నా కసలు తెలికుండీకూడా పోనీ వస్తే-చూస్తే నీకూ బుర్ర కెక్కుతుందేమో కొంచెమని చూశా. కనిపెట్టుకుని చూసి చూసి విసుగెత్తిచచ్చాను. ఇహ నేమైతేగానీ బం డెళ్లిపోతూందని పోయాము. యెంతమజాగా వుందనుకున్నావు" అని విసుగుదల, కోపము, వ్యధికరణం ముప్పిరిని జమాయించాను. దాంతో వాడూ కొంచెం తాజాపడి మళ్లీ మొదలు పెట్టాడు. అదంతా "అలా వొచ్చింది భాయి. విను, సెప్తాను. ఆ సెట్టుకింద కూకుందాం పద" అన్నాడు. యిద్దరం చెట్టుక్రింద కూచున్నాము. వా డిలా చెప్ప మొదలెట్టాడు: "భాయీ, మీతో సెంబరుటూ చెప్పి వచ్చీశా. ఆ వరకలో కూకున్నా. సిన్నసీకటి. యెవురో సిన్నతట్ట నెత్తిని తెచ్చి ఆ యిసికదిబ్బమీన బోమ్మ లించి యెందుకో అటుకూ యిటుకూ మాసుక్కుంటూ యెల్లిపోయింది. దానికి పోనిచ్చి యేటో మూదామని యెల్లా. తెల్లగుడ్డ, సుమ్మాడికాయమూట వుంది. యిప్పి సూశా. నువ్వు సెప్పితే నమ్మవ్ భాయీ. గుండె దడ దడా, దడాధడా కొట్టుకుంది. కాలు హాతికి పోయాయ్. సిన్నబిడ్డ వుంది! సూశా. బతికి వుంది. సిన్నగా మూల్గుసేత్తుంది. సెయ్యి వొణికింది. ఘట్టిసే క్కుని పట్టుకుని యింటికి సేరి మాచాందిక్కి చెప్పా. అదీ, భాయీ, యేడ్సేసింది. నువ్వు నిజంగా నమ్మవ్. భయ్యా దూద్ లావుకరేక్కి సెప్పింది. యెల్లా. యెవుర్ని అడిగేది? నివ్వు లేవు. తిర్గితిర్గి ఒకమణిషిపా తెచ్చా. సాల్వంది మాచాందీ. మళ్లీ యెల్లా. రాత్రల్లా నలమారు తిర్గాను భాయి. మాచాంద్ దాన్కి పెస్తాను సెప్తాది. నాకీభీ సంతోసం. యెవుర్కీ సెప్పకూ భాయి. చాలా మంచిది మీ గ్యానం." అని వెర్రి ఆవేదనతో చూస్తూ అంటున్నాడు. ఆ ఆవేదన చూస్తుంటే నాకు మాట లేదు. ఎలాగై తేనేమి, "చాలు, మహగొప్ప పని చేశావు. పద" అన్నాను. వాడి ఆ వుత్సాహమిమ్మద నీళ్లుపడ్డట్టయింది. మూగగా ముందు నడిచాడు. నేను అనుసరించాను. అయితే, కామన్ సెన్సు ఖాళీ అయింది. యింతలో యిల్లు చేరాం. ఫరీదుగాడు నా చెయ్యి పట్టు కొని "భాయి, యెవ్వరికీ తెల్నీకు. నీకు సలాం సేస్తా. మాచాందీక్కి పానం భాయి." అని కన్నీటితో చెప్ప డంతో బ్రేక్సు ఆఫ్ అయిపోయిన రైనమోలాగ నా బ్రెయిన్ ప్రారంభించింది పని. "యీ దురాత్మ్గపుపని యే ఛండాలుడు చేసుంటాడు? ఆ పసువు స్త్రీ సహజ మైన మాతృహృదయకోమలత్వం చచ్చిందే! వయం, చంపేశిందిగాదు! అవును, ఆ పనికి సాహసం చాలదు. కాని యేం జేస్తుంది, సంఘానికి వెరిచి చేసుంటుంది. దిక్కుమాలిన సంఘం! కుంతివంటిది కులదీపకుడైనవాణ్ణి కూరాకులో ముల్లులా తీసిపారేసు కుంది. అహల్య ఆ ప్రణయపుటుడుకుతో మాతృప్రేమ మసిచేసుకుని పుత్రద్రోహం నెత్తిని రాసుకుంది. యీ సంఘపు ఘాటుకు సహించలేరు. యెవరైనా యింతే. కాని, యీ ఫరీదేంటి? వాడి కనికారహృదయం, ఆ చాంద్‌లో బయలుదేరిన తల్లిప్రేమతరంగం. సనవ సంఘం మావాళ్లలో ఒక్కరికీ లేకపోయిందే? వీళ్లంటి దేవుళ్లు మాసంఘంలో వాళ్లే అనుకుంటే యెంత గొప్ప గా వుంటుంది, యెంత ఆదర్శంగా వుంటుంది? మాబంజ రాళ్లకేనా పదునెక్కుతుందేమో!" అనే మొదలైన ఆలోచనలు ఆ తొలివాడు సముద్రస్నానాల రేవులో మునగడానికి ముందుకు విరుచుకుపోయ్యే ప్రజాతరంగ పంక్తిలాగ, ముంచేస్తాం లోకాన్నని యీసుపాసు లేకుండా పడుతూ పేకగా ముందుకొచ్చి విరుచుకు పడే మహాతరంగాల్లాగా పోగడుతున్నాయి నా బుర్రలో. గ్రహణంలో మలిగిపోతూన్న చంద్రకళలాగే నాకాగిట్లో నలిగిపోతున్న ఆ అజ్ఞాతవ్యక్తి శరీరంలాగ వుక్కిరిబిక్కిరై పోతున్నాయి. గ్రహణం విడుపుచూ పుతో పాటు తెల్లబోయిన మొహంతో తేలిపోతూన్న కళ్లతో వెళ్లిపోతున్న ఆవ్యక్తి విడుపువలె. అనుకోకుం డానే మాయింట్లో రామంగాడి పిలుపుతో విడిపోయి చప్పబడిపోయాయి. యింట్లోకి పోయాయి. కాలం యీతలపులను దూరంగా దొర్లించేస్తుంది. మనోదృష్టి దిసను. యాదస్తురేఖలు గూడా మాసిపోయి యెన్నో కొత్తచుక్కలతో నాలుగు ఋతువులు నడిచి పోయాయి.

3

కరువుకి గ్రహణా ల్లావంటూరు. మళ్లా మరో గ్రహణం!

అయితే సూర్యగ్రహణం. మహాగొప్పగ్రహణమని మావాళ్లు, రామశాస్త్రీ, పెళ్లామూను, వీరేంటి, వారేంటి, బళ్లుగట్టుకు వెళ్లిపోయారు. సరిగా మూడుగంటలకిపట్టు. ఇంకా పండెండే అయింది. నేను యింటికా వుండి పోయాను. పగలు గ్రహణంలో మజా యేముంటుంది గనక! యింతకీ పొలంబోయాను. ఫరీదింట. చాంద్, ఆమెదగ్గిరగానే మాపొరుగురామశాస్త్రికూతురు మీనా కూర్చుని మాట్లాడుతున్నారు. అప్రక్కనే ఫరీదు యేం చేస్తున్నాడో. తెర అడ్డం. యేం తెలుస్తుంది? వీళ్ల గొడవ వీళ్లది. "మీనమ్మా, మీయూళ్లారాలు కాన కట్టవమ్మా. మీకు యీవోయిసులో..." అంది చాంద్ బీ. మీన మొగం వాల్చుకుని "యేంచెయ్యను చందూ. నారాత" అంది. ఒక్కక్షణ ముండి, మొగంవాల్చుకునే, నీళ్లతో బరువెక్కిన కళ్లతో, బొంగురుపోయిన పాతతంబురాతీగనాదంవంటి ధ్వనితో "నా కారోయేట పెళ్లిచేశారు. నే నీడేరేసరికి మాయింట్లో పెద్దగోల అయింది. యెప్పుడో కూడా తెలీదు". "ఇప్పుడెన్నేళ్లుంటాయి" అంది చాందు. "దిబ్బన్నేళ్లు! యెందుకు? యిరవై" అంది బరువుగా మీన. "పాపం! మనకు నిల్లం కట్టవే"-అంది చందు. ఉయ్యాల్లో పిల్లడు లేచాడు. చందు లేచి వెళ్లి తీసుకొచ్చి "పాలెత్తా. యెత్తుకో" అంది. మీన అందుకుంది. యెందుకో వళ్లు ఝల్లుమంది. కొత్తగాబోలు. పిల్లాడిని కాళ్లు చాచి పండబెట్టుకొని ఆ బుగ్గలూ, బోసినోరూ చూస్తూంది. చెమ్మగిల్లిన కళ్లతో. చందు పాలు తెచ్చి- "నివ్వు పట్టమ్మా" అంది. అదో యిదిగా తోచినా, యేమీ అనలేక సర్దుకుని పాలుపొయ్యడం మొదలెట్టింది. పూర్తవుతూంటే "మీనమ్మా, నీకు బిడ్డలకి యెత్తి పాలు యివ్వడం బాగానే వచ్చునే!" అంది. నా కంత అదృష్టమా" అంది మొగం పక్కకి తిప్పుకుని. ఒక కన్నీటి చుక్క బిడ్డమీద పడడం చూచింది చాంద్. పాత పూర్తయింది. కూర్చోపెట్టింది. తేన్చిన పిల్లడి గుండె చేత్తో రాస్తూ "పిల్లడు బాగుంటాడే. కాని మీలో యింకా అన్నం పెట్టరా? ఆ అన్నంతోటే బావుంటా"రంది మీనా. "అవునమ్మా, యిది మా ఆసారం కాదు. మా అన్న కానసుట్లు కూడెట్టమంటాడు. కాని నాబుద్ధి యేరు." అని దగ్గరగా వచ్చి చెవిలో మెల్లగా "ఇది నా పిల్లోడు కాదు. మా ఫరీద్ కి దొరికిండు. ఎవుడో యేటో! మన కిందుకని పాల్తోనే పెత్తన్నా." నంది చాంద్. మీనమొహాన రక్తం ఒక్కసారి యింకిపోయింది. "యెన్నాళ్లయింది" అంది. "ఇదిగో ఎనిమిదినెల్లెల్లిపోతే. కిందపాలి గానం బట్టదా, అప్పుడు" అంది. మీనమ్మశరీరం కంపిస్తూంది. కళ్లంట నీళ్లు కారుతున్నాది. చెమటపోస్తుంది. "చందూ, పోతా. జ్వరం వస్తూంది" అని లేవబోయింది. కాని చాంద్ "ఇదేంటో వింతగా వుందే" అని తన లోకు తెలియకుండానే ఒళ్లు తట్టిచూచి-"నేదే జరం. తలాన్నొప్పికి మందిత్తాకాని యెంటింతలో యిలాగయ్యే" వంది. మీనమ్మ మరచిపోయింది పరిస్థితి. ఆవేగముతో "చందూ, నువ్వు పెంచు" అంది. "ఏం, ఏటి" అని వింత ఆశ్చర్యముగా చూస్తూ చేయిపట్టుకుని అడిగింది మీనని. మీనమ్మ యేమో చెవులో చెప్పింది. చందు వింతగా వింటూ-"అలాగా, మీ పొరుగుమోహనా" అంది. తెరవతల ఫరీదు విన్నాడోయేమో, నిద్రలేచినట్లు వళ్లు విరిచి మూలిగాడు. మీన పారిపోయింది. అప్పటికి రెండుగంట లయింది. ఫరీదు లోపలికొచ్చేడు. చాందు విషయం అన్నతో చెప్పింది. ఎందుకో కీచులాడారు. నా నివ్వనంది చాంద్. "సరే, ఆ లొప్పుకోకపోతే తప్ప" దన్నాడు ఫరీదు. పైకిపోయాడు. మరికొంతసేపుకిదప ఫరీదింటనే తెరకు ఒకప్రక్క చిన్నకుర్చీలో కూచున్నాను. ఫరీదు నిలబడ్డాడు. "పోవాలిరా. అవతల గ్రహణం వేళైపోతూం"దన్నాను. "ఉండోయ్, పడతాది గ్యానం. అప్పుడిది రాత్రిగ్యానం, యిప్పుడు పగలుగ్యానం. తొందర యెందుక్కా" అంటాడు. "ఎందుకు పిలిచావో చెప్పు" అని తొందరచేశాను. "ఆరేభాయి, పట్టే గ్యానం మీ యింటిక్కా మా యింటిక్కా పడతాది. ఇక్కడ నూడవోయి" అని వేళాకోళపు సతాయింపుతో అంటే నా కొళ్లు మండుకొచ్చి, "నీ మొహం! మా యింటికీ మీ యింటికీ పట్టడ మేమిటి? సూర్యగ్రహణం లోకమం

దరికీ వస్తుంది" దన్నాను చిక్కొగ్గా. "అరే భాయి, యిది అచ్ఛాగ్యానంవోయి. మనిల్లకే పడతాదివోయి." అంటున్నాడు. వాడి కేకం నాకేం అర్థంగాలేదు. యింతలో తెర యెత్తుకొని ఆకిందనించి ఒక తొమ్మిది నెలల బాలుడు డేకివస్తున్నాడు. ఫరీదు కొంటెగా నవ్వుతూ "అయ్యో పంత్లూ, సూడవోయి నీ మొకం. గ్యానం యిక్కడ పడుతూంది" అన్నాడు. యేదో ఎలెక్ట్రిక్ షాకులాగు తగిలింది. సొమ్మసిల్లి పోతూ వెర్రిగా చూస్తున్నాను. ఆ పాకివస్తున్న నా చిన్ననాటి ఫొటోకి జీవం వచ్చినట్లు. ఫరీద్ రెట్టించాడు. "సూడువో నీమొకం! గ్యానం యిది మా యింటికి పట్టింది" అన్నాడు. నా ఊహలు సలపలేదు. "ఇది మనయిద్దరిల్లకీ పట్టాదివోయ్" అన్నాడు తిరిగి రెట్టించి. తెల్లబోయి చూస్తుండగానే తెర తొలగించాడు. నా చూపులు నేలకి పోయినాయి. అవతల నాలాగే క్రిందమాస్తూ మగ్గ క్రీగంట చూస్తూంది మాపక్కింటి రామశాస్త్రి విధవకూతురు మీనమ్మ. ఫరీద్, చందు యిద్దరూ హాయిగా నవ్వుతూ హేల్తో మమ్మల్ని చూస్తున్నారు. మీనయేమోగాని నాకు కాళ్ళక్రింద నేలలేదు. కంప్లీట్ జీరో అయిపోయింది 'నా'అంతా. "పంత్లూ, పంచాంగం సూవి చెప్పవోయి యికేం గ్యానంవో. నీకీ ప్రెజెంటు చెప్తాను" అన్నాడు. ఊహూ, నాకు మాటగాని, స్పృహగాని వుంటేగామా! "అరే పంత్లూ, మీ-మన గ్యానాక్కి-పలం యెవరిదివోయి!" అన్నాడు. "నాది" అంది చాంద్. "నాది" అన్నాడు ఫరీదు. తలెత్తి శూన్యంగా వాళ్ళ నవ్వులోని కొంటెతనానికి భయపడి, పెదవులు కన్నీళ్ళతో తడిచేసుకుని "మీదే" అన్నా. వెంటనే మీన "కాదు. మందీ" అంది. బస్సు! మా మూగతనానికి, వేదనకి గట్లు తెగిపోయాయి. ఒకరినొకరు చచ్చిబతికినవాళ్ళలా చూచుకుంటున్నాము. ఫరీదన్నాడు-"భాయి, యిది మా అల్లాకి తెల్సు; యీాలకి తెల్సు. నీకూ నాకీ తెల్సు. రచ్చించుభాయి. మాచాంద్కి-బతికిందికీ యిలా పోనీ" అన్నాడు దీనంగా. "ఏమైనా నానివ్వ"నంది చాంద్ ధీమాగా. "పోనీ నువ్వే పెంచు. నన్ను చూచుకుంటూవుండనీ" అంది మీన. ఓం టెంట పొగల్లోస్తూన్నాయి. హరేరాం అన్నాడు యీ నా స్తిక పకువు. అల్లాహో అక్బరన్నాడు అమాయికపు ఫరీదు. జైహింద్ అన్నారు కొంటెగా మీనాచాంద్లు. అయితే యీ కుర్రాడికేపేరు ? 'మోహన్‌చంద్ మీనా మియ్యా' అందామా? అన్నాడు ఫరీదు. సమాధానం చెప్పకుండా తల వంచుకొచ్చేశాను యింటికి- నేనేం చెప్పగలనింకంటే ?



# విమలాదిత్యుని రాజ్యాధిరోహణము

= శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి =

ఆంధ్రమహాభారత కృతిపతియైన రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుడు. ఈ రాజన్యుడు వేంగివిషయాధీశుడైనను చాలకాలము పరిపాలింపలేదనియు, పాలించిన యా కొద్దికాలమైనను సుఖముగా గడుపక పెక్కుచిక్కులకు లోనాయెననియు చారిత్రక విమర్శచే తెలియవచ్చుచున్నది. వీని వివరములేవియు నాంధ్రశాసనములచేతగాని, గ్రంథములచేతగాని తెలియవచ్చుటలేదు. నేడు ఆంధ్రద్రావిడ కర్నాటక దేశములలో దొరకిన సాధనములచేత నీతని రాజ్యాధిరోహణమునకు సంబంధించిన విషయములను ఈ క్రిందియట్లూహింపవచ్చును.

విమలాదిత్యుని అన్నయైన శక్తివర్మ క్రీ. శ. 1011 సంవత్సరమున మరణింపగా విమలాదిత్యుడు తక్షణమే రాజాయెను [ఎపిగ్రా. ఇం. VI పు 349]. కాని ఈతని శాసనములు ఏవియు 1018 సం. వరకును ఆంధ్రదేశమున కనబడకుండుట ఆశ్చర్యకరముగనున్నది. ఈ ఏడెనిమిదిసంవత్సరములలో కడపటిసంవత్సరపు శాసనమొకటియే దొరకుట ఈ నడిమికాలమున నీ ప్రభువు ఆంధ్రదేశమున నుండెనా, లేక ప్రవాసియై విదేశాంతరగతుడాయెనా యను సందియమున కెడమిచ్చుచున్నది. ఇందులకు తోడుగా నీతని శాసనమొకటి ద్రవిడదేశమున దొరకియున్నది. ద్రవిడాధిపతియైన మొదటి రాజరాజ చోళుని ఇరువదితొమ్మిదవ సంవత్సరమున [క్రీ. శ. 1014] విష్ణువర్ధన మహారాజ విమలాదిత్య దేవుడు తంజావూరులోని తిరువయ్యారులో 'లోక మహాదేవీశ్వరముడయ మహాదేవు'నికి కొన్ని వెండిపాత్రలను దానమిచ్చినట్లొక శాసనము కలదు [A. R. 215 of 1894; S. I. I. V 514]. ఈ విమలాదిత్యుడు ఆ చోళరాజుయొక్క కొమార్తెయైన కుందవాంబాదేవి భర్తయని క్రీ. శ. 1010 సం. నాటి యొక యణవ శాసనమువలన తెలియుచున్నది [S. I. I. VIII 23 4]. ఆంధ్రరాజన్యుడైన రాజరాజనరేంద్రుడు తన కలిదిండి శాసనమున తాను విమలాదిత్యకుందవాంబల తనయుడైనట్లును, కుందవాంబ చోళాధిరాజైన రాజరాజుయొక్క కొమార్తె యనియు చెప్పియున్నాడు [భారతి, చిత్రభాను ఫాల్గున, స్వభాను చైత్ర, వైశాఖములు]. ఇందుచే నీ మహారాజు తన దేశమును వీడి చోళదేశమునకేగి తన మామగారైన రాజరాజచోళుని యాస్థానియందు కొంతకాల ముండెనని స్పష్టమగుచున్నది. మఱి నిరంతరము ఏమఱక పరిపాలింపవలసిన రాజ్యమును వీడుటకు ఏదో గొప్పకారణముండవలయునుగదా. ఎవరో బలవంతులైన శత్రువులు ఈతని రాజ్యముమీదికి ఎత్తివచ్చియుందురనుటకు సందియము లేదు.

ఈ కాలమున నాంధ్రులకు ప్రబలవిరోధులు కర్నాటకులు తప్ప మఱియెవ్వరును కానరారు. ఏలయన శక్తివర్మ పరిపాలించుచుండగనే అతని రాజ్యాంతిమ కాలమున పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన రెండవ విక్రమాదిత్యుడు ఆంధ్రదేశముపై నెత్తివచ్చి గోదావరికి తూర్పుభాగమున నుండు దేశమున కొంతయల్లరి గావించినట్లు చాళుక్యశాసనములవలన తెలియుచున్నది. పశ్చిమ చాళుక్యులకు సామంతులైన నొళంబరాజులలో ఘటియంకకాడు అను మహీపతికి సేనాధిపతి

త్రయిన బ్రాహ్మణుకు, ఘటియంకకాలి బ్రహ్మాధిరాజ వెన్నయభట్టారకుడనువాడు క్రీ. శ. 1010 సం. పు శాసనమొకదానియందు 'మలయమర్దన' డను బిరుదముచే వ్యవహృతుడు. [లోకల్ రికార్డ్సు వాల్యూం 2F, పుట 44]. ఈ బిరుదముచే చాల చరిత్ర తెలియుచున్నది. చాళుక్యులకు సామంతులైన నొళంబ పల్లవ రాజుల సేనాపతి తన ప్రభువులకై మలయమును మర్దించినట్లు దీని యర్థము. ఈ మలయమనునది ఆంధ్ర దేశమందలి యొక భాగమని ఈ యుద్ధారములచే తెలియనగును. వేంగీదేశమున తూర్పు కనుమలలో నేఁడు పాపికొండలను భాగపరిసరములే నాటి మలయమని యొక శాసనముచే తెలియుచున్నది. 'సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సర ర శ్రాహీ వెంగినాణ్టి మలయమణ్డలమున చాలుక్య సముద్ధరుడైన నూరపరాజు శ్రీ భీమేశ్వర మహాదేవరకు దీపమునకై దానము చేసెను [S. I. I. IV NO 1177]. ఈ నూరపరాజునకు ఈ శాసనమందే 'మలయమార్తాండు'డని బిరుదము కలదు. శ్రీ భావరాజు వేంకటకృష్ణరావు పంతులుగారు ప్రకటించిన ఆంధ్రదేశీయ రాజవంశావళి గ్రంథమున [Dynasties of Andhra Desa] విష్ణుకుండిన రాజగు రెండవ మాధవ వర్మ [సుమారు క్రీ. శ. 458-488] త్రికూట మలయాధిపతియని వర్ణించు సందర్భమున నీ మలయమును వేంగీ దేశభాగముగా సమర్థించియున్నారు [పుట 405,428.]

పై ఘటియంకకాని శాసనము క్రీ. శ. 1010 మే నెల 10 వ తారీఖున వ్రాయబడిన దగుటచేతను, ఆ తర్వాత సరిగా నొక సంవత్సరమునకే క్రీ. శ. 1011, మే 10 వ తారీఖు విమలాదిత్యుడు రాజ్యమునకు వచ్చినట్లుండుటవలనను, చాళుక్య విక్రమాదిత్యుని సామంతులును, సేనాధిపతులును శక్తివర్మరాజ్యాంతిమ కాలమున ఆంధ్రదేశముపై కత్తివచ్చిరనియు, ఈ కల్లోలముల నడుమనే ఆతని రాజ్యపాలనము ముగిసియుండుననియు తోచుచున్నది. వీని నెల్ల పరికింపగా విమలాదిత్యుడు రాజ్యాధిరోహణ మొనరించిన యచిరకాలముననే శత్రువుల దాడికి నిలువలేక ద్రవిడదేశమునకు పాఱిపోయియుండవలయును అని విశదమగుచున్నది. విమలాదిత్యుడు ఎప్పుడు దేశమును త్యజించి పోయెనో తెలియదుగాని యాతని శాసనము 1014 క్రీ. శ. లో తిరువయ్యారులో నుండుటచే నీత డా సంవత్సర మట నుండెననుట నిర్వివాదాంశము.

ఇంతకాలమును పశ్చిమచాళుక్యులు ఆంధ్రదేశమందుండిరో లేదో తెలియదుగాని, బహుశః విమలాదిత్యుని ప్రోద్బలముచేతనే గాబోలు నాతని బావమఱది రాజేంద్రచోళుడు పశ్చిమచాళుక్యులమీదికి దండెత్తి వచ్చెను. ఈతని మూడవసంవత్సరమున వేయింపబడిన శాసనములలో ఇతడు చాళుక్యులను జయించిన యుదంతము గలదు. 'తిరుమన్నివళర'యని యారంభమగు నీతని ప్రశస్తులలో నొకదానియందు ఈతడు 'ఇడైతుఱైనాడు, వనవాసి, కొల్లిప్పాక్కై, మణ్ణైక్కడక్కమ్' అను ప్రదేశములను జయించినట్లు కలదు [451 of 1908; Colas, Vol. 1. P 232]. అప్పటికింకను రాజరాజు బ్రదికియేయున్నాడు. మొదటి రాజేంద్రచోళుడు యౌవరాజ్యాభిషిక్తుడై, తండ్రితో కూడ క్రీ. శ. 1012 సం. నుండి పరిపాలన మొనరించుచుండెను. కావున నీతని మూడవసంవత్సరము క్రీ. శ. 1015 అగును. ఆ సంవత్సరమునందో, లేక అంతకు కొంతముందో రాజేంద్రచోళుడు చాళుక్యులతో యుద్ధ మొనరించెననుట స్పష్టపడుచున్నది.

ఈ సందర్భమున ఆచార్య శ్రీ నీలకంఠశాస్త్రి గారి యభిప్రాయము ఒప్పుకొనదగినదిగా లేదు. శ్రీ శాస్త్రిగారు రాజేంద్రచోళుని ఈ యుద్ధము అప్పుడు జరిగినది కాదనియు, తత్పూర్వము 1004 లో రాజరాజ చోళుడు సత్యాశ్రయ చాళుక్యునితో చేసిన యుద్ధము నే వివరముగా చెప్పుచున్నదనియు నభిప్రాయపడుచున్నారు [Colas, Vol 1. P 236]. ఈ యభిప్రాయము నే మరల తమ యుపన్యాసములలో వెల్లడించిరి. ఈ యభిప్రాయమును త్రోసివేయుటకు కారణములు—

(1) 1004 వ సంవత్సరమున జరిగిన యుద్ధమున ఎచ్చటను కొల్లిపాక ప్రస్తావము కానరాదు.

(2) పైగా కొల్లిపాకయు దాని పరిసర ప్రదేశములును ఈ కాలమున చోళులదాడికి గుఱికాలేదు. చో

ళుల దండయాత్ర మైసూరునుండి సరిగా కర్నాటకము యొక్క నడిమి దేశమునకు నడచి బిజాపురమండలమునందలి దోనూరువఱకును పోయినది.

(3) పైగా రాజరాజుశాసనములు స్థూలముగా నీతడు రట్టపాడి సప్తార్ధలక్ష దేశమును జయించెనని చెప్పుచున్నవని శ్రీ ఆచార్యులవారే వ్రాసియున్నారు [Colas, Vol 1. P 210] దోనూరు వఱకును చోళులు. కర్నాటక మధ్యమునుండి ప్రవేశించినందుననే చాళుక్యులు వేంగిని ప్రవేశించి చోళులను ఇవలికి లాగుటకు ప్రయత్నించిరని తెలియుచున్నది. సత్యాశ్రయుడు 1005 సంవత్సరమున శ్రీశైలమందుండినందు వలనను [బొంబే కర్నాటకశాసనములు I-I. 50]; 1006 వ సంవత్సరమున నాతని బ్రాహ్మణసేనాధిపతి, 'దుర్గశ్రయ మల్ల, సత్తిగసంకకాఱ' మొదలైన బిరుదములు గలవాడు, 'వాజికులకమలభానుడు' 'దన్నడయన్మదల యను రెండుగోటలుం గాల్చివచ్చి చేబ్రోలవిడిసి' యుండుటచేతను (S. I. I. VI 102); 1007 వ సంవత్సరమున, సత్యాశ్రయుని తంత్రపాలుడు అన్నపయ్య యను నాతడు నేటి వరంగల్లుదేశమును పాలించుచుండినట్లుగా నా దేశమున, వరదన్నపేటకు పోవుమార్గమున పాన్నవోలు గ్రామముకడ దొరకిన యొక శాసనముచే తెలియుటచేతను (అప్రకటితశాసనము. హైదరాబాదీయ లక్ష్మణరాయపరిశోధకమండలి వారు తీయించిన ప్రతిబింబమును నాకు దయతో చూపిన శ్రీమండలివారికి కృతజ్ఞుడను); తూర్పు కర్నాటక రాజ్యము చోళుల దాడికి లోనుకాలేదనియు, తీరాంధ్రరాజ్యమున చోళుల బలములేమిచే చాళుక్యులకు ఎత్తివచ్చుటకు అనుకూలముగానే యుండెననియు తెలియుచున్నది.

(4) రాజేంద్రచోళుడు ఈ 1004-1007 లోపల జరిగిన యుద్ధములో పాల్గొన్నది వాస్తవమని సలోత్తూరు శాసనముచే తెలియుచున్నను చోళులశాసనములలో దాని ప్రస్తావము వెనువెంటనేరాక 1015 వఱకు నిలుపబడి యుండుటయు, అతడు 1012 లోనే యువరాజైనను ఆ వెంటనే అతని ప్రతాపము చెప్పు సందర్భమున నీ విజయమును చెప్పక రెండు సంవత్సరములుండి మూడవ సంవత్సరమున చెప్పుటచేతను ఇయ్యది అప్పుడు క్రొత్తగా జరిగిన విషయముగాని పాతసంగతి కాదని నిశ్చయమగుచున్నది.

(5) కొల్లిపాక ప్రాముఖ్యతను కొంత గుర్తింపవలసియున్నది. ఆంధ్రదేశమును కొట్టుటకు కర్నాటకులకు అయ్యది సరియైన మాటుగా నుండెను. ఈ పరిస్థితి రాజరాజుకాలమున కలుగలేదు. రాజరాజు క్రీ. శ. 985-వ సంవత్సరము రాజ్యమునకు వచ్చినప్పటికిని అతని యావత్సంవత్సరము వఱకును నాతడు కర్నాటకులను తాకినట్లు కనబడదు. ఆంధ్ర రాజ్యముకై ద్రావిడకర్నాటకుల పోరు సన్నసన్నముగా నీ కాలముననే ప్రారంభమైనది. క్రీ. శ. 973 లో, తైలపుడు రాష్ట్రకూటులను జయించిన కాలమునకు సరిగా జటాచోడభీముడు దానార్ణవుని చంపి వేంగీరాజ్యమును దాదాపు ఇరువదియైదు సంవత్సరములు పరిపాలించినను ఈతనికిని తైలపునికి ఎట్టి సంబంధముండినదో తెలియదుగాని తొలుత కర్నాటక తైలపునితో యుద్ధమొనరించి కొంతరాజ్యమును (బల్లారి, అనంతపురము, మైసూరు) కైవసము చేసికొనిన పిదపనే చోళరాజరాజు వేంగీ విషయమున ప్రవేశించెను. తైలపునితో యుద్ధమొనరించినప్పుడు రాజరాజు నొలంబవాడి రాష్ట్రమున ప్రవేశించి రొద్దమను ప్రదేశమున (అనంతపురముజిల్లాలోని పెనుగొండతాలూకాలో నున్నది) చాళుక్యులతో యుద్ధమొనరింపగా చాళుక్యులు చోళులను ఓడించి క్రీ. శ. 992 లో నూటరేబది యేనుగులను అపహరించిరి (S. I. I. IX-I 77). ఈ విషయానంతరము 999-1000 సంవత్సర ప్రాంతమున చోళులు జటాచోడభీముని చంపి శక్తివర్మను వేంగీసామ్రాజ్యమున ప్రతిష్ఠించిరి. ఈ కాలముననే బహుశః విమలాదిత్యుడు చోళరాజకుమారికను వివాహమాడియుండును. ఇది మొదలు పశ్చిమ చాళుక్యులు శక్తివర్మకుగాని, విమలాదిత్యునికిగాని, రాజరాజ నరేంద్రునికిగాని ఒక నిముసమైనను తీరికలేకుండునట్లు కొట్టుచునే యుండినందువలన జటాచోడునితోడి పూర్వస్నేహమో, లేక చోళులు తమ్ముకొట్టిగదా వేంగి మీదికి నడచిరను కారణమున ద్వేషభావమో తొలుత దీనికి కారణమై తర్వాత కొండంతదైనదని తలంప

వలసియున్నది. ఏది యెట్లున్నను వేంగియందు చోళుల ప్రాబల్యము పశ్చిమ చాళుక్యులకు ఎంతమాత్రము గిట్టక పోగా తత్క్షణమే చోళులకును, చాళుక్యులకును పోరు పొసగినది. తైలపుని కుమారుడైన సత్యాశ్రయునికిని రాజరాజునకు జరిగిన ఈ యుద్ధమును గురించి తొలుదొలుత క్రీ. శ. 1008 వ సంవత్సరమునకే చోళశాసనములలో ప్రస్తావములు కనబడుచున్నవి. ఈ సందర్భమున యుద్ధములు క్రీ. శ. 1007 వ సంవత్సరము వఱకును జరిగియుండుటచే శక్తివర్మరాజ్యము సుఖవంతము కాదని స్పష్టము. పైగా చోళులు మైసూరురాజ్యము మీదినుండియే కర్నాటకమును ప్రవేశించుటకు కారణము గంగపాడియు, నొలంబపాడియు వారి స్వాధీనమందుండినవి.

ఈ పరిస్థితి సత్యాశ్రయుని కాలమువఱకును జరిగినది. క్రీ. శ. 1008 వ సంవత్సరమున సత్యాశ్రయుడు గతించినంతట ఆతని సోదరుని పుత్త్రుడు విక్రమాదిత్యుడు రాజ్యమునకు వచ్చెను. వేంగిసామ్రాజ్యమును కృష్ణాతీరముమీదుగా వచ్చి కొట్టిన యెడల చోళులు కొంత సమీపస్థితులై యుందురని తలంచియేకాబోలు చాళుక్యులు తమ ఉపాయములను మార్చిరి. ఈ మారు గోదావరికి ఎగువనువచ్చి తూర్పున మలయమును మర్దించి ఆ వెనుక విమలాదిత్యునే తరిమివేసిరి. యుద్ధరంగము పూర్వముండిన ప్రదేశములనుండి ఇతర ప్రదేశములకు వ్యాపించుటను ఈ కాలమున కనవగును. ఇట్లు చాళుక్యులు పశ్చిమమునుండి రాక ఉత్తరమునుండి వేంగి మీదికి దిగుటయు, అవైపుననున్న రాజులతో తర్వాత స్నేహము కలుపుటచేతను విమలాదిత్యుడు రాజ్యభ్రష్టుడై చని రాజేంద్రచోళదేవుని కొనివచ్చి తాను మరల రాజ్యమందు కుదురుకొనుటయేగాక చోళులను కొల్లిపాకవఱకును తనకు పశ్చిమోత్తరమున తన శత్రువులు కావించుప్రయత్నములనుభగ్నము కావించుటకును పంపియుండును. కొల్లిపాక చాళుక్యుల రాజధానీనగరములలో చాల ముఖ్యమైనది. పైగా చక్రకూట, మలయ, కళింగములకు చాళుక్యులకు ప్రస్థానారంభస్థానముగా నుండియుండుననియు తోచుచున్నది.

వీనినెల్ల పరికింపగా రాజేంద్రచోళుని తృతీయ వత్సర శాసనప్రస్తావిత యుద్ధములు విమలాదిత్యుడు తిరువయ్యారులోనుండిన కాలమునకును, ఈ తృతీయ వత్సరమునకును నడుమ జరిగిన వని తేలుచున్నది. అనగా క్రీ. శ. 1014-1015 సంవత్సరముల నడిమికాలమున జరిగియుండవలయును.

విమలాదిత్యుని బాధించిన కర్నాటక రాజెవ్వడైయుండునో తెలిసికొనుటకు కొంత యత్నము వలయును. క్రీ. శ. 1015 సంవత్సరమున చాళుక్య జయసింహుడు 'మల్లికామోద, జగదేకమల్ల' బిరుదాంచితుడు రాజ్యాధిరోహణమొనర్చెను. కాని పై యుద్ధము 1015 సంవత్సరమునకుముందే ముగియుటచేత అప్పటికింకను జయసింహుడు రాజ్యమునకు రాలేదని తలంచుటకు అవకాశము కలుగుచున్నది. చాళుక్యుల చరిత్రను పరిశోధింపగా జయసింహుని రాజ్యాధిరోహణమునకును, ఆతని జ్యేష్ఠ సోదరుడైన విక్రమాదిత్యుని మరణమునకును నడుమ కొంత అంతరాయమేర్పడినట్లు కనబడుచున్నది. విక్రమాదిత్యుని శాసనములలో దొరకిన కడపటిదాని తారీఖు శకము 936 శ్రావణమాసమునకు సరియగు జూలై 1014 సం. క్రీ. శ. [S. I. I. IX-I, 79]. కాని యీ శాసనము కొంత చెడియుండుటయేగాక ఇందు సంవత్సరము [ప్రభవాది] చెప్పబడలేదు. శకసంఖ్యలోని కడపటి 6 సందేహాస్పదముగా నున్నది. విక్రమాదిత్యుని కడపటి సరియైన తారీఖు శకము 933 పరీధావి పుష్య శుద్ధ, 13, సోమవారము ; దీనికి సరియైన క్రీ. శ. 1102 సం. డిసంబరు 29 సోమవారము [Local Records-Vol 25 p 47]. ప్రమాది ఆనందసంవత్సరములలో విక్రమాదిత్యునివిగాని, జయసింహునివిగాని శాసనములు కానరావు. జయసింహుని మొదటిశాసనము శకము 937 రాక్షస సంవత్సరమున నున్నది [E. C. VIII Sb 16]. ఈ నడిమికాలమున విక్రమాదిత్యుని యవరజుడును జయసింహుని పూర్వజుడును నైన అయ్యణయ్య పరిపాలించుచుండినట్లు కొందఱభిప్రాయపడుచున్నారు. ఈతనింగూర్చిన ప్రస్తావములు జయసింహుని కుమారుడైన ఆహవమల్ల సోమేశ్వరుని శాసనములలో గలవు

[నాగాయి శాసనములు, హైదరాబాదు పురాతత్త్వ శాఖాప్రచురము, 8 B. పంక్తి 28]. ఇందులకుప బృంహకముగ శాసనములలో నీతడు 'నృప' ననియు 'క్షితీశ్వరుడు' అనియు, మహావీరుడనియు గలదు [S.I.I. IX-I. 158 L. 11; 118, L 14; బాంబే కర్నాటక శాసనములు, 109 Of 1929-30]. కాని ఇందులకు కొంత బాధకము గలదు. ఈ అయ్యనక్షితీశ్వరుడు అతని సోదరుడైన జయసింహుని శాసనములలో నెచ్చటను కానరాడు. జయసింహుని దౌలతాబాదు తామ్రపట్టికలోగాని, మీరజ్ పట్టికలోగాని అయ్యన నామధేయము ఎందును కానరాదు. మఱి తొలుదొలుత ఈతని స్మరణము సోమేశ్వరుని శాసనములలోని వంశావళులలోనే కనబడుచున్నది. పైగా నీ అయ్యణయ్యయొక్క శాసనము లేవియు ఇంతవఱకును కనబడలేదు. తనకు సోదరుడును, తనకు ముందు రాజ్యభారము వహించిన వాడును నైనవాని నామధేయమును జయసింహుడు వదలిపెట్టుటకు ఏదో కారణముండవలయును. అయ్యణయ్య వాస్తవచారిత్రకపురుషుడే. సోమేశ్వరుని వ్రాతలను త్రోసిపుచ్చుటకు వీలులేదు; ఏలయన తన పెదతండ్రి వృత్తాంతమును అతడు చక్కగానే ఎఱిగియుండును. పైగా ఈ సోమేశ్వరశాసనోక్త నామధేయముల వరుసలో విక్రమాదిత్యుని నామానంతరము అయ్యణ నామధేయము వచ్చుటచే నీతడు విక్రముని మరణానంతరము కొంతకాలము జీవించియే యుండవలయునని యేర్పడుచున్నది. ఇందువలన తేలినదేమనగా విక్రమాదిత్యుడు కాలముచేయునాటికి జీవించియుండి తదనంతరము అనతికాలముననే పట్టాభిషేకము జరుగులోపలనే ఈతడు మృతిజెందియుండును. ఈతడు సింహాసనస్థుడైయుండిన యెడల జయసింహునిశాసనములు ఈతని నామమును వదలియుండజాలవు. కావున సోమేశ్వరుడు తన శాసనములలో పెదతండ్రిని పేర్కొనుట కేవలము రాజవంశావళిని పూర్తిచేయుటకేగాని వేఱుగాదనియు, రాజవంశీకుడు గాన నృపుడనియు, క్షితీశ్వరుడనియు పేర్కొనెననియు తలంపవలయును.

రాజుల పట్టాభిషేకములు సాధారణముగా నెల దినములలోనే జరుగుట యాచారము. చాళుక్య సోమేశ్వరుడు తుంగభద్రలో స్వయముగా మునిగి చనిపోయినప్పుడు ఉత్తర క్రియలైన వెంటనే పదునైదవ దినమునాడు (కుంభస్వీకరణ సమయమున కాబోలు) అతని కుమారుడు భువనైకమల్ల సోమేశ్వరుడు పట్టాభిషేకము చేసికొనెను. సాధారణముగ నొక రాజు పోయి మఱియొకడు పదునైదుదినములలో పట్టాభిషేకము నందకపోయిన దాని కేదో బలమైన కారణము కలదని గ్రహింపవలయును. మఱి ఈ అయ్యణయ్య ఏల రాజ్యాధిరోహణ మొనర్పలేదో, ఏ సందర్భమున మరణించెనో తెలిసికొనుటకు ఆధారములు దొరకలేదు. వేంగిదేశమందలి విషయములచేతను, చోళశాసనాదికములచేతను సరిగా విక్రమాదిత్యుడు మరణించి, అయ్యణయ్యయు గతించి జయసింహుడు రాజ్యమునకు వచ్చు సమయమునకు చోళుల రట్టపాడి దండయాత్ర సాగెనని పైన తెలియవచ్చినదానిని అనుసంధించుకొనవలయును. కావున విమలాదిత్యుని బాధించిన రాజులు ఈ ముగ్గురు కర్నాటకులని స్పష్టము. తొలుత విక్రమాదిత్యుడు, శక్తివర్మ యుండగా మలయమును 'మర్దించి' సంక్షోభమొనర్చెను. ఆ తర్వాత 1014 లో విమలాదిత్యుడు దేశత్యాగియైనందున విక్రమాదిత్యుడే అందులకు కారణమని యూహించుట సమంజసముగానున్నది. చోళులు విమలాదిత్యుని పునః స్థాపితుం జేయుటకు వచ్చినప్పుడు అయ్యణయు, జయసింహుడును ఎదిర్చియుందురు. సాధారణముగ ఒకరాజు మరణించి మఱియొకడు సింహాసనమునకు వచ్చులోపల శత్రువుమీదికి దండెత్తవలయునని నీతిశాస్త్రము. ఈ సందర్భమున అయ్యన గతింపగా జయసింహుడు రాజైయుండును.

విమలాదిత్యుని వేంగియందు పదిలపఱచుటకు చోళరాజు గొప్ప యత్నమే చేయవలసియుండెను. చాళుక్యులను యుద్ధమునందు ఓడించుటతో చాలదు. కొంతకాలమైనను విమలాదిత్యుడు బాధపడక తన పీట నుండవలయునేని చాళుక్యులమీద పెద్ద దెబ్బయే తీయవలసియుండెను. ఈ సందర్భమున కొంత అట్టి పనియే జరిగినట్లు తెలియుచున్నది. కల్యాణచాళుక్యులశాసనములను పరికింపగా విక్రమాదిత్యుని మరణానంతరము దేశోపద్రవము ఏర్పడి జయసింహుని అతని మంత్రులు

కొంత కష్టముమీద రాజ్యమందు నిలిపినట్లు తెలియుచున్నది. ధార్వాడజిల్లా గదగు తాలూకాలో దొరకిన యొక పగిలిపోయినశాసనమున కేశవరాజను దండనాయకుడును, అతని కుమారుడు మాధవరాజదండనాయకుడును గోదావరీతీరమందును కొంకణదేశమందును యుద్ధమొనరించి తైలపదేవుని సంతోషపరిచినట్లును, మాధవరాజు గుజ్జుపుదండును చోళులమీదికి నడిపి సింగనృపతి యొక్క మెప్పును పడసినట్లును, అతడే ఒకానొకనిని విక్రమాదిత్యుని సింహాసనమందు నివేశింపజేసినట్లును కలదు [బొంబే కర్నాటక శాసనసంపుటి I I. 72]. ఇందు తైలపదేవుడు ఈ కల్యాణీ చాళుక్యశాఖాపునరుద్ధారకుడు, ఆహవమల్ల నూర్మడి తైలపదేవుడు; సాధారణముగా చరిత్రగ్రంథములయందు పేర్కొనబడు ఇమ్మడి తైలపదేవుడు, రొద్దముకడ రాజరాజును ఓడించినవాడు. విక్రమాదిత్యుడు జ య సిం హు ని అన్నయే. సింగనృపతి జయసింగనృపతియనుటకు సంగ్రహీతశబ్దము. ఈ శాసనము చాలచోట్ల పగిలిపోయియున్నను పై విషయములు మాత్రము చక్కగానే కనబడుచున్నవి. మఱియు విక్రమాదిత్యుని సింహాసనమునకు ఎక్కింపబడిన యీ రాజునుగుఱించి వాక్యములివి. పంక్తి. "...క్రమాదిత్యన విదితం రాజ్య విధూతియొళె నిలిసి తత్పాదాబ్జద..." దీనియర్థము—"విక్రమాదిత్యుని [యొక్క] విదితమైన రాజ్యైశ్వర్యమందు నిలిపి అతని పాదాబ్జముయొక్క" అని. ఎవనిని నిలిపెనో చెప్పునట్టి భాగము పగిలిపోయినది. ఇది గ్రంథాంతర సంవాదముచేతగాని తెలియదు. మఱియొక శాసనమందు కుందమరాజను మహాప్రచండ దండనాయకుడు చేసిన యుద్ధములిట్లు వర్ణింపబడియున్నవి- "...చారుచాలుక్యరాజ్యస్థిర లక్ష్మీరక్షకం, కోసళకుళకులిశం... చోళకాళాశని, మళెయమహీమర్దనం కుందరాజం" [బొంబే కర్నాటక శాసనములు 124 of 1932-33]. మఱియొక శాసనమం దీతనికి 'కటకదగోవ' యనియొక బిరుదము కనబడుచున్నది [E. C. VII SK 125] ఈ బిరుదములచే నీతడు మనోహరమైన చాళుక్యరాజ్య స్థిరలక్ష్మిని రక్షించినవాడనియు, కోసలులకు పిడుగువంటివాడనియు, చోళులకును నల్లని అశని పాతమువంటివాడనియు, మలయ భూమిని మర్దించినవాడనియు తెలియుచున్నది. వీనికెల్ల మకుటాయమానమైనది 'కటకదగోవ' యనునది. కటకమనగా రాజధానీ నగరము; రక్షకుడని యర్థము. నాటికటకము మాన్యఖేటము. దీనినే చోళులు మన్నైక్కడక్కమ్ అని పేర్కొనిరి. మాన్యఖేట నగరమును చోళులు ముట్టడించినప్పుడు కుందరాజు దానిని కాపాడినందుచేత నీ బిరుదమును వహించియుండవలెను. కావుననే చాళుక్యరాజ్య స్థిరలక్ష్మీరక్షకుడాయెను. ఈ శాసనమందే మఱియొకచోట నొక కన్నడపద్యము జయసింహుని సింహాసనారోహణమును గూర్చి యిట్లు వర్ణించుచున్నది.—

పసరిసిపర్బిఱగొందళిసి నిందతమస్తమమం తెరల్చి బం
దొసెదినసేకవంకుదయపర్బతమం కలికాలదేగ్గెయం
దెసెగిడె తూళ్దితాళ్ది క్రితలక్ష్మియ నొళ్పినతెళ్పుగళ్ జగ
క్కె సెదిరెసింఘవిష్టరమ నేరిదనా జయసింఘవల్లభం.

దీనిభావము—"సర్వత్ర ప్రసరించి పర్వియున్న చీకటులను పాఱద్రోలి తన ప్రభావమును తెలుపుచు ఉదయపర్వతమును సూర్యుడు ఆరోహించువిధమున కలియుగముయొక్క పాపవృద్ధిని ఖండించి దానికి నిలువరము లేక చేసి, ప్రపంచమునకు కృతయుగ లక్ష్మియొక్క సుగుణసంపత్తిని ప్రకటించుచు, జయసింహవల్లభుడు తన సింహాసనము నధిరోహించెను." ఈ విషయము క్రీ. శ. 1019 సంవత్సరమున నీతని పట్టాభిషేకమునకు నాలుగు సంవత్సరముల యనంతరము చెప్పబడియున్నను ఆతని రాజ్యాధిరోహణముం గూర్చి చెప్పుటచే ప్రస్తుతోపయోగియే.

ఈ యుద్ధారములచే తెలియవచ్చున దేమనగా చోళరాజు కర్నాటకముపై దండయాత్ర సాగించుకాలమునకు సరిగానో, లేక కొంతముందో కోసలులు చాళుక్యుల మీదికి దాడి వెడలిరని తెలియుచున్నది. లేక చాళుక్యులే కోసలముపైకి వెడలినవారై యుండవచ్చును. క్రీ. శ. 1014-1015 కు నడుమ చోళదండయాత్ర సాగినందునను, విక్రమాదిత్యుడు కోసల దండయాత్ర నాటికి జీవించియుండినందునను ఇది తత్పూర్వవిషయముగానే గ్రహింపదగును.

ఈ కోసలులెవరు ? కోసలరాజ్యము కర్నాటక రాజ్యమునకు ప్రాగుదగ్దిశలో గోదావరీనదికి చాల ఎగువను ఉత్తరదక్షిణ భారతములకు చేరినదిగానున్నది. చేదీశుడైన మొదటి కోక్కలుని కుమారులు ప్రథమేతరులైన పదునేడుగురలో నొకడు కళింగరాజను వాడు పదునొకండవ శతాబ్దారంభకాలమున తుమ్మాణ దేశమును జయించి అచట తన యధికారమును నెలకొల్పినట్లు తెలియుచున్నది [Dynastic History of Northern India by, Prof. H. C. Ray Vol II p 802]. మఱియొక రాజపుత్త్రికుడు, లక్ష్మణరాజను నతడు, కాలచూర్య వంశీకుడైన త్రిపురీనగరాధీశుడు యువరాజదేవుని కుమారుడు క్రీ. శ. 1010 సం. ప్రాంతమున నొక కోసలనాథుని నిర్జించినట్లు చెప్పుకొని యున్నాడు [అదే పుట 471]. ఈ రెంటిని జూచి పై యిరువురు చేదిరాజకుమారులు తమ పెద్దల యధికారమును కోసలమందు నెలకొల్పినట్లు తలచియున్నారు. ఏది ఎట్లున్నను కోసల రాజ్యము చేదిరాజుల స్వాధీనమై ఆ వంశీకుల యువరాజశాఖ యొకటి అచట వర్ధిల్లినది. తర్వాత జయసింహునితో చేదీశుఁడైన గాంగేయదేవుఁడు యుద్ధ మొనరించినందుచేత నీ కాలమున చాళుక్యులకు శత్రువులైన కోసలరాజు బహుశః కళింగరాజై యుండును.

మఱి విశేష మేమనఁగా నీ కోసలయుద్ధమును (చాళుక్యుల దండయాత్రయు), చోళులయుద్ధమును చాలవరకు, కొన్ని నెలల వ్యత్యాసముచేతనే, సమకాలికములుగాను పరస్పర సంబంధముగలవిగా నున్నవి. చాళుక్యులకును చోళులకును ఏర్పడిన స్పర్ధలు క్రమముగా రగులుచు ఒకరి నొకరు కొట్టుకొనుట కవకాశములు వెదకుచుండిన కాలమున చాళుక్యులు కోసలులతో యుద్ధ మొనరించుచుండిన కాలము సరియైన పాదను కాగా దండయాత్ర వెడలి, చోళరాజు వేంగియందు విమలాదిత్యుని ప్రతిష్ఠించి వెంటనే అచటనుండి బయలుదేరి మాన్యఖేటముమీదికి దాడివెడలి దానిని జయించి కొల్లిపాకకునుపోయి తుదకు కుందమరాజ మాధవరాజాదులు తరుమగా వెనుదిరిగిపోయెనని తలంపవలయును. ఈ విధముగా నిశ్సైన్యములతో నిరువాగుల యుద్ధము చాళుక్యులకు చాలకష్టముగా నుండియుండును. అట్టి సన్నివేశమున విక్రమాదిత్యుడు కోసలదండయాత్రానంతరము గతింపగా, అయ్యనయ్య బ్రతికియుండి ఇంతలో చోళదండయాత్రారంభమున నెప్పుడో గతింపగా, చాళుక్యుల కులక్రమాగతులైన దండనాయకులు తమ పరాక్రమమును చూపి జయసింహుని రాజ్యాభిషిక్తునింజేసి చోళులను తఱుము గొట్టిరి. చోళులును విమలాదిత్యుడు రాజై మరల వేంగియందు నెలకొన్నదే చాలునని తలంచి, ఇంతయుద్ధమైన తర్వాత కొంత కాలమువఱకైనను వేంగికి భయము లేదని తలంచి తన దేశమునకు వెడలిపోయియుండును. విమలాదిత్యుడును క్రీ. శ. 1018 వఱకును రాజ్యమును పాలించి తన కుమారులైన రాజరాజనరేంద్ర విష్ణువర్ధన విజయాదిత్యులకు యావజ్జీవమును జగడమాడుటకు తగిన పరిస్థితిగల రాజ్యమును ఆస్తిగా వదలిపోయెను.



# అశాంతి

•

— శ్రీ సుందరాచారి —

సరసిజబాంధవుం డపరశయ్యను వ్రాల డిదేమి యింక ? నా
శిరమును వేల్చుచుండె నను చింతలతో పగలెల్ల ద్రోచి, రా
దరిసిన చీకటుల్ మరల, తాపములో పడిపోయి, వేగుకై
త్వరపడుచున్న నా బ్రతుకుభావములో గల కామ మేమిటో !

పగలెల్లఁ బనిపాటులో దగిలి, పాపం బెంతగా డస్సెనో
జగ మీరేతిరి రాణికౌగిళుల వాసంబంది నిద్రించె, నా
వగ లెంతైనను దానికేమి ?-దిగులా, భారంబ ? ఈజన్మలో
నగినా, యేడ్చిన నాకు నేనె యని-నే నానాడె నిట్టూర్చితిన్.

పరచెను చిమ్మచీకటులు, ప్రాణి యొకండును కొట్టి లేపినా
తెరువడు కళ్లు ; మేల్కొనవు తెమ్మెరపిల్లలుకూడ ; చెట్లలో
మురమురపాటు లేదు ; చలమూని నిశీథము నేలు గూబయే
తెరచిన కళ్లలో కొరవిదీపము లెత్తెను నాకు తోడుగా.

రెప్పలు వాల్చనీక, చెలరేగుచు, చీకటిచెల్మికల్మిలో
నిప్పుల నూది, వెల్గు కననీయక, ధూమము చుట్టుముట్టగా
కప్పుచునున్న-ఈ కలితగర్భములో గల మర్మ మేమిటో
చెప్పగలేను నేను : ఎద చీలుచునున్నది యింతలింతలై.

కమ్మని చందమామ తెగగాచిన వేళల ; సన్నజాజిపూ
రెమ్మల కమ్మతావి బిగి ప్రీతిమెయిన్ నను పిల్చువేళ ; లే
లెమ్మని పాడు చిన్నిగిల లెంతగ వేడినగాని-నిద్ర నా
కమ్మనకున్న మిన్నయని కన్నులు మూసితి మొన్న మొన్న నే.






[నాటకం]

= శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి =

ఈ నాటకంలో పాత్రలు:—

రాఘవయ్య—ప్లీడరుగారు

రాజారావు—ప్లీడరుగారి కొడుకు. కొత్తగా ప్లీడరుపనిలో ప్రవేశించాడు.

రామయ్య—ప్లీడరుగారి పెద్దగుమాస్తా.

మోహనరావు—ప్లీడరుగారి మూడోగుమాస్తా.

ఫిర్యాదితరఫు ప్లీడరు, ముద్దాయితరఫు ప్లీడరు, జడ్జీగారు, కోర్టుగుమాస్తా, కోర్టుబంట్రోతు, జూరీమనుష్యులు, జైలుసూపరింటెండెంట్, హెడ్‌వార్డరు, ఒకరిద్దరు వార్డర్లు.

వెంకడు—ఓ ఖైదీ.

సుందరమ్మ—మోహనరావు ప్రేమించిన స్త్రీ.

## మొదటి అంకం

[ప్లీడరుగారి ఆఫీసు. స్టేజిమీదికి కనిపిస్తున్న గదిలో పెద్ద గుమాస్తా రామయ్య కూచుని వ్రాసుకుంటూవుంటాడు. ఈ గది నించి రెండు ద్వారాలు కనిపిస్తాయి. ఒకటి ప్లీడరుగారి గదికి; రెండోది చిన్నగుమాస్తాలు కూచునే గదికి]

(సుందరమ్మ ప్రవేశిస్తుంది. రామయ్య తలెత్తకుండా వ్రాసుకుంటూవుంటాడు)

సుందరమ్మ—దండాలండి.

రామయ్య—(కళ్ళజోడుమీదినించి పరికించి చూస్తూ) ఏవూరు మనది?

* ఈ నాటకానికి గాల్స్‌వర్దీ వ్రాసిన "జస్టిస్" అన్న నాటకం చాలావరకు ఆధారం.—సో. య. శాస్త్రి.

సుంద—మోహనరావుగా రున్నారండి!

రామ—ఇంకా రాలేదు. పనేదైనా వుంటే నాతో చెప్పొచ్చు.

సుంద—ఏమీ లేదులెండి. సొంత వ్యవహారం.

రామ—టట్ టట్. సొంతవ్యవహారాలు మాట్లాడుకోడంకోసం ఆఫీసుకొస్తే ఎలా? చాలా పనితొందరలో వున్నాము. అసలతను సరిగా వేళకి రాడు. తరవాత సొంత వ్యవహారాలు పెట్టుకు కూచుంటే ఎలా నడుస్తుంది! అవన్నీ ఇంటిదగ్గిర కానిచ్చుకో కూడదూ!

సుంద—ఇంటిదగ్గిర లేరండీ!

రామ—ఇంటిదగ్గిరా లేక, ఆఫీసుకీ రాక ఏం చేస్తున్నట్టు!

సుంద—నన్నేం చెయ్యమంటారండి?

రామ—బాగుంది! అది నేనేం చెప్పను?

సుంద—చాలా తొందరవ్యవహారమండి.

రామ—అతనిక్కడ లేండే! నాతో చెప్పనంటావాయిరి, మరి, నన్నేం చెయ్యమంటావమ్మా?

సుంద—వచ్చేదాకా కూచుంటాలెండి.

రామ—అదోటా!

సుంద—(కన్నీళ్లు తుడుచుకుంటూ) కనికరించాలి. నాప్రాణం రక్షిస్తారు.

రామ—(తెల్లబోయి) ప్రాణం రక్షించడమేమిటి?

(ఒక్కనిమిషం నిశ్శబ్దం. మోహనరావు ప్రవేశిస్తాడు)

రామ—అమ్మయ్య! అతనే వొచ్చాడు. త్వరగా తేల్చేసుకోండి. ఈ వ్యవహారం నాకేం నచ్చలేదు. ప్లీడరుగారు అసలే చండశాసనుడు. ఇలాంటివి కంటపడ్డాయంటే రుద్రుడయిపోతాడు.

(కట్టపట్టుకుని యజమాని గదిలోకి వెళిపోతాడు.)

సుంద—(సన్నని గొంతుకతో) మళ్లీ తాగుడు మొదలెట్టాడు. రాత్రి నాగొంతు నులిమి చంపెయ్యడానికి ప్రయత్నించాడు. ఆయన నిద్దర లేవకముందే, పిల్లలతో బయటపడివొచ్చేశాను. మీ యింటికి వెళితే నువ్వు కనిపించలేదు. అందుచేత ఆఫీసుకే వొచ్చాను.

మోహ—నే యిల్లు మార్చేశాను.

సుంద—రాత్రి మన ప్రయాణ ముందా?

మోహ—ఓ. టిక్కెట్లు కొనేశాను. పదకొండు గంటలకి స్టేషనుదగ్గిర కలుసుకో. మన వివాహం ఇదివరకే జరిగిందని మాత్రం మరిచిపోకు.

సుంద—వెళ్లడానికి భయపడ్డం లేదుకదా!

మోహ—మీ సామానంతా సిద్ధంగా వుందా?

సుంద—ఎక్కడ నిద్దరలేచిపోతాడో అన్న భయంచేత అన్నీ అక్కడే వొదిలేశాను. తిరిగి ఇంటి చుట్టుపక్కలకి వెళ్ల లేదు.

మోహ—(దెబ్బతిన్నట్టు) అంతసొమ్మూ వృథా అయిపోయినట్టే! ఎంత కావాలిప్పుడు?

సుంద—పది హేను రూపాయలు చాలనుకుంటా!

మోహ—మనం ఎక్కడికి వెళుతున్నామో మాత్రం ఎవరికీ తెలియనివ్వకు. అక్కడికి వెళ్లినతరవాత మన కష్టాలన్నీ మరిచిపోగలం.

సుంద—నీకు కష్టంగా వుంటే చెప్పు. నీకు కష్టం కలిగించడంకంటె నేను ఇక్కడే వుండిపోయి ఈ రాక్షసుడి చేతుల్లో చచ్చిపోవడమే మంచిది.

మోహ—మనం వెళ్లితీరాలి. ఏమైతే అదవుతుంది. నువ్వు నాతో వుంటావుకదా!

సుంద—ఇప్పుడైనా ఫరవాలేదు. నువ్వు అంటే చాలు. మించిపోయింది లేదు.

మోహ—కావలసినంత మించి పోయింది. (జేబులోనించి డబ్బు తీసియిస్తూ) యిదుగో పదిహేను రూపాయలు. స్టేషనుకి పదకొండుగంటలకి రావడం మాత్రం మరిచిపోకు. సుందరీ! (అని ఉద్రేకంతో కౌగలించుకుంటాడు. ఇంతలో రామయ్యగారు రావడం చూసి విడిపోతారు. రామయ్య తాపీగా కుర్చీమీద కూచుని—)

రామ—నచ్చలేదు వ్యవహారం!

మోహ—మళ్లీ ఇలాంటిది జరగదండి.

రామ—ఆఫీసులోనే!

(మోహనరావు జవాబివ్వలేదు)

అర్థమయిందా! ఏదో దుఃఖంలో వున్నట్టు కనిపించడంవల్ల ఈమాటుకి కనికరించాను. (డ్రాయరు లాగి, ఓపుస్తకం బయటికి తీసి) ఇది చదువు. "పరిశుద్ధ జీవనము" అని చాలా బాగా రాశారు.

మోహ—కృతజ్ఞుణ్ణి!

రామ—ఇగో చూడు! సుబ్బారావు వొదిలి వెళ్లిన పని పూర్తిచేశావా?

మోహ—రేపటితో పూర్తవుతుంది.

రామ—అప్పుడే వారమయింది, అతను వెళ్లి. సాంఘికవ్యవహారాల్లో ఆఫీసుపని అశ్రద్ధ అయిపోతోంది. ఇలా అయితే ఇక జరగదుసుమా! ఇక్కడికి ఆవి జొచ్చినట్టు చెప్పననుకో...కాని.

మోహ—చాలా కృతజ్ఞుణ్ణి. (లోపలికి వెళిపోతాడు)

(రాజారావు లోపలి కొస్తాడు. ఇరవైఎనిమిదేళ్లుంటాయి. కులాసాగా జీవితం గడిపేద్దామని ప్రయత్నం చేసే మనిషి)

రాజా— ఏం రామయ్యగారూ! అంతా కుశలమా?

రామ—ఆc.

రాజా—నా న్నొచ్చాడా?

రామ—ఏడుగంటలనించీ ఇక్కడే వున్నారు.

రాజా—ఎగ్జిబిషన్ చూడ్డానికి వెళ్లా!

రామ—అలాగండీ! సరేగాని, ఈ కవులుకాగితాలు పార్టీకి పంపించమంటావా?

రాజా—నాన్న ఏమన్నాడు?

రామ—ఈ మాత్రందానికి ఆయన్ని బాధ పెట్టడం ఎందుకు?

రాజా—మనం అజాగ్రత్తగా వుండకూడదు.

రామ—అతిస్వల్పవిషయం. ఫీజైనా గిట్టదు. నువ్వు చేసిపారేద్దూ.

రాజా—నాన్నదగ్గిరికే పంపిద్దూ. నా నెత్తిమీ దెందుకీబాధ్యత?

రామ—నీయిష్టం. మరి ఇది...ఇంటికేగాదా! కాగితాలు రాయడం పూర్తయిపోయింది.

రాజా—నాకు తెలుసు. అందులో ఆకాస్త స్థలం చేర్చకుండా ఉంటేనే మంచిదని నా అభిప్రాయం.

రామ—దాన్నిగురించి నువ్వు గొడవపడనక్కర్లేదు. మనం ఏది చేసినా "లా" మనపక్షం చూసుకునే చేస్తాం మీనాన్న అవునంటే, కాదనడానికి జడ్జీకన్నా ధైర్యముందా?

(అంటూవుండగా రాఘవయ్యగారు లోపలి కొస్తారు. అరవయ్యేళ్లుంటాయి. తెల్లమీసాలు. నడకలో, మాటలో రాజసీవి స్ఫురిస్తూ వుంటుంది.)

రామ—నే ఇప్పుడే ఈ కాగితాలు మోహన రావుచేత సాపురాయించి తీసుకొస్తా. (అని లోపలికి వెళతాడు)

రాజా—ఇంటి కేగాదా...

రాఘ—గ్రంథం నడిపించవలసిందే... నువ్వు మనకి బాంకులో నాలుగువొందలకిపైగా వుందని చెప్పినట్టు జ్ఞాపకం!

రాజా—అవునా!

రాఘ—మూడువందల యాభయ్యొకటే లెక్కతేల్తోంది?...ఈమధ్య కొత్తచెక్కు లేమీ లేవు. చెక్కుబుక్కు ఇలా తీసుకురా...(రాజారావు చెక్కుబుక్కు తీసుకొస్తాడు.) చదువుతాను, సరిచూడు. అయిదు. యాభైనాలుగు. ఏడు. అయిదు. ఇరవై ఎనిమిది. ఇరవై. తొంభై. పదకొండు. యాభై రెండు. డెభ్భైఒకటి . . సరిగ్గా ఉన్నాయా?

రాజా—అర్థమవడం లేదు. నాలుగువొందలకి పైగా వున్నట్టు నాకు బాగా తెలుసు.

రాఘ—ఇలా తే. (అని పుస్తకం తిరగవేసి చూస్తూ) ఈతొంభైరూపాయల చెక్కేమిటి?

రాజా—ఎవరు వ్రాసింది?

రాఘ—నువ్వే.

రాజా—(పుస్తకం పుచ్చుకుని చూస్తూ) ముఫ్పై ఏడు...గోవిందంగారి ఇంటికి వెళ్లిన రోజు. క్రితం

శుక్రవారం వెళ్లి మంగళవారం తిరిగొచ్చాను. జ్ఞాపకముందా? కాని, నాన్నా... నే తీసుకున్నది తొమ్మిది రూపాయలే. సరిగ్గా నాకర్చులకి సరిపోయింది. ఇంటికొచ్చేటప్పటికి అర్ధణా మిగిలింది.

రాఘ—ఆ చెక్కు చూడనీ...(పుస్తకం పుచ్చుకు తిరిగేస్తూ) సరిగ్గానే వున్నట్టుందే? ఆరోజున సొమ్ము తీసుకొచ్చిం దెవరు?

రాజా—(జ్ఞాపకం చేసుకుంటూ) ఆరోజున... రెడ్డిగారి విల్లు...నకలురాస్తున్నాను...ఓ.. రామయ్య కిచ్చాను చెక్కు, సొమ్ము తెమ్మని.

రాఘ—ఈఅక్షరాలు జాగర్తగా చూడు. దస్తూరీ నీదేనా?

రాజా—రాత నాదానిలాగే వుంది చూడ్డానికి. (పరికించిచూసి) నా అక్షరాలు కొంచెం వెనక్కి తిరుగుతాయి. ఇవి ముందుకి తోసుకొస్తున్నట్టున్నాయి. నే తొమ్మిది రాస్తే, ఎవరో తొంభైకింద దిద్దినట్టుంది.

(రామయ్య గదిలోకొస్తాడు)

రాఘ—అతన్నే అడుగు లేపరి! చూశు. రాజారావుకి చెక్కు మార్చి సొమ్ము తీసుకురావడం జ్ఞాపకముందా? కిందటి శుక్రవారం.

రామ—(తడుముకోకుండా) ఆ. తొమ్మిది రూపాయలు.

రాఘ—ఇది చూడు. (అని చెక్కుబుక్కు అందిస్తాడు).

రామ—ఊహుఁ. తొమ్మిదిరూపాయలే. అప్పుడే ఫలహారం తెప్పించుకున్నా. ఫలహారం వేడిగా ఉంటేనే నాకిష్టం. చెక్కు సుబ్బారావు కిచ్చి సొమ్ము తీసుకురమ్మన్నా! తీసుకొచ్చాడు, అన్నీ రూపాయి నోట్లే. జ్ఞాపకముందా! జట్కావాడి కివ్వడానికి మళ్లీ చిల్లర మార్చవలసొచ్చింది. నన్ను చూడనివ్వండి. తప్పు చెక్కు తీసినట్టుంది.

రాజా—ఊహూ.

రామ—తమాషాగా వుందే మరి!

రాఘ—నువ్వు సుబ్బారావు కిచ్చావు. సుబ్బారావు సోమవారంనాడు రంగూన్ వెళ్లిపోయాడు. తెలిసిందా సంగతి!

రామ—(మనస్సు చివుక్కుమనగా) అలా అయితే నేరం జరిగిందన్నమాట. అబ్బెబ్బే! మన ఆఫీసులో నేరాలేమీ జరగవే...

రాజా—అలా అయితే బాగానే వుండును!

రామ—నే నిక్కడున్న ఇరవైతొమ్మిదేళ్లలోనూ అలాంటి దెప్పుడూ జరగలేదుకదా!

రాఘ—చాలా తెలివితేటలతో చేశాడు పని. అంకెలు వ్రాసినతరవాత జాగా విడిచిపెట్టకూడదని ఇది నీకు పాఠం. తెలిసిందా!

రాజా—అవునూ.. అప్పుడు చాలా తొందరలో వున్నా...

రామ—(మొహం చిన్న బుచ్చుకుని) ఏమిటో నామనస్సంతా పాడయిపోయింది.

రాఘ—కౌంటర్ ఫాయిల్ కూడా మార్చాడు. చాలా ఆలోచించి చేసిన పని. సుబ్బారావు వెళ్లిన ఓడ పేరు?

రామ—'సిటీ ఆఫ్ రంగూన్'.

రాఘ—టెలిగ్రామిచ్చి, రంగూను చేరగానే అరెస్టుచేయించాలి. ఇంకా చేరివుండడు.

రామ—వాడి కుటుంబంగతి! వాణ్ణి చూస్తే నాకు చాలా ఇష్టంగా వుండేదికూడా! శ్రీరామచంద్రా! పైగా ఈ ఆఫీసులో!!

రాజా—బాంకుకుమాస్తాని కనుక్కోనా?

రాఘ—ఇక్కడికి కోమాటు తీసుకురా. పోలీసుకి కబురుచెయ్యి.

రాజా—పోలీసుకే!.. (అని బయటికి వెళిపోతాడు)

రాఘ—సత్ప్రవర్తనవల్ల ప్రయోజనం ఉందంటావా, లేదంటావా?

రామ—మీఉద్దేశం తిన్నగా బోధపడటం లేదు.

రాఘ—నిన్ను తిన్నగా ఎరగనివాళ్లకి నీకథ కట్టుకథలా వుంటుంది. ఏం?

రామ—అవునన్కోండి. (అని చిరునవ్వు నవ్వు తాడు. హఠాత్తుగా విచారపు మొహం పెట్టి) నాకు చాలా కష్టంగా వుందనుకోండి... నా కన్నకొడుకే ఇలాటిపని చేశాడా అనిపిస్తోంది.

రాఘ—ఛండాలంపని. ఏం?

రామ—కలత పెట్టేస్తుంది. అంతా సక్రమంగా నడుస్తూవుంటే ఇలాటి దేదో జరుగుతుంది. ఇవాళ నాకు టిఫీ నేం సయిస్తుంది మరి!

రాఘ—అంత కష్టంగా వుందీ!

రామ—ఇలాటి దేదన్నా జరిగితే, ఆరో జంతా భగవధ్యానం చేస్తేగాని నామనసు కుదుటపడ దనుకోండి. శంభో, మహాదేవ, శంకరా, దీనదయాళో ...(రహస్యం చెబుతున్నట్టు) వాడి కేదో ఆపుకోలేని దురాశ కలిగుండాలి.

రాఘ—అప్పుడే అనెయ్యకు! అతనే నేరంచేసి నట్టు నిర్ధారణకాలేదే...

రామ—ఇలాటిది చెయ్యనేమా... కావాలంటే, మా మైత్రుకో కూడనూ! నాదో నెలజీతం పారేద్దును. శంభోశంకరా...

రాఘ—గుమాస్తా రాగానే కబురుచెయ్యి...

రామ— ...దీనదయాళో ... జగద్రక్షకా... (సుందరమ్మ లోపలికొస్తుంది) మళ్ళీ తయారయావూ, అసలే గొడవల్లో పడిచస్తూవుంటే... ఇప్పు డెవర్ని చూడ్డానికి వీల్లేదు.

సుంద—ఒక్క నిమిష మేనండి.

రామ—పెళ్ళి కమ్మ చెబుతూవుంటేను... ఒక్కనిమిషం లేదు, అరనిమిషం లేదు.

సుంద—మరెలాగండి! చూసితీరాలి.

రామ—పీకలమీది కొచ్చిందిరా బాబూ! "గురువులరాక, దాసీమృతి" అన్నట్టు... చంపక అలా పయిన గేటుదగ్గిర కాసుకుకూచోవమ్మా... బయటకొచ్చి నప్పుడు పట్టుకుందువుగాని... (సుందరి వెళిపోతుంది.) శంభో శంకరా... ఇదెక్కడి లంపటం సంపాదించుకు న్నానంట, ఈ మోహనరావు! ...దీనదయాళో...

(బాంకు గుమాస్తా, రాజారావు లోపలికొస్తారు)

రామ—మీ నాన్న లోపలున్నారు... (రాజా రావు లోపలికి వెళిపోతాడు) (గుమాస్తాతో) కూచోండి. అనవసరంగా మిమ్మల్ని బాధపెడుతున్నాం...

గుమా—నాకు ఆ చెక్కు బాగా జ్ఞాపకముంది అంతా సరిగ్గా ఉన్నట్టే కనిపించింది.

రామ—నాశారా! కాలం మంచిది గాక పోతే అలా చెడుబుద్ధులు పుట్టుకొస్తూవుంటా యను కోండి...

గుమా—అవునవును.

రామ—(రాఘవయ్యగారి గదికేసి చూస్తూ) చిన్నవాడే అనుకోండి....ఇదివరకు చాలామాట్లు చెప్పాను. చెక్కు రాయడంలో జాగ్రత్తగా వుండాలి, అంకెలతరవాత జాగా విడిచిపెట్టకూడదని. అయినా ఏమన్నా లక్ష్యముంటేనా!

గుమా—మొహం గుర్తుపట్టగల ననుకుంటా. చిన్నవాడే...

రామ—మీ కిప్పుడు అతన్ని చూపించలేము బహుశా!

(రాఘవయ్య, రాజారావు గదిలోనించి పైకొస్తారు)

రాఘ—చన్నా, మా అబ్బాయినీ, రామయ్యనీ చూశారు. మాలో ఎవరూ కాదుకదా!

గుమా—(నవ్వుతో, తలూపుతో) అబ్బే, కాదండి.

రాఘ—(రామయ్యతో) మోహనరావుని పిలు.

రామ—అనవసరంగా అతనెందుకండీ. అసలే భయస్థుడు. అందులో ఈమధ్య...

రాఘ—అలా అంటే ఎలా! సందేహనివారణ చేసుకోడం అతనికే మంచిది! ఈ వ్యవహారం అంతు కనిపెట్టాలిగదా, ఎలాగాను.

రామ—అవుననుకోండి...(అని నీళ్లు నములు తాడు)

రాఘ—ఊఁ, పిలు...

రామ—(ఇహ చేసేదేమీ లేక) ...మోహన్ రావ్! ఆ కవులు కాగితాలు ఇలా తీసుకురా, ఓమాటు!

మోహ— (లోపలినించి) వొస్తున్నా. (అని కాగితాలకట్ట తీసుకొచ్చి రామయ్యగారిచేతికిస్తాడు.)

రామ - సరే. ఆ మిగిలిన పనికూడా త్వరగా పూర్తిచేసెయ్యి!

(మోహనరావు లోపలికి వెళిపోతాడు)

(రాఘవయ్య గుమాస్తాకేసి చూస్తే గుమాస్తా 'ఇతనే' అని తలూపుతాడు)

రాఘు—నిజం. మనం అనకున్నది కాకే యిది!

గుమా—నిశ్చయంగా. నన్ను గుర్తుపట్టాడు. పారిపోడుకదా!

రామ—వెళ్లాలంటే, మనముందునించే వెళ్లాలి. మరోదారి లేదులెండి. (అని మొహం చాలా విచారంగా పెట్టేస్తాడు)

(తలుపు తీసుకొని మోహనరావు బయటికొస్తాడు.)

రాఘు—ఎక్కడికి!

మోహ—ఇప్పుడే వొస్తా.

రాఘు—ఒక్క రెండునిమిషాలుండు. ఈ కవులువిషయం మాట్లాడాలి.

మోహ—అలాగే. (అని తిరిగి గదిలోకి వెళిపోతాడు)

గుమా—సొమ్ము పట్టుకెళ్లింది ఇతనేనని, అవసరమైతే, ప్రమాణంచేసి చెప్పగలను. ఆరోజున నే టిఫినుకి వెళ్లకముందు ఇచ్చిన ఆఖరిచెక్కది. బాగా జ్ఞాపకముంది. నే వెళ్లొస్తా. కావలసినప్పుడు కబురు పంపించండి. (అని వెళ్లిపోతాడు.)

రాజా—ఏం చేద్దా మిప్పుడు!

రాఘు—మోహనరావుని రమ్మను...ఆ చెక్కుబుక్కు నాచేతికియ్యి!

రామ—తలా తోకా తెలీడంలేదు... సుబ్బారావు చేశాడనకున్నాంగా!

రాఘు—చూద్దాం!

రాజా—కాన్నా! ఒక్కనిమిషం. బాగా ఆలోచించావా?

రాఘు—రమ్మను లోపలికి!

రామ—(గదిదగ్గరకి వెళ్లి) ఒకమాటు ఇలా రా.

మోహ—(వస్తూ) ఏం?

రాఘు—(హఠాత్తుగా అతనివైపు తిరిగి) ఈ చెక్కు నీకు గుర్తుందా?

మోహ—గుర్తులేదండి!

రాఘు—తిన్నగా చూడు. జ్ఞాపకం తెచ్చుకో ...కిందటి శుక్రవారం మార్చావు.

మోహ—అదా! సుబ్బారావు ఇచ్చిందా?

రాఘు—అవును. నాకు తెలుసు. మళ్లీ నువ్వు సుబ్బారావుకే సొమ్ము ఇచ్చేశావు. ఏం?

మోహ—అవును.

రాఘు—నీకు సుబ్బారావు ఇచ్చినప్పుడు సరిగ్గా యిలాగే వుందా?

మోహ—ఉందే అనుకుంటా!

రాఘు—రాజారావు తొమ్మిది రూపాయలకి చెక్కు రాశాడని తెలుసుకోమా నీకు?

మోహ—కాదు. తొంభై.

రాఘు—(గద్దిస్తూ) తొమ్మిది!

మోహ—నాకు అర్థంకావడం లేదు.

రాఘు—అంటే, సుబ్బారావో, నువ్వో చెక్కు దిద్దేశారు.

మోహ—నే...నే.

రామ—అహాహా. తొందరలేదు. ఆలోచించుకుని మరీ మాట్లాడు.

మోహ—(తేరుకుని) నేను కాదు ఆపని చేస్త!

రాఘు—రాజారావు ఈచెక్కు రామయ్యకి ఒంటిగంట కిచ్చాడు. అప్పుడే అతను టిఫిన్ తెప్పించుకున్నాడుకనక, మన కాసంగతి తెలుసు.

రామ—దాన్ని వొదిలిపెట్ట లేకపోయాను!

రాఘు—అదే. అంచేత సుబ్బారావు కిచ్చాడు. నువ్వు ఒంటిగంటాపదిహేనునిమిషాలకి చెక్కు మార్చి

సొమ్ము తీసుకున్నావు. గుమాస్తా టిఫినికి వెళ్లకపూర్వం ఇచ్చిన ఆఖరిచెక్కు యిదికనక ఆసంగతి తెలుసు.

మోహ—అవును. సుబ్బారావున్నే హితులు ఎవరో అక్కడుండడంవల్ల చెక్కు మార్చుకురమ్మని నాచేతి కిచ్చాడు.

రాఘ—అయితే నువ్వు సుబ్బారావు చేశా డంటావు ఈనేరం!

మోహ—నాకేమీ తెలీకుండావుంది.

(రాజారావు తండ్రచెవులో ఏదో చెబుతాడు)

రాఘ—సుబ్బారావు శనివారంతరవాత మళ్లీ ఇక్కడి కొచ్చాడా?

రామ—(మోహనరావుకి సహాయం చేద్దామనే ఆత్రుతతో) ఊహూ, సోమవారం ఉదయమే వెళ్లిపో యాడు.

రాఘ—ఏం, మోహనరావు! వొచ్చాడా?

మోహ—(హీనస్వరంతో) రా లేదు.

రాఘ—అలా అయితే, ఈ కౌంటర్ ఫాయిల్ లో అక్షరాలు మంగళవారంతరవాత ఎవరు దిద్దారు?

రామ—అదేమిటి?

రాఘ—సంగతంతా తేలిపోయింది. ఈ చెక్కుబుక్కు శుక్రవారంనించి, మంగళవారం రాజా రావు తిరిగొచ్చినదాకా, అతని జేబులోనే వుండి పోయింది...ఇప్పుడుకూడా ఈనేరం నువ్వు చెయ్య లేదనే అంటావా?

మోహ—లేదు. లేదు. నేనే చేశాను!!

రామ—(కుమిలిపోయి) శ్రీరామచంద్రా! ఇదేంపని!

మోహ—ఆ సొమ్ము చాలా అవసరంగా కావలి సొచ్చింది. ఏం చేస్తున్నానో తెలిసిందికాదు.

రామ—ఇలాటి దురుద్దేశం నీబుర్రలో ఎలా ప్రవేశించింది నాయనా అసలు.

మోహ—నాకే తెలీడం లేదు. ఒక్కనిమిషం పిచ్చెక్కిపోయింది.

రాఘ—చాలా దీర్ఘమైన నిమిషం! నాలుగు రోజులయినా వుండిపోయింది. ఏం?

మోహ—చేసిన చాలాసేపటిదాకా ఏం జరి గిందో తెలియనేలేదు. ప్రమాణం చేస్తున్నాను. తరవాత నేరం ఒప్పేసుకోడానికి ధైర్యం చాలిందికాదు. సొమ్ము తిరిగి తప్పకుండా ఇచ్చేస్తాను. నిజంగా ఇచ్చేస్తా. క్షమించాలి. (అని రాఘవయ్యగారి కాళ్లు పట్టు కుంటాడు)

రాఘ—(కాళ్లు వెనక్కి తీసుకుంటూ) గది లోకి పో...

(మోహనరావు వెళ్లిపోతాడు)

రాఘ—ఎంతనేరం చెయ్యాలో, అంతా చేశాడు.

రామ—ఇంత మోసం చెయ్యడం! అందులో ఇక్కడ!!

రాజా—ఏం చేద్దాం?

రాఘ—ఆలోచనెందుకు? కేసు పెట్టడమే!

రాజా—మొదటితప్పు.

రాఘ—(నమ్మనట్టు తల ఆడిస్తూ) నాకు నమ్మకం లేదు. ఇంత నేర్పుగా గ్రంథం జరపగలడూ?

రామ—ఏదో దురాశ పుట్టింది. అనుమానం లేదు.

రాఘ—దుర్బుద్ధి లుంటేనే దురాశలు పుట్టు కొస్తాయి!

రామ—అవు.. నూ. అబ్బబ్బ. ఈదేహం బహు చెడ్డది. మనచేత ఎంతగడ్డయినా తినిపిస్తుంది కదా...జగద్రక్షకా! పొద్దన్న అతన్ని చూడ్డానికి ఒకావిడ ఇక్కడి కొచ్చిందితెండి!

రాజా—నే లోపలి కొస్తాంటే ఇక్కడుంది. వెళ్లామా?

రామ—ఊహూ...బంధుత్వ మేమీ వున్నట్టు లేదు...కాపరంచేస్తున్నమనిషే...

రాఘ—అరితేరిన చెయ్యన్న మాట.

రాజా—ఈమాటుకి క్షమించి వొదిలేస్తే మంచి దనుకుంటా. డబ్బిచ్చేస్తావంటున్నాడుగా! చెకిరించి వొదిలితే చాలు.

రాఘు—నేరం మాట ఎలా వున్నా, చేసిన కృతిమాలోచనకి మాత్రం క్షమించకూడదు. ఒకవేళ పట్టుబడితే సుబ్బారావుమీద తోసుకుపోతుందికదా అని ఎత్తువేశాడు. చెక్కుబుక్కు మంగళవారందాకా నీ జేబులోనే వుండిపోయిం దన్న సంగతి అతను గుర్తించనేలేదు.

రామ—మంచివాడే మరి! ఎన్నో రోజులనుంచీ ఎత్తుకేస్తున్నా డనడానికి సావకాశం లేదు. అతను అప్పుడో తీని కోరిక ఏదో అతన్ని లొంగదీసేసి వుంటుంది.

రాఘు—మంచి బుద్ధీ, అలవాటులూ వుంటే ఇలా నిమిషంలో ఎవరూ లొంగిపోరు. చుట్టుపక్కల డబ్బుంటే ఊరుకునేమనిషిలా కనిపించడం లేదు. అసలు అతని కళ్లలోనే తెలుస్తోంది అంతా!

రాజా—(కొంచెం విసుగుతో) అది మనం ఇది వరకు కనిపెట్టినట్టు లేదే?

రాఘు—ఇలాటి వాళ్లని లక్షమందిని చూశాను. దయదల్స్తే లాభం లేదు. తప్పు చెయ్యడానికి వీల్లేకుండా కట్టుదిట్టం చెయ్యాలి. అంతే...

రాజా—అయితే, తైతే?

రాఘు—(సంకోచిస్తూ) వూరుకోడం ఎలానో తెలీకుండావుంది. మన ఆఫీసులో వుంచుకోడానికి వీల్లేదు నమ్మకం లేకపోతే.

రామ—అవునవును...

రాఘు—అతని సంగతి తెలియనివాళ్ల దగ్గిరకి పంపించడం మరీ అసందర్భం. మనం సంఘక్షేమాన్ని గురించి ఆలోచించాలి.

రాజా—కాని, "వీడు దొంగ" అని ఇలా వాతపెట్టెయ్యడమేనా? మొహంమీద?

రాఘు—మిగిలినవన్నీ సరిగావుంటే ఈమాటుకి ఆలోచిద్దును. అన్నీ దుర్గుణాలే!

రామ—అదికాదు నే అన్నది. అతన్ని కలత పెట్టేసిన సంగతులు...

రాఘు—అదే, అది. తన యజమానులని మోసం చేసి ధనం అపహరించడమే కాకుండా, నేరాన్ని మరో నిర్దోషిమీదికి తొయ్యడానికి ప్రయత్నించేశాడు. మరి, ఇలాటి పరిస్థితుల్లో కేసుపెట్టకపోతే, ఎప్పుడు పెట్టాలో తెలీకుండావుంది.

రామ—అతని ముందుగతి మరి!

రాఘు—నీ వుద్దేశంలో, అసలు ఎప్పుడూ, ఎవరూ కేసుపెట్టకూడదన్న మాట!

రాజా—ఆ మాట తలుచుకుంటే నాకు బాధగా వుంది!

రాఘు—కొత్త బాతాఖానీలోకి దిగుతోంది.

(అని లేచి తన గదివైపు వెళ్లబోతూవుంటే)

రాజా—నువ్వే అతని పరిస్థితుల్లో వున్నావనుకో నాన్నా...

రాఘు—చాలా అనకోమంటున్నావే?

రాజా—సొమ్ము అతనికి ఎంత అవసరమొచ్చిందో మనం చెప్పలేం!...

రాఘు—(గుమ్మందగ్గిర ఆగి) నా మాట నమ్ము! చేసేవాడు అవసరమున్నా చేస్తాడు. లేకపోయినా చేస్తాడు...చెయ్యనివాడు, లోకం తల్లకిందులయినా చెయ్యడు!

రాజా—మళ్లీ ఇంకెప్పుడూ ఇలాటిపని చెయ్యనని వాగ్దానం చేస్తున్నాడుగా...

రామ—నేను, ఒకవేళ, అతనితో మాట్లాడుతానుకోండి. అతన్ని అనవసరంగా బాధపెడదామని కాదుగా మన ఉద్దేశమయినా?

రాఘు—ఇంక చాలు...మనసు నిశ్చయంచేసుకున్నా. (అని గదిలోకి వెళిపోతాడు.)

రామ—మీ నాన్నని మనం ఏమీ అనుకోకూడదు. మంచి జడ్జలు బాగా అనుభవం ఉన్న మనిషి. కాని...ఆయనమాటకి వ్యతిరేకంగా మనం సలహా చెప్పకూడదు!

రాజా—ఏడిపినట్టుంది. నువ్వూ నాలాగే అనుకుంటున్నావు. నాకు తెలుసు. నన్ను సమర్థించకు రాకూడదూ?

రామ—నేనేమనుకుంటున్నానో నాకు తెలీకుండావుంది.

రాజా—చేసినదానికి తరవాత విచారిస్తాం సుమా...

రామ— అతనికి చేస్తున్నప్పుడు తెలీదు కాబోలు.

రాజా—(అతి కోపంతో) ఓహోహో...ఏమి దయాదాక్షిణ్యాలండీ...

రామ— ఇదుగో చూడబ్బాయి. ప్రతిదానిలోనూ సబబు ఆలోచించాలి.

(పోలీసు ఇన్స్పెక్టరు ప్రవేశిస్తాడు)

పో. ఇ—స్లీపరుగా ఉన్నారా?

రాజా—(కోపంతో) ఉన్నారు. మీ రొచ్చారని చెబుతాను...(అని లోపలికి వెళిపోతాడు)

రాఘు—(పైకొస్తూ) నాకూ విచారంగానేవుంది. పీలైతే వూరుకుందు నను కో. కాని అంతరాత్మ ఏమీ ఒప్పుకోవటం లేదు. ధర్మనిర్వహణంలో వెనకా ముందూ ఆలోచించకూడదు. మోహనరావు! ఒక్కమాటు యిలా రా!

(మోహనరావు పైకి రాగానే రాఘవయ్య సంజ్ఞ చేస్తాడు. ఇనస్పెక్టరు సంకెళ్లు పైకి తీస్తాడు.)

మోహ—(వెనక్కి తప్పించుకుంటూ)వొద్దొద్దు.

పో. ఇ—మంచివాడివి కాదూ! రద్దూ!!

రాఘు—ఫోర్జరీ చేస్తున్నాడని ఫిర్యాదు చేస్తున్నాను.

మోహ—ఈ ఒక్కరోజుకీ వొదిలిపెట్టండి. ఇంకో మనిషి వుంది నామీద ఆధారపడి. ఆన్యక్తి కోసమే ఈనేరం చేస్త. ఒక్కరోజు...

(రఘువయ్య లాభంలేదని చెయ్యి ఊపుతాడు. దానితో మోహనరావు లొంగిపోతాడు.)

రామ—(బొంగురు గొంతుకతో) శంకరా! దయానిధే... ఏం గొడవ తెచ్చిపెట్టావయ్యా!

(అంతా నిశ్శబ్దం. జేబురుమాలుతో మొహం తుడుచుకుంటూ కుర్చీలో కూలబడిపోతాడు.)

[సశేషం]



చిత్రకళా -
దర్శని

# వర్ణము - రేఖ

౩౭

— శ్రీ ఆమంచర్ల గోపాలరావు —

ఉద్దేశించి వర్ణరేఖలను ఒకపద్ధతిన ఏర్పాటొనరించినపుడు ఈ ఏర్పాటు ఒక చలనాన్ని తప్పక సూచిస్తుందనీ, ఈ వర్ణరేఖల సంకలనముల ననుసరించి చిత్రములో ఉద్భవమైన ఈ చలనం కళాపద్ధతులలో నడవడంచేత లయ అని దీన్ననడమయిందనీ ఇదివరకు అన్నాను. అందుచేత చిత్రం లయపూరితమవడానికి ముఖ్యాధారములు సముచితవర్ణరేఖలు. అదీగాక వర్ణమో, రేఖో, ఏ ఒకదాన్ని వినియోగించకుండా రూపరచనగాని, సంకలనంగాని చిత్రంలో సూచించడం అసంభవం. రూపభేద, ప్రమాణ, సంకలనముల ననుసరించి యేర్పడు ఈ లయ వర్ణరేఖలను వినా సూచించడం అసాధ్యం. చిత్రకళావిధానంలో ప్రధానాంశములైన ఈ వర్ణరేఖలు రెంటికీ అంచేత ఒక అవినాభావసంబంధం ఏర్పడిఉంది. కాబట్టి ఈ రెంటినీ వేర్వేరని నిర్వచించడం, వీటి భావములను వేర్వేరుగా చర్చించడం అనవసరం. అయినప్పటికీ ఒకొ్కక్కప్పుడు చిత్రరచనలో రేఖ ప్రాముఖ్యతవహించవచ్చు, మరొకప్పుడు వర్ణం ప్రాముఖ్యత వహించవచ్చు.

రేఖానుసారమయిన భావప్రకటన వట్టి రేఖానిర్మితమయిన చదరచిత్రాలయందేగాక, వర్ణరీతులకంటె రేఖ లెక్కువ ప్రాముఖ్యత వహించిన చిత్రాలన్నిటికీ చెందుతుంది. ఈ రేఖ లప్పుడు రూపములను స్పష్టీకరించి, రూపభేదాన్ని ప్రకటించి, చిత్రంలో అవసరమయిన స్థాయీల నేర్పరచి, చిత్రాని కొకింత స్థితి, లేక స్థూలత నిస్తూ సజీవంచేస్తాయి. చిత్రంలోని వాలుచాళ్లను చక్కగా సూచిస్తూ, వర్ణికాభంగిములందు రూపములస్పష్టతగాకుండా చేసి, ఈ రేఖ లొకొ్కక్కప్పుడు చిత్రవికాసకారణ మవుతాయి. చిత్రకళలో శిల్పి (Sculpture) పద్ధతులు కొన్ని అవలంబించినపుడు భావప్రకటన సంపూర్ణంగా రేఖాపర మవుతుంది. శిల్పంలో చదరచిత్రపద్ధతు లమరినప్పుడుకూడ చిత్రం రేఖాపరమే అవుతుంది. విలాసమయ జిలిబిలి చిత్రాలు ఈ రెండుపద్ధతులకూ చెందిన వవడంచేత, శిల్పంలోనూ, చదరచిత్రాలల్లోనూ, వీటిలో విలాసమయరేఖలకే ప్రాముఖ్యత వస్తుంది. చిత్రం రేఖాపరమయినప్పుడు, అందలి రూపాల కొక స్పష్టత కలిగి, రూపభేదం చక్కగా అమరుతుంది. ఇటువంటి చిత్రాలల్లో ప్రతివిషయం స్పష్టమయి, ఒక సంపూర్ణత చిక్కుతుంది. అందుచేత ఈ రేఖాపద్ధతి వట్టి హృదయపరమైన భావభావనేగాక, కల్పనకు సంబంధించిన ఆలోచనపరమైన నిర్ణయవిధాన మవుతుంది.

ఇంక రెండో విధానం వర్ణికాభంగిమమీద ఆధారపడి ఉంటుంది. పూర్తిగా వర్ణికాభంగిమమీదనే ఆధారపడి, రేఖలను పూర్తిగా వదలిన చిత్రరచనలలో, ఒకొ్కక్కప్పుడు రూపభేదం స్పష్టంగాక, వాలుచాళ్లుకూడ అస్పష్టత వహించి మాసిపోతవి. అందుచేత లయగతుల నొకొ్కక్కప్పుడు కోలుపోవడం సంభవిస్తుంది. అ పైన రేఖాపద్ధతిలోవలె, ఉద్దేశ్యానుసరణమైన రూపం సంపూర్ణంగా భావనాంశముల నందుకొనకపోవచ్చు.

అయినప్పటికీ, సంపూర్ణంగా చిత్రకారుడు వర్ణికాభంగిమనే అనుష్ఠించినపుడు, రూపాలు వాయు

విశదతల ననుసరించిన వెలుగునీడలలో ప్రదర్శింప ప్రయత్నించేస్తాడు. అప్పుడు వస్తువు, నిశ్చితరూపాన్ని వదలి, వర్ణవెలుతురుల ననుసరించిన ఒక ప్రత్యేకతను వహించవచ్చు. విచిత్రరూపముల నందుకొన్న ఈ చిత్రము లప్పుడప్పుడు, అతిమనోహరములై, అనేక చిత్రవిచిత్ర సూక్ష్మభావముల కాలవాలం కావచ్చు.

వర్ణికాభంగిమ యనగా, దృష్టిచెదరు రీతిన అనేక తళుకురంగుల సమ్మిళితం కాదు. తేజఃప్రమాణ ములను స్థాయీపరంగా సూచిస్తూ, పొందిక గలిగిన అవసరవర్ణసంకలనం. వర్ణవర్ణముల కలయిక అతిమృదులమై, ఒక్కొక్కప్పుడు చిత్రంలో ఏకవర్ణస్వరూపమే కానరావచ్చు. మరొకప్పుడు అనేక చిత్రవిచిత్ర వర్ణముల పొందిక కలిగి, వర్ణవిభేదంతో వెలయవచ్చు. తేజఃప్రమాణ నిర్ణయ మనగా, వర్ణచ్ఛాయలయం దంతస్తులు, లేక స్థాయీలనేర్పాటొనరించడం. అప్పుడు ప్రతివర్ణంలో పెక్కుఛాయలు, ఛాయచ్ఛాయ కొక నిర్దిష్టతారతమ్యం ఏర్పడుతుంది. ఈ తేజఃప్రమాణముల సూచించు పద్ధతిన, చిత్రకళలో అనేకవర్ణముల కవసరం లేదు. ఈ భావము ననుసరించే, ఉత్తమచిత్రకారుడు, అనేకవర్ణములు వాడినప్పటికీ, తన వర్ణసంకలనానికి ఏకవర్ణతరూపము నిచ్చి, వర్ణికాభంగిమలో ఏకత్వము నొకదాన్ని స్థాపిస్తాడు. అంతర్భావపరిణతుల ప్రదర్శనంలో కళాసృష్టిన ఉత్తీర్ణత చెందినప్పుడు చిత్రకారుడు, ప్రకృతిలోని వర్ణవిభేదము నంతగా పాటింపడు. ప్రకృతిన కానవచ్చిన వర్ణవర్ణముల నాతడుద్దేశించి నిర్దేశింప నవసరము లేదు. అజంతాదుల్లో నేటివరకూ చెక్కుచెదరకుండా నిల్చిన, ఉత్తమకళాసృష్టికి చెందిన చిత్రాలెన్నో ఈ రీతినే రచనలైనవి. పాశ్చాత్యదేశంలో కూడ ఉత్తమకళాకర్త లనదగిన రంబ్రాంటు, వెలక్వీరచనలలో కొన్ని చిత్రములు ఈ పద్ధతిన చిత్రించినవే. వీటన్నిటిలో నూ వర్ణికాభంగిమ యూహత్తూ పంచలోహచ్ఛాయ, లేక రజతమేఘచ్ఛాయ వర్ణశ్రుతి నందుకొని, ఇంపై చిత్రమునకు అతిమనోహరత నిస్తున్నాయి. ఈ ఏకశ్రుతి ననుకరించి వర్ణికాభంగిమ పర్యవసానం ఏమనగా, అతిసరళంగా చిత్రంలోని చలనగతులు స్పష్టమై, చిత్రం లయప్రదమై, సంపూర్ణ జీవంతో ప్రకాశిస్తుంది. చిత్రమందు సుఖంగా మన కొక నిమగ్నత ఏర్పడుతుంది.

తేజఃప్రమాణముల ననుకరించు చిత్రాలల్లో, ఛాయవెలుగులలో నొక విలాసమయవికాసం సమకూడుతుంది. దీనివలన చిత్రం ఒక చలనగతిని పొందకతప్పదు. సంపూర్ణవర్ణికాభంగిమమీదనే ఆధారపడి, రేఖ లసలే లేక, తేజఃప్రమాణముల ననుకరించిన చిత్రాలల్లోని రూపములకు లావణ్యపరమైన ఒక అస్పష్టత ఏర్పడి, అప్పుడప్పుడొక విన్యాసభావం కల్పితమవుతుంది. దీని పరిణామం ఒక్కొక్కప్పుడు చిత్రంలోని రూపములకు ఒక ఆలోకస్వభావము కలిగి, మనలో అప్పటివరకు నిద్రావస్థలో ఉన్న సూక్ష్మభావముల నెన్నింటినో ఆ చిత్రం మేల్కొల్పగలదు. ఈ శ్రేణికి చెందిన చిత్రాలు లయపూరితములై, అతిరసవంతములై ఈ నాడు మన దేశంలో బంగాళీకళావిధానంలో అనేక రకాలుగా ఉత్పన్నమవుతున్నాయి. ఈ చిత్రములలో ప్రకటితమైన రూపాలు, వాస్తవికత కేమీ సంబంధం లేక, అశరీరవికాసము నొకదాన్నందుకొని, అతి ముఖ్యమైన సారూప్యలయల ననుసరించి, హృదయ రంజితనాదములను పెక్కింటిని కలిగిఉంటవి.

సాధారణంగా వాస్తవికదృష్టిలో కూడ లయ భావన వర్ణవికాసముల ననుసరించే ఏర్పడుతుంది. అందుచేత చిత్రరచనలందు, వర్ణికాభంగిమను ఉద్దేశించి వర్ణకల్పనలకు పూనుకోకపూర్వమే, లయరూపమును అవగాహన చేసుకోవడం అతిముఖ్యం. ఈ కారణంగానే అనాదిన మన వక్తలు చిత్రకళఅభ్యాసమునకు ముందు గాన, సంగీత, నాట్యశాస్త్రములను పఠించుట అవసరమని నిర్వచించారు. దీని భావం ఒకటే. లయస్వరూపం సంగీతనృత్యములందే అవగాహన సులభం. ఈ నైరూప్యలయను వర్ణరేఖల సారూప్యమొనర్చుటకు చిత్రకళ. అందుచేతనే ఈ చిత్రకళ సంగీత, నృత్యములకు ఉత్తరపథమయింది. కాబట్టి ఉత్తమచిత్రకారుడు ఈ లయను వర్ణికాభంగిమయందుకాని, లేదా రేఖాపూర్వకంగా కాని, లేక ఈ రెంటిలో నిమిడ్చికాని ప్రకటితం చేయకతప్పదు.

చిత్రకారుడు రేఖలలో లయను నిర్దేశించినపుడు, వాటి కొక గతి ప్రాప్తమై, విన్యాసభావం ఒకటి ఉదయిస్తుంది. విన్యాసపరమైనప్పు డీరేఖ అతివిలాసమయమై, ఆది అంతు కానరాని అపారతను ప్రకటిస్తుంది. అనుక్షణం అంతశ్చలనం కలిగి లయప్రదమయిన ప్రకృతికి విన్యాసం ఒక నిశ్చితానుభావ మయింది. మొలక, వృక్షం, పుష్పం, గింజ, తిరిగి గింజనుంచి మొలక — ఈ రీతిన మనం నిత్యమెరిగిన ఒక అనుభావం. వసంతఋతువులో ప్రకృతియం దీ అనుభావం అతిమనోహరమై, సర్వమానవదృష్టి కాకర్షణీయ మవుతుంది. కళాకర్త కీ అనుభావం సర్వకాలసర్వావస్థలయందును కానరాకతప్పదు. చిత్రంలోకూడ లయనిర్దేశించినపుడు ఈ విన్యాసానుభావం తప్పక కలిగితీరుతుంది. చిత్రం రేఖాపరమయినప్పుడు రేఖల కీవిన్యాసం తప్పదు. ప్రాచీనహైందవకళలో చిత్రకళ అన్ని విధములా రేఖాప్రాముఖ్యత కలిగి ఉండటంచేత రేఖావిన్యాసం ఒక ప్రధానగుణమయింది.

అంచేత ప్రాచీనహైందవకళలో, రూపచిత్రాలల్లోనేమి, జిలిబిలిచిత్రాలల్లోనేమి ఈ రేఖావిన్యాసం తప్పక కానవస్తుంది. కాని ముఖ్యంగా జిలిబిలిచిత్రాలల్లో రేఖలకేగాక, చిత్రమున కంతటికీ ఆది అంతు నిర్ణయించ అశక్యమయిన, ప్రకృతిలోని నిత్యవిన్యాసభావము అతిస్పష్టంగా ప్రకటితమవుతుంది.

ఇప్పటికి చర్చించిన ప్రతివిషయం రేఖాపూర్వకంగానే చిత్రంలో ప్రకటితమొనర్పవచ్చు. ఈ కారణంగానే ప్రాచీనభారతీయకళలో రేఖయే కళాసృష్టికి ముఖ్యయానమయింది. ఈ సూత్రముల ననుసరించే చిత్రకళలోని రేఖావినియోగాన్ని గూర్చి విష్ణుధర్మోత్తరీయంలో చెప్పిన వాక్యాలు గమనించతగినవి. "రసజ్ఞులకొరకు రేఖలు; పండితులకోసం వర్తనా—అనగా వెలుగునీడలు; స్త్రీలకొరకు అలంకారాలు, ఆభరణాలు; సామాన్యజనానికి దివ్యవర్ణములు." అంచేతనే లయ ప్రాధాన్యంగా కొని, విన్యాసపరమై ఈ రేఖ భావప్రకటనల కొక ప్రథమస్థానం గణించింది. ముఖ్యంగా, చిత్రం లయప్రదమై, రేఖలలో నొక విన్యాస ముదయించినప్పుడు, చిత్రములయం దొక అనంతభావ ముదయించి, బాహ్యప్రకృతినుంచి మనలను వేరుచేసి, మరిపించి, ఒక నిమగ్నత నివ్వగల శక్తి కల దౌతుంది. అందుచేతనే లయ ననుకరించు ఈ రేఖ చిత్రాలకు నిజశోభ నిచ్చి, ప్రాణప్రతిష్ఠ చేయగల ముఖ్యాధార మవుతుంది.

## షడంగాలు

ఇక మన ప్రాచీనులు చిత్రకళనుగూర్చి నిర్వచించిన షడంగాలను గూర్చిన విచారం ఒకింత చేయవచ్చు. చిత్రానికి అసలయిన అంతరాత్మ భావం; జీవం లయ; శరీరం షడంగాలు. సంపూర్ణంగా శరీరం నిర్మాణమై, జీవం కలిగియున్నపుడే, ఒకవస్తువుయొక్క అంతరాత్మస్వరూపాన్ని కనుగొనే ప్రయత్నం కలుగవచ్చు. అంతేకాని, నిర్జీవమయిన శవానికి మనం ఆత్మవిచారం చేయం. ఇంతేగాక, అంగసౌష్ఠవం లేని శారీరకబాహ్యరూపం మనకు నచ్చకపోగా, ఒక్కొక్కప్పుడు హేయమైనదీ కావచ్చు. అప్పుడు మనం దానిపై సారించు దృష్టికి నిమగ్నత కలుగుటే దుర్లభం. చూడంగానే విముఖత కల్గించు చిత్రాలల్లోని జీవం గుర్తించి, వాటి ఆత్మవిచారం చేయడం కలుగదు: తదనుసారంగా ఆనందానుభూతి అసలు పొసగదు. అందుచేతనే సామాజికునకు ఆనందహేతు వవడానికి మూలమయిన, చిత్రశరీరానికి అంగసౌష్ఠవ మొనగూర్చు ఈ షడంగములను గూర్చిన విచార మతిముఖ్యం.

మన ప్రాచీనులు, చిత్రకళలో నిర్వచించిన షడంగాలూ, రూపభేదం, ప్రమాణం, లావణ్యం, వర్ణికాభంగిమ, రేఖావిన్యాసం, సాదృశ్యం, లేక సంకలనం అని చెప్పవచ్చు. ఎందుకనగా, మనం ఇప్పు డొరికిన గ్రంథాలల్లో, కామసూత్రవ్యాఖ్యానంలో యశోధరుడు షడంగాలను నిర్వచిస్తూ, రూపభేదం, ప్రమాణం, భావం, లావణ్యయోజనం, సాదృశ్యం, వర్ణికాభంగంగా పేర్కొన్నాడు. విష్ణుధర్మోత్తరీయంలోనూ, తదితరగ్రంథాలల్లోనూ రేఖ చిత్రమునకు ఒక అంగంగానే నిర్ణయించి అదేరీతిన చర్చించారు. ఏ విధంగా ఆలోచించినా రేఖ మన ప్రాచీనచిత్రకళలో ఒక ముఖ్యమయిన అంగం. భావం అనేది చిత్రకార

ణమై, దాని ఆత్మగా పరిగణింపబడింది. అందుచేతనే నేను మొదట అన్నట్లు, షడంగాలు రూపభేద, ప్రమాణ, లావణ్య, వర్ణికాభంగిమ, రేఖావిన్యాససాదృశ్యంగా నిర్ణయించవలసిఉంటుంది.

చిత్రకళాలక్ష్యమును సంపూర్ణంగా గుర్తెరిగి, దాని రహస్యమును అతిసూక్ష్మంగా అవగాహనం చేయగలిగినందువల్ల, చిత్రములలో స్థూలదృష్టిన కానవచ్చు ఈ బాహ్యలక్షణములను అంగములుగా నిర్వచించారు. కాని కళాలక్ష్యమును సరిగా గుర్తెరుగక, దాని రహస్యశోధన సంపూర్ణంగా చేయని చీనాదేశంలో చిత్రకళా లక్షణములనే ఆరింటిగా పేర్కొన్నారు. అవేవనగా, సజీవమయిన లయప్రకృతి, అస్థుల ననుకరించు రూపనిర్మాణం, ప్రకృతియనుకరణ, సముచితవర్ణికాభంగిమ, అందమయిన సంకలనం, మెరుగు. వీటిలో మొదట పేర్కొన్న లయప్రకృతి జీవమునకు సంబంధించినది. చిత్రరచనలో నిది యొక పర్యవసానమే అయి, ఉత్తమ చిత్రమునకు గుణమయింది. కాన రచనానుష్ఠానంలో నొక నిర్వచనం కాదు. చివర పేర్కొన్న మూడునూ ఉత్తమచిత్రలక్షణములే అయి, రచనాపర్యవసానాలే అవడంచేత వీటి అనుష్ఠానం, విమర్శన చిత్రరచనలో నిర్వచించి నిర్ణయించలేము. కాని రెండవదీ, మూడవదీ— అనగా అస్థుల ననుకరించు రూపనిర్మాణం, ప్రకృతి యనుకరణ—చిత్రరూపరచనలందు నిర్వచనీయమయిన అనుష్ఠానభాగములే అయి, సాహాయ్యమునీయగలవు. కాని అస్థుల ననుకరించు రూపనిర్మాణం ప్రకృతియనుకరణే అవడంచేత, ఈ రెండునూ ఒకటే అయి, రెంటిగా పేర్కొనడం అనవసరమయింది.

లక్ష్యము నసలే గానక, కళారహస్యశోధనే లేని పాశ్చాత్యులు, చిత్రకళలో లక్ష్యాన్ని, రహస్యాన్ని, లక్షణాలను, అన్నింటికీ ప్రకృతియనుకరణే ప్రధానమని నిర్వచించారు. ఏది ఎట్లున్నప్పటికీ, ప్రకృతి రహస్యముల శోధించలేని పాశ్చాత్యులకన్న ప్రాగ్దేశములకు చెందిన చీనాదేశపు కళ ఉత్తమమైన దనుటలో ఏ సందేహమూ లేదు. లయ, భావం చిత్రకళకు ముఖ్య అంశములని వీళ్లు బాగా గ్రహింపగలిగారు. చిత్రకళా రహస్యమును సంపూర్ణంగా శోధనచేసి, తత్సారమును గ్రహించిన ప్రాచీనభారతీయులు కళకు ముఖ్యోద్దేశం రసస్పష్టనీ, ఆత్మ భావం అనీ, జీవం లయ అనీ, శరీరం భాగాలు షడంగములనీ గుర్తించి, ఈ ఆరు అంగములనూ నిర్వచించారు.

ఈ ఆరు అంగములలో మొదటిది రూపభేదం. చిత్రకారుడు తనలో ఉద్దేశించిన అనేక భావములను సమకూర్చి, ఒక చిత్రమును ఉద్దేశించి, భావనచేసి, తన భావన ననుసరించి కల్పనచేసి, చిత్రరచనకు పూనుకొంటాడు. ఇతని భావనలో ఒక్కొక్కప్పుడు ఏకరూపమేగాక, అనేకరూపములు ఇమిడిఉండవచ్చు. ఈ రూపములన్నీ అతడుద్దేశించిన చిత్రమందు రచించవలసిఉంటుంది. ఎందుకనగా, చిత్రమునం దీ రూపములన్నీ సంపూర్ణముగాను, స్పష్టంగాను ప్రదర్శన కానప్పుడు, చిత్రకారు డుద్దేశించిన భావములన్నీ సామాజికుని హృదయమం దుదయింపవు. అందుచేత ఈ రూపముల నన్నింటినీ, విడివిడిగా, స్పష్టంగా చిత్రంలో నిర్దేశించు అవసరం ఒకటి ఉంది. వర్ణములతోగాని, రేఖలతోగాని, లేక ఈ రెంటితోగాని, చిత్రకారు డీ రూపము లన్నింటికీ స్పష్టత నిచ్చి, ప్రదర్శింపవచ్చు.

ఒక్కొక్కప్పు డీరూపభేదం వర్ణరేఖాపరమే గాక, రూపమున కిచ్చు లక్షణములబట్టికూడ యేర్పడుతుంది. ప్రకృతిలోని రూపములను, స్థూలసూక్ష్మ దృష్టిన గమనించి, రూపరూపమునకు నిత్యమైన లక్షణములను మన ప్రాచీనులు అనేకరకాలుగా నిర్వచించి సంప్రదాయాలుగా ఒనర్చారు. బృహత్సంహితలో సాధారణంగా పురుషులను అయిదు రకాలుగా నిర్వచించారు. హంస, భద్ర, మాలవ్య, రుచక, శాసక అని ఆ పంచవిధాలు. బృహస్పతి, బుధుడు, శుక్రుడు, శని, అంగారకుడు అని పంచగ్రహాలకు చెందుతూ, వీళ్లు లక్షణాల నన్నింటినీ పేర్కొన్నారు. ఎత్తు, లావు, ఇతరమానప్రమాణాలు, వర్ణము, అనేక ఇతర లక్షణాలు అన్నీ చక్కగా నిర్ణయించారు. వీళ్ల ననుసరించి స్త్రీలు కూడా పంచవిధాలుగా వర్ణించడమయింది. ఇంతేగాక, విష్ణుధర్మోత్తరీయంలో ఈ పంచవిధపురుషులను, స్త్రీలను ఒప్పుకొంటూ, అనేక

ఇతరరకాలుగా మానవజాతి నంతటినీ చర్చించారు. గ్రామస్థులు, పట్టణవాసులు, గొప్పవాళ్లు, విధవలు, సానులు, కంసాలులు, మల్లులు, సైనికులు మొదలైన రకరకాల మనుష్యులనేగాక, వివిధదేశస్థులనుకూడా వర్ణించడమయినది. అపైన లోకాతీతులయిన మహాపురుషులు, దివ్యస్త్రీలు, దేవతలు, రాక్షసులు, కుబ్జులు, గంధర్వులు, కిన్నరులు, విద్యాధరులు—వీళ్లందరికీ ఎవరి కుండవలసిన లక్షణాలను వారివారికిగా, విడివిగా పేర్కొన్నారు. ఈ లక్షణముల నన్నింటినీ చిత్రరచనలో నిర్దేశింప వీలులేక పోవచ్చు. కాని ముఖ్యమైన కొన్నింటినిమాత్రమే సూచించి, చిత్రకారుడు రూపభేదప్రకటనయందు ఉత్తీర్ణుడౌతాడు. అందుచేత సంపూర్ణభావగ్రహణకు, అవసరమైన ఈ రూపభేదం ఒక ముఖ్య అంగమయి, వర్ణరేఖాపరమేగాక లక్షణపరంకూడ అవుతుంది.

వివిధరూపములను, వాటి యాకారములను చిత్రమునందు స్పష్టీకరించు ఈ రచనభాగాన్ని, రూపభేదం అనడమయింది. నిశ్చయంగా చిత్రరచన కది ఒక అంగమే అయింది.

రెండవది ప్రమాణం. రచనలో రూపం నిర్ణయప్రమాణముల ననుసరించనపుడు, ఒక వికృతాకారం తప్పక కలుగుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ వికృతాకారం అసలు ఉద్దేశించిన రూపమునే పోలక, చిత్రకారుని భావనలను మన కందజేయకపోవచ్చు. అందులో చిత్రమందు అనేక రూపముల నుద్దేశించునపుడు వివిధరూపముల పరిమాణములను, వాటిలో నేర్పడవలసిన పరస్పరతారతమ్యములను, తద్గుణించినవాటియం దేర్పడవలసిన అవినాభావసంబంధమును సూచించుటకీ ప్రమాణా లతి అవసరం. ఈ ప్రమాణముల ననుసరించి కొంతవరకు చిత్రం లయప్రద మవుతుందని ఇతఃపూర్వమే చెప్పడమయింది. అందుచేత చిత్రంలో ప్రమాణాలు అనుచితమైనపుడు ఆ చిత్రం లయతప్పి, సామాజికునకు ఏ విధంగానూ ఆకర్షణీయంకాదు. ఈ ప్రమాణములు సంప్రదాయపరమైనప్పుడు కళాకర్తభావనలు స్పష్టపడుట అతిసులభం. చిత్రంలోని లయగతులుకూడ అంత సులభంగానే గ్రాహ్య మవుతాయి. మన ప్రాచీనులు ప్రకృతిని పరిశీలించి, గమనించి నిర్వచించిన ప్రమాణము లెన్నో ఇప్పుడు సాంప్రదాయపరమైనవి.

మానసారమందు ఇవి ఆరురకాలుగా నిర్వచించారు; మాన, ప్రమాణ, పరిమాణ, లంబమాన, ఉన్మాన, ఉపమాన మను షడ్విధాలు. మానం అనగా శిరస్సు కొననుంచి నిలువుకొలత; ప్రమాణం వెడల్పుకొలత; పరిమాణం చుట్టుకొలత; లంబమాన మనగా లంబము ననుసరించిన పొడవుకొలత. లంబం అనేది ఒక రాతినో, మరో లోహపదార్థాన్నో దారానికి కట్టి ప్రస్తుత శిల్పులు ఉపయోగించడం మనం ఎరుగుదుము; ఉన్మాన మనగా లావుకొలత; ఉపమానం అనేది రెండు పాదాల మధ్యనో, లేక రెండు చేతుల మధ్యనో ఉన్న దూరపు కొలత. రూపశిల్పంలో మానం అనే ఎత్తుకొలతను వాస్తుశిల్పంలో ఉత్సేధం అని అంటారు. ఈ మానప్రమాణములనుగూర్చి మన పూర్వులు నిర్ణయించిన కొలతలను సంపూర్ణంగా నిర్వచించడానికి ఒక గ్రంథం చాలదు. మనం ఎరిగినంతవరకు హిందూ సంప్రదాయంలో మానప్రమాణములను నిర్వచించిన గ్రంథాలు ముఖ్యంగా మానసారం, బృహత్సంహిత, విష్ణుధర్మోత్తరం, శుక్రనీతిసారం, చిత్రలక్షణం, సుప్రభేదాగమం—ఇలాంటివి ఎన్నో గ్రంథా లున్నాయి. బౌద్ధసాంప్రదాయానుసారం ప్రతిమానలక్షణం ఇంకా ఎన్నిగ్రంథాలున్నాయో మనం చెప్పలేము. కాని ఒక్క విషయంమాత్రం తప్పక మనకు ఇప్పుడు తెలియవస్తుంది. అదేమనగా, కళకు, ప్రకృతికి గల అవినాభావసంబంధం. కళలో వినియోగింపగలిగిన లయస్వరూపములను, మానప్రమాణములను గూర్చి మన పూర్వీకులు ఎప్పుడూ చర్చిస్తూనేఉన్నట్టు విదితమవుతుంది.

ఈ మానప్రమాణము లన్నీకూడ అంగుళమానము ననుసరించే నిర్వచింపబడినవి. ఈ అంగుళమానము ననుసరించి, దేవతలు, ఉత్తమపురుషులు, సామాన్యులు, కుబ్జులు, రాక్షసులు, స్త్రీలు—అవి ఇవి ఏమిటి, చిత్రరచనలో అవసరమైన ప్రతివస్తు ఆకారరూపములకు ప్రమాణముల నేర్పరిచి నిర్వచించారు. ఈ సంప్రదాయానుసారమే చిత్రములో ప్రమాణముల నేర్పరచి, రూపకల్పన మొనరించినపుడు రూపభేదం అతి

స్పష్టమై, చిత్రభావావగాహనలు సులభంగా లక్ష్యమవుతాయి. కాని సంప్రదాయవిరుద్ధంగా నూత్నపద్ధతుల నందుకొని చిత్రకారుడు ప్రమాణములను నిర్మించుకొని, చిత్రరచన చేసినపుడు, ఒక్కొక్కప్పుడు అందలి లయ వక్రగతి ననుసరించి, సామాజికునికి సులభంగా అందకపోవచ్చు. అయినప్పటికీ, ఎప్పుడెరుగని నూత్న విచిత్రచిత్రభావము ఆ చిత్రముల మూలకంగా ఉద్దీపితం కావచ్చు.

చిత్రరచనలో ప్రమాణం రెండువిధాలు. రూపములకు సంబంధించినది ఒకటి: రెండవది వర్ణములకు సంబంధించినది. ఒక్కొక్కప్పుడు వర్ణచ్ఛాయలందే చిత్రకారుడు తేజఃప్రమాణముల నేర్పరచి, చిత్రంలో కొన్ని స్థాయీల నందుమూలంగా ఏర్పరిచి, తన భావనలకు ఉచితనిర్మాణము నిచ్చి, లయనిచ్చి ఉత్తీర్ణత పొందగలడు. అందుచేతనే చిత్రరచనలో ప్రమాణములనుగూర్చి విచారించునపుడు క్షయ, వృద్ధి, వర్తనా అను మూడింటిని విష్ణుధర్మోత్తరీయంలో పేర్కొనడమైనది. * క్షయ, వృద్ధి అనేది స్థూలదృష్టికి రూపాలు ఎక్కువగాను, తక్కువగాను అగుపడడం అన్నమాట. దూరాన ఉన్న వస్తువు చిన్నదిగాను, దగ్గరది పెద్దదిగాను, దూరాన ఉన్న వస్తువుయొక్క వర్ణంకూడ తగ్గడం, అదే దగ్గరకొచ్చినపుడు స్పష్టంగా ఎక్కువగా తోచడం—ఇది ప్రతిచిత్రకారుడూ ఎరగకతప్పదు. సాధారణదృష్టికి ప్రకృతిని తిలకించినపుడు ఈ క్షయ వృద్ధి గోచరించకపోవచ్చు. కాని చిత్రరచన కాయత్తమైన చిత్రకారుడు వీటిని గమనింపకతప్పదు. వర్తనా అనేది వర్ణచ్ఛాయలందు స్థాయీల నేర్పరచడం అని చెప్పవచ్చు. వెలుగునీడలని పాశ్చాత్యవిమర్శకారులంటారు. ఈ వర్తనా మూడువిధాలని మన ప్రాచీనులు చెప్పారు. పత్రజ, బిందుజ, ఐరిక అని. అనగా, రేఖలను కూర్చికాని, చుక్కలను వినియోగించిగాని, లేదా వర్ణమునే సంపూర్ణంగా వినియోగించిగాని దీన్ని తెలియజేయవచ్చు నన్నారు. ఈ వర్తనాను చిత్రమందు ఉద్దేశించి రచించడంలో పెక్కువిధానా లుండవచ్చు. ఎన్ని ఉన్నా ఈ మూడింటిక్రిందనే రాకతప్పదు.

* క్షయ, వృద్ధి: Fore-shortening అని ఆంగ్లంలో అంటారు.

అన్నివిధముల ప్రమాణం అనేది చిత్రకల్పనలో అతిముఖ్యమైన అంశమయింది. కాబట్టి ప్రమాణం చిత్రరచనలో ఒక అంగంగా నిర్వచించడ మయింది.

లావణ్యం మూడవ అంగం. లావణ్యం అనగా, మొరటుతనం లేకుండా, కంటి కింపుగా ఒక దిద్దిన సొంపు కలిగిఉండడం. అతిశ్రేష్ఠమయిన మధువును, కురూపి యొకడు, హేయమయిన బాహ్యరూపం కలిగి, మలినవస్త్రాలతో, దుర్గంధాలను వెదజల్లుతూ అసహ్యప్రదేశంలో, సొట్టలుకలిగి వికృతమైన మురికి పాత్రలో మన కందిచ్చినపుడు, అమృతస్వరూపమయిన ఆ మధువు మనకు రుచించకపోగా, ఒక్కొక్కప్పుడు విషతుల్యమై, మన మది గ్రహించకనేపోవచ్చు. కాని అదే మధువును నవయౌవనం చిలుకుతున్న, చక్కగా అలంకరించుకొన్న సుందరి యొకతె, లాస్యగతుల ననుకరిస్తూ, సువాసనలతో, మందహాసంతో, నిర్మాలిన్యమైన చక్కటి సువర్ణపాత్రలో మన కందించినపుడు మన కదే మధువు అమృతతుల్యమై గణింపశక్యంగాని అపరిమితానందం మనల నావహిస్తుంది. అందుచేతనే, చిత్రకారుని ఉద్దేశ్య మెంత ఉత్తమమైననూ, అతని భావ మెంత ఉన్నతమయిననూ, చిత్రంలో లావణ్య మతిఅవసరం. చిత్రంలో ఈ లావణ్యావసరతను, అనాదినుంచి గుర్తించిన మన హిందూదేశంలో మానవాకృతుల నిర్మాణరీతులు లావణ్యము నుద్దేశించి ఒకపద్ధతిన ఏర్పరిచారు. ఈ రూపాల నిప్పుడు సాంప్రదాయాలుగా మనం గ్రహిస్తాము. యోగసాధనలతో గణించిన రూపాలు దివ్యమై, సకలలావణ్యముల నొప్పునని మన ప్రాచీనులు గుర్తించారు. మోటుతనమును సూచించు పట్టి కండరముల పుష్టి ఈ రూపములందు కానరాకపోవచ్చు. కాని యోగసాధనలవలన గణించిన అంతశ్శక్తులను, నిజప్రజ్ఞలను ఈ రూపాలు నిశ్చయంగా నిర్దేశిస్తాయి. మన ప్రాచీనశిల్పంలో ఉన్నతపురుషుల కిచ్చిన ఆకారనిర్మాణ మంతయు ఉత్తమనవతాళమానము ననుసరిస్తూ, అతిలావణ్యప్రదమై, ఈ దివ్యరూపము ననుకరించినదే అయివుంది. కాని ఏ అంతశ్శక్తులను, నిజప్రజ్ఞలను ఎరగని పాశ్చాత్యులకు ఈ ప్రజ్ఞాశక్తులను గణించుటకు నిజసాధన

మయిన యోగపద్ధతి తెలియదు. అందుచేత ఈ యోగ సాధనవలన వచ్చు, లావణ్యముల జిందు ఈ దివ్యశరీర రూపమును వా రెరుగుటకు అసలు వీలులేదు. అంచేత ఈ రూపములయొక్క అందచందములు వారు సరిగ్గా గ్రహించకుండుటలో ఆశ్చర్యమేమియులేదు. వా రెరిగిన దేహ సౌందర్యం వట్టి పరిశ్రమచే సమకూరు కండరముల పుష్టి మాత్రమే. నిజముగా ఈ కండరముల పుష్టి ఏ అంతః ప్రజ్ఞలను సూచించక వట్టి పశుబలమునే సూచిస్తూ ఒక్కొక్కప్పుడు అతి వెుంరటుగాకూడ కానవస్తుంది.

ఆపైన చిత్రంలో లయప్రదర్శనానికి ఒక ముఖ్యసాధనం ఈ అంతశ్శక్తుల సూచించుట. అంచేతనే నిజంగా యోగసాధనవలన వచ్చిన దివ్యరూపం నిజ శరీరశక్తులను సూచిస్తూ, అంతఃప్రజ్ఞలను తెల్పుతూ, లయగతులను నిర్దేశిస్తూ, అతిఅందచందంగా కనపడి నిజలావణ్యమును ఒప్పుకుంటుంది. నిజముగా పాశ్చాత్య కళలో కండరముల పుష్టిని స్పష్టంగా సూచిస్తూ అతి అందమైన మానవాకృతులను నిర్మించారు. కాని ఉత్తమహైందవశిల్పమందున్న లావణ్య మీరూపము లందు నిజముగా కానరా దనుటలో ఏ సందేహమూ లేదు.

చిత్రరచనలో రూపప్రదర్శనమునకు లావణ్య మొదవించు భావము ననుసరించే, తద్రూపభంగిమలు, అనుభావములు నాట్యశాస్త్రము ననుకరించవలె నని నిర్వచించారు. నృత్యాభినయములు రెండును నాట్య శాస్త్రమునం దిమిడియున్నవి. ప్రకృతిలో మానవున కున్న చేష్టానుభావముల నన్నింటినీ లావణ్య మొప్పుతూ లయగతుల నొనర్పుటయే మన నృత్యాభినయము. అందుచేతనే నృత్యము, అభినయము చక్కగా చేయు టకు ప్రబలసాధన మవసరమయింది. లయపరమైనందున, ఈ నృత్యాభినయములు సంగీతకళ ననుకరించకతప్పదు. ఈ కారణంగానే విష్ణుధర్మోత్తరీయంలో చిత్రకా రుడు కావలెనన్న ప్రథమాన గానం, తర్వాత సంగీతం, తర్వాత నాట్యశాస్త్రం, ఆపైన చిత్రకళ నభ్యసింప వలెనని చెప్పడమయింది.

దీని కంతటికీ కారణం చిత్రానికి లావణ్యం అతిముఖ్యమైన అంగం. లావణ్యత ఒక రూపనిర్మా ణంలోనే కాదు. చిత్రములోని రేఖలన్నింటికీ, వర్ణ ములకూ, వీటి పొందికకూ, అంతటికీ అవసరం. చిత్ర కారు డుద్దేశించిన ప్రతిఅంశమునకూ ప్రతివిషయం లోనూ ఈ లావణ్యత అత్యవసరం.

ప్రస్తుతం మన దేశమందు అనేక చిత్రకారులు, ఈ లావణ్యనిజరహస్య మెరుగక, మన ప్రాచీనచిత్ర ములలో గమనించిన కొన్ని అంశములను స్థూలదృష్టిన మాత్రమే గమనించి, అతివక్రగతిన అనుకరించడానికి ప్రయత్నిస్తున్నారు. దీని పర్యవసానం ఒక్కొక్కప్పు డీ చిత్రము అపహాస్యమైన బడి, అసహ్యముకావచ్చు కూడ. ప్రాచీనులు ఉత్తమ పురుషులం దసుపరచిన అంతర్దృష్టిని సూచించు అర్ధనిమీలితనేత్రములను, ప్రతిపురుషరూపమునకు అతిఅనుచితంగా సమర్చి, దానినే ముప్పాతికనిమీలిత మొనర్చి, ఒక సుప్తిభావ మునుకూడ ఉదయింప జేస్తున్నారు. స్త్రీ రూపము లందు ప్రౌఢల కివ్వదలసిన మదభరితస్థితి కనుభావ మైన అర్ధనిమీలితనేత్రాన్ని ముగ్ధలకూ, కన్యలకూ ఇచ్చి, ఆరూపముల నిజసొంపునే మరుగుపరుస్తున్నారు. అతిసుందరములైన చేతులను, వేళ్లను, వాటి నిజలావణ్యరూపముల నందుకొనలేక, అతినిడుపుగా వికృతంగాకూడ ఆ నాటి చిత్రకారులు కొందరు ప్రదర్శించడం మనం చూస్తూనే ఉన్నాము. ఇదంతయు సరియైన విజ్ఞానసంస్కారములు లేమి, వట్టి సాధనచే సమకూడిన చాకచక్యంతో చిత్రరచ నలకు పూనుకొన్నందువలన ఏర్పడిన దురవస్థ. నిజరహ స్యము నెరుగక, వట్టి ప్రకృతియనుకరణ నిర్భాగ్యకళ అయినట్లే, ఉన్నతమైన మన ప్రాచీనకళయొక్క ఇట్టి ఆభాసముకూడ అంత నిర్భాగ్యమైనదే.

నాల్గవది వర్ణికాభంగిమ. ఐదవది రేఖావిన్యా సం. ఈ రెంటినీగూర్చి చాలవరకూ ఇతఃపూర్వమే చర్చించడమయినది. చివరది సంకలనం. సంస్కృ తంలో సాదృశ్యం అని అంటారు. మిగిలిన అయిదు అంగములవలెనే, చిత్రమునకు ఆరవ యంగమయిన ఈ సంకలనం అతిముఖ్యమయినది. రూపములు, రేఖలు, వర్ణములు అన్నియూ నిజప్రమాణముల ననుసరించినప్ప టికీ, వీటన్నిటికీ చక్కటి సంకలనం కుదరకపోయి

నప్పుడు చిత్రమునకు ఒక ఏకత్వం అబ్బదు. ప్రతి అంశము విడివిడిగా, అతుకులతుకులుగా చిత్రం ఏర్పడి, సామాజికునకు నిమగ్నత నివ్వలేక, చిత్రకారుని భావం అగమ్యగోచరమవుతుంది. సంకలనం చెడిన, లయగతు లేర్పడక చిత్రం నిర్జీవమవుతుంది. చిత్రములో ప్రాముఖ్యత వహించి, చిత్రమున కంతయు కేంద్రమై, సామాజికునిలో భావోదయానికి కారకమవవలసిన ముఖ్యమయిన విషయంకూడ చిత్రమందలి మిగిలిన అంశములలో సదృశ్యమై అసలే కానరాకపోవచ్చు. అందుచేతనే చిత్రంలో పై అంగములన్నింటికీ చెందిన సంకలనం ఆఖరున పేర్కొనడమయింది.

ఈసంకలన భావము ననుసరించే, చిత్రమందు మానవాకారాలు అనేకవిధాలుగా చిత్రించవచ్చునని, అందులో ముఖ్యమైనవి తొమ్మిదింటిని శిల్పరత్న మందు పేర్కొన్నాడు. ఋజ్వాగత—అనగా ఎదుటి దృశ్యం : అనృజ-వెనకనుంచి కనబడేవిధం ; సాచీకృత శారీర—వంగిప్రక్కనుంచి కానవారీతి : అర్ధవిలోచన—ముఖంపక్కనించి శరీరం ముప్పాతిగా కానరావడం ; పార్శ్వగత-పూర్తిగా పక్కనుంచి; పరావృత్త శిరస్స-భుజస్కంధం వెనక్కు వంగిన విధానం; పృష్ఠాగత—వెనుకనుంచి శరీరపైభాగం కొద్దిగా కానవస్తుంది. పరివృత్త శరీర-పైభాగం, అనగా కటిస్థలంనుంచి కొంచెం వెనక్కు తిరిగి ఉండడం ; ఆఖరుది సమానత. కూర్చొని కొద్దిగా వంగిన శరీరం వెనకనుంచి కానవా విధం. మరోచోట ఇలాంటివి ముఖ్యమైనవి పదమూడింటిగా పేర్కొన్నాడు. ఈభంగిమ లన్ని క్షయ, వృద్ధి ననుసరించి వ్యక్తపరచవలెననికూడ నిర్ణయించారు.

సాధారణంగా ఏకమానవాకృతి కలిగిన చిత్రాలన్నీ ఏక, ద్వి, అతి అని మూడుభంగిమలందు చిత్రించడం ఉత్తమమని, అదేవిధంగాకూడ చిత్రించడం సంప్రదాయమయింది. కాని పలుఆకారాలు కలిగి, ముఖ్యాకారం కేంద్రమవవలసిన చిత్రాలల్లో, రూపాలను అనేకభంగిమలందు చిత్రించ ఆవశ్యకతఉంది. ఇవేవీకూడ మన పూర్వీకుల దృక్పథంనుంచి తప్పిపోలేదు. అంచేతనే షడంగములలో చిత్రరచనందు సంకలనానికి ఎక్కువ ప్రాముఖ్యత నివ్వడమయింది.

ఈ సంకలనం అసలు చిత్రకారుడి భావనలోనే ఉదయించవలసిఉంటుంది. తాను ప్రకృతినుంచి గ్రహించిన భావముల నన్నింటికి రూపకల్పనచేసి, తన ఉద్దేశమున కనుగుణ్యంగా తన భావనలోనే సంకలన మిచ్చి చిత్రకారుడు చిత్రరూపమును నిర్ణయిస్తాడు. అప్పుడే అతని భావన సంపూర్ణమై, చిత్రరచనకు పూనుకోవడానికి వీలవుతుంది.

చిత్రమునందలి రూపములకేగాక, రేఖలకు, వర్ణములకు, మానప్రమాణములకు ఈ సంకలనం చెందింద వడంచేత, చిత్రంలోని ఈ అంగములన్నీ నిజసంకలనపద్ధతుల ననుసరించే ఏర్పడవలసిఉంటుంది. చిత్రమున కంతటికీ ఐక్యత నిచ్చి, లయగతిని సూచించుటకై ఏర్పడిన ఈ సంకలనపద్ధతులను సరిగా గుర్తించుటకు, సంపూర్ణ విజ్ఞానసంస్కారాలు, తదుపరి ప్రకృతియందలి లయానుసరణంగా నిశ్చితమయిన సంకలితనిర్మాణక్రమాన్ని గుర్తించి అవగాహనంచేసికొనుట అత్యవసరమవుతుంది.

ఈ విధానమే మన హైందవచిత్రరచనయందలి విశిష్టత. పాశ్చాత్యచిత్రరచనలందు, సాధారణంగా చిత్రమందలి ముఖ్యాంశములను భావనచేసి, చిత్రరచనకు పూనుకొన్నతర్వాత అంశఅంశములను, ఒకటి తర్వాత ఒకటి ఇరికించి, సంకలనచిత్రాలను తయారు చేయడం అంద రెరిగినదే. అంచేత ఎన్నోచిత్రాలు రచించగా కొన్నిమాత్రమే ఉత్తమచిత్రాలవడానికి అవకాశం కలుగుతుంది. కాని హైందవచిత్రకారుడు సంపూర్ణవిజ్ఞానసంస్కారములు కలిగిన ఒక మహాయోగి వలె, యోగపద్ధతిన చిత్రకల్పనకు, తర్వాత రచనకు పూనుకోవలసి ఉంటుంది. అసలు భావనయందే, సంపూర్ణసంకలనమయంగా చిత్రమున భావనచెయ్యనిదే, చిత్రరచనకు పూనుకోకూడదు.

ఇందుగురించి చిత్రరచనావిధానమును గూర్చి, చిత్రకారుని సంకల్పమును ఒక యోగిపద్ధతిగా విశదీకరించినట్లు, ఖోచరుగారు ఒక పురాతనబౌద్ధగ్రంథము నుంచి ఏరితీసివ్రాశారు.

చివరికి మనం గుర్తించవలసింది - ముఖ్యమైన అంశం: ఈ షడంగములూ, ఏకంగానూ, సముచితంగానూ అమరినప్పుడే చిత్రం ఇంపై మనదృష్టి నాకర్షింపగలదు. చిత్రం ఆకర్షణీయమే కానపుడు, దాని నుంచి రసానుభూతి దుర్లభం. అందుచేతనే ఈ షడంగ విచార మతిముఖ్యమైనది.




## మొక్కల ప్రపంచములోని వింతలు

సామాన్యముగా సస్యాదులు ద్వేషించువాటిలో అపరిమితమయిన చలి యొకటి. అయితే, హిమములోగూడా పుష్పించే మొక్కలున్నవి! వసంతకాలములోగూడా ఆల్ప్సుపర్వతపు వాలుప్రదేశము లందలి మంచు కరగిపోదు. దట్టముగా అడుగుమందముతో కట్టియుండును. ఈ మంచుక్రింద ఉండే మొక్కలు, పాపము, మొగ్గలు వేసుకొన్నను మంచు కరగునందాక పుష్పింపకనే వేచియుండును. ఈ ఆలస్యము సాల్డనెల్లా (Soldanellas) లనే మొక్కలు మాత్రము సహింపలేవు.

### మంచులో పూలు

మంచు కరగుట కింకా చాలకాల ముండగానే పూవుకాడలు బయటికి రాను దారినేర్పరుచుకొన మొదలిడును. అంత దట్టమయిన మంచుగడ్డ నీ కోమలమయిన నాళము లేవిధముగా చిల్లుపడజేసి పైకి రాగలవో కదా! అంతటి చలిలోగూడా వసంతుని పిలుపీమొక్కలు తప్పక వినగలవు. వెంటనే పూలకాడలు పెరుగనారంభించును. కాని, పాపము, హిమోపరి చేరకమునుపే వీటి పెరుగుదల నిలిచిపోవును. అపుడా మంచుపొరలోనే పుష్పములు వికసించును! సూర్యరశ్మిలో ఈ పుష్ప మేవిధముగా వృద్ధిచెందగలదో అట్లే మంచుక్రింద గూడా ఉండును. ఈ మొక్క పుష్పములు నీలము, లేక కుంకుమవన్నె గల గంట ఆకారపు పూలు. పుష్పములు బాగా వికాసముపొందినవెంటనే ఈ మొక్కయంతయు ఈ ఘనకార్యసాధనయందు శక్తియంతయు గోల్పోయినదా అన్నట్లు, వాడిపోయి అతిబలహీనత పొందును. ఈ మొక్కలోని నిల్వశక్తి యంతయు పుష్పించు కార్యమున ఉష్ణశక్తిగా మారుటచేత, ఈ మొక్క మంచులోనికి చొచ్చుకొనిపోయి పుష్పింపగలదనియు, కడపట వాడిపోవుట శక్తిలేమి యనియు శాస్త్రజ్ఞులు చెప్పెదరు.

### కాలే పొదలు

తూర్పు యరోపా, ఆశియాల దక్షిణభూములలో సువాసన వెదజల్లే డిట్టానీ (Dittany) అనే తెల్లని పూలతో అందమయిన మొక్క పెరుగును. వెచ్చని గాలిలో ఈ మొక్కవద్ద నిప్పుపుల్ల అంటించినచో పొదయంతయు ఎఱ్ఱని మంటలతో ఆవరింపబడును. అపుడా మొక్క సువాసన మరీ ఘాటుగా దిక్కులన్నియు వ్యాపించును. మంటలు చల్లారినతర్వాత చూచిన మొక్క ఏమాత్రము చెక్కుచెదరక నిలిచియుండును! అందువల్ల ఈ చెట్టుకు కాలేపొద (Burning Bush) అనిపేరు. నిప్పంటుకొని కాలిపోవునది ఈ మొక్కనుండి వెల్వడే పరిమళతైలసారము (Essential oil).

### దోపిడీచేసే మొక్కలు

మానవుని దేహ మాశ్రయించి బ్రతికే నులిపురుగు, కొక్కిపురుగు (Hook worm) మొదలయినవి మానవుని కెంత హాని సలుపగలవో అంతకు రెట్టింపు ప్రాణహాని గల్గించే పరాన్నభుక్కులు మొక్కల ప్రపంచములో లేకపోలేదు. పరాన్నజీవనము (Parasitism) కు పేరుపెట్టిన మొక్క లున్నవి. చాలామొక్కలు న్యాయముగా (అంటే పచ్చని ఆకులు గలిగి) తమ ఆహారమును తామే తయారుచేసికొని జీవించును. వీటి

ఆహారము దోపిడీచేసి జీవించునవే పరాన్నభుక్కులు (Parasites). వీటి వేళ్లు తమ కాతిథ్యమిచ్చిన మొక్క శరీరమునుండి ఆహారద్రవము పీల్చుకొనుట కొరకే నిర్మింపబడియుండును. వీటికి తమ కాశ్రయమిచ్చిన మొక్కలను చంపవలయు నని ఏమాత్రమూగూడా ఉండదుగాని దోపిడీకి తాళజాలక ఆతిథ్యమిచ్చిన మొక్క రాను రాను కృశించి చనిపోవును. ఒక మొక్క ఈ విధముగా చనిపోగానే రెండవ మొక్క నీపరాన్నజీవి ఆశ్రయించును. ఈ పరాన్నభుక్కులలో కొంచెము న్యాయము గలవిగూడా ఉన్నవి. జొన్న పొలములలో జొన్నమొక్క వేర్లకు చుట్టుకొని పెరిగే జొన్నమల్లె (Striga) అనే తెల్లని చిన్నపూలు కాచే మొక్కను చూచియుండవచ్చును. ఈ జొన్నమల్లెకు పచ్చని ఆకు లున్నవి గాని ఆహారద్రవము (Sap), నీరు, లవణములకు జొన్నమొక్కపైననే ఇది ఆధారపడియుండును. ఇది పట్టిన జొన్నమొక్క కొద్దిరోజులలోనే కృశించును. ఇట్టి కొంచెము న్యాయము గల పరాన్నజీవి గంధపుమొక్క (Sandal Tree) కూడా. ఇట్టి పరాన్నజీవులు తమకు కావలసిన పిండిపదార్థము తామే చేసికొనగలవు. వేరేమొక్కల ఆహారము దోపిడీచేసి తినే పాడుజీవితమువల్ల స్వయముగా ఆహారము తయారుచేసికొనే శక్తిగూడా కొన్ని పరాన్నభుక్కులు గోల్పోయినవి. వీటిలో పచ్చదన మనేదే ఉండదు. వీటికి పుష్పించుట, పునరుత్పత్తి చేయుటే ముఖ్యకార్యములు. ఇటువంటి రకపు మొక్క మీరు పొగాకుచేనులలో చూచియుండవచ్చును. ఈ మొక్క పొగాకుమల్లె (Orobanche) అని పిలువబడును. ఇది పొగాకుమొక్కలోనుండి ఆహారము, పిండిపదార్థము అంతా దోపిడీచేయును. ఇది మొలచినదా, పొగాకు పూర్తిగా నాశనము చేయువరకు విడువదు. ఇట్టిదే జావాద్వీపపు మొక్క యొకటి. దీని కాశ్రయమిచ్చిన దురదృష్టపు చెట్టును పీల్చి పిప్పిచేసి ఈ మొక్క ప్రపంచములోకెల్ల పెద్దపుష్పమని ప్రఖ్యాతినందిన నాల్గడుగుల వెడల్పు గల పుష్పము వేసికొనగలదు.

## గాలిలో వేలాడే మొక్కలు

కొన్నిరకముల మొక్కలు బండలమీద, చెట్లమీద పెరుగుచుండును. ఇవి పరాన్నభుక్కులు గావు. వీటి అసలు గృహము ఉష్ణమండలములు. అక్కడి అడవులలో నేలమీద గాలీ, ఎండా తగులకపోవుటవల్ల కాలక్రమేణా ఇవి దొరకిన చెట్టు నెత్తిమీదా, లేక ఏశిలపైనయినాసరే బ్రతకడము నేర్చుకొన్నవి. వీటికి భూమితో సంబంధము లేకపోవుటవల్ల మహీరుహములకు దొరకినట్లు వీటికి జలము దొరకదు. ఎప్పుడో వాన కురిస్తేనే వీటికి నీరు. ఈ వింత "చెట్లమీద—బ్రతికే అలవాటు" కనుగుణ్యముగా వీటికి రెండురకముల వేళ్లుండును. ఒకరకపు వేళ్లు ఈ మొక్కల ఆధారమునుండి పడిపోకుండునట్లుగా బంధించును. రెండవ రకపు వేళ్లు గాలిలో వ్రేలాడుచునే గాలిలోని చెమ్మ నంతయు అద్దుడుకాగితమువలెనే పీల్చుకొనుచుండును. ఈ మొక్కలు ఉపరిద్రుమములు (Epiphytes) అని పిలువబడును. ఈ రకపు మొక్కలే ఆర్చిడ్సు (Orchids) అనునవి. ఇవి చాల అందమయిన, విలగల ఉద్యానవనపు మొక్కలు.

గాలియాత గ్రంథకర్తగారి

**దివ్య చూర్ణాలు**

**మొండి వ్యాధులను ఖండించును.**

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా అబుల్‌కలాంఆజాద్, ప్రభృతుల యెదుట రాంఘరు కాంగ్రెసులో నీటిలో యీదినట్లు గాలిలోకూడా యీదవచ్చునని రుజువు చేసినట్టియు, సర్. రాధాకృష్ణ మొదలగు వారిచే కొనియాడబడిన "గాలియాత" గ్రంథమును రచించిన యోగిగారిచే యోగశాస్త్ర రీత్యా తయారుచేయబడినవి.

ప్రాచీన యోగీశ్వరులు వ్యాధి నివారణమునకు, నిత్య యౌవనమునకు, పూర్ణాయుర్దాయమునకు వాడుచూ వచ్చినట్టివియు, మానవదేహమునకు అత్యవసరమైనట్టివియు, సులభముగా జీర్ణమగునట్టివియునైన, అత్యధిక పోషక పదార్థములతో నిండియున్న ఔషధ రాజములు.

**యోగి, యస్. వి. ఆచార్య,**

సింగరాయకొండ (నెల్లూరు జిల్లా).

M. S. M. Ry.

## మాంసముతినే మొక్కలు

మానవులు, జంతువులే గాదు మాంసాహారము చేయగలవి. మొక్కలకు గూడ ఆదిచేతనవును. ఫ్రెంచి-ఇండోచైనాలోని కొచ్చిన్-చైనా దేశములో కూజా మొక్క (**Pitcher-Plant**) అనే పురుగులు తిని జీవించే చెట్టు బ్రతుకును. ఈచెట్టు ఆకుకొన పొడవుగా ఉండి చివర కూజాకలిగియుండును. కూజాలో వాన పడకుండ పైమూతయుండును. కూజాగొంతులో తేనె గ్రంథులు (**Nectar glands**) అమర్చబడియుండును. దాని క్రింది భాగమంతయు మైనముచే చేయబడి జారి పోవునట్లుగా నుండును. కూజాలో అడుగున జిగటద్రవ మొకటి యుండును. ఈగ మొదలగు పురుగులు తేనె యందలి ఆశచే కూజాగొంతు ప్రవేశించి, మూతపడుటచే తప్పించుకొని పోలేక మైనమునుండి జారి లోనిద్రవ ములో పడి మునిగిపోవును. వెంటనే ప్రాణము విడుచును. పిమ్మట చెట్టు సావకాశము గా ద్రవముసహాయ్యమున పురుగును జీర్ణించుకొనును. కూజాలోని ద్రవము ఆహారము చెడకయుండునట్టిదే గాక పూతినాశకము (**antiseptic**), సులభజీర్ణ కారి గూడానట!

"రాము"

ఆయుర్వేద వైద్యనిలయం వారి

"లుకోరియా క్యూర్"

స్త్రీలకు తరుచు సంభవించు శ్వేతరక్త ప్రదరరోగము లకు, బహిష్టు నొప్పులకు దివ్యౌషధమని పది సం॥ల అనుభవముచే చెప్పగలుగుచున్నాము. దీనిని సేవించుట వలన ఇంకను యితర గర్భాశయ వ్యాధులన్నియు నిర్మూలమై, వంధ్యత్వము తొలగును. అనేకమంది దీర్ఘరోగులకు వాడి గుణము పరీక్షింపబడిన ఆయుర్వేదౌషధరాజము.

90 మాత్రల ప్యాకెటు రు. 2-8-0.
ప్యాకింగు పోస్టేజి అదనము.

ఆయుర్వేద వైద్యనిలయం,
P.O. ఎలకుర్రు - కృష్ణాజిల్లా.
అన్ని ముఖ్యపట్టణములలో స్టాకిస్టులు కావలెను.



# రాజ్యాంగపరిషత్తు పరిణామము

*

## = శ్రీ డా. భోగరాజు పట్టాభి సీతారామయ్య =

స్వరాజ్యము స్వరాజ్యము అని ఇప్పటికి ౪౦ ఏళ్లబట్టి దేశము ఘోషపెడుతున్నది. మొట్టమొదట ఈపదము ౧౯౦౬-వ సంవత్సరములో శ్రీ దాదాభాయినౌరోజీగారి అధ్యక్షతను కలకత్తాలో జరిగిన కాంగ్రెసునందు వాడుకలోకి వచ్చి, తదాది, కొండల మీది రోడ్డు ఏ విధంగా నిమ్నోన్నతాలను ఎదుర్కొన వలసివస్తుందో ఆ ప్రకారంగా ఒకప్పుడు ధైర్యంగానూ, ఒకప్పుడు భయముతోనూ కొందరు ఈ పదమును ఉపయోగించుచు కట్టపడపటికి ౧౯౧౭-వ సంవత్సరము ప్రాంతమున జస్టిస్ సురేశ్ చరణమైత్రాగారి తీర్పువల్ల స్వరాజ్యము అను పదము సక్యమైన పద మనియు, దానిని వాడిన దేశద్రోహాకరము కాదనియు నిర్ధారణ చేయించుకొనగలిగిరి.

౧౯౨౧ నుంచి స్వరాజ్య మను పదము కాంగ్రెసుయొక్క ధ్యేయముగా, కాంగ్రెసునిర్ణయములలో మొదటిసూత్రముపదవిని అలంకరించి, తదాది ఆబాలగోపాలము ఈ పదమును వాడుతూవచ్చినారు. కాని దాని అర్థము ఒకప్పుడు విప్లవాత్మకముగను, మరొకప్పుడు సంకోచముగను ఉంటూఉండెడిది. కడకు ౧౯౨౯-వ సంవత్సరమున స్వరాజ్యమునకు పరిపూర్ణస్వాతంత్ర్యము అని నిర్వచనముచేయబట్టి ౧౯౨౯-వ సం॥ము డిసెంబరు ౩౧ వ తేదీ అర్ధరాత్రి ౧౨ గం॥లకు రావినదిఒడ్డున స్వరాజ్యపతాకము స్థాపింపబడ్డది. అప్పటిమొదలు స్వరాజ్యమునకు యత్నములు జరుగుతూవచ్చినవి...లవణసత్యాగ్రహసమరము జరగడము, గాంధీ ఇర్విన్ ఒడంబడిక అవడము, కాని అధికారివర్గమువారుమాత్రము అందుకు ఇయ్యకొనకపోవడము చేత ౧౯౩౧ లో ముగించిన సమరము ౩౨-౩౩-౩౪ వరకూ పెంపొందింపబడి, ౧౯౩౬-వ సంవత్సరములో జరిగిన లక్నోకాంగ్రెసునందు ప్రప్రథమమున రాజ్యాంగపరిషత్తు నిర్మాణము మన లక్షణలక్ష్య మని నిరూపింపబడి అప్పటిమొదలు ౧౯౪౬-వ సం॥ము డిసెంబరు ౯ వ తేదీవరకు దీని విషయమే ఘోరాటము జరుగుతూవచ్చి, మనము విమానమునందు పైకెగిరినపుడు ఒకప్పుడు మనయొక్క రక్తము యావత్తును తలకెక్కినట్లును, ఒకప్పుడు తలనుంచి రక్తము యావత్తును నాభికి దిగిపోయినటులను ఏప్రకారము అనుభవింతుమో, ఆప్రకారమే ఒకప్పుడు పరిషత్తు సఫలమైనదని ఉవ్విళ్లూరుచు, ఖేచరులవలె ఆనందప్రపూర్ణులమై, మరొకప్పుడు నిష్ఫలమైన దను నిస్పృహాభావముపైకొన్నప్పుడు సముద్రమువరకు పోయి అధోభాగమునకు కూరుకుపోయిన దెబ్బతిన్న నదివలె దుఃఖించుచు చివరకు ఎటులైతేనేమి అటు తిరిగి ఇటు తిరిగి ౯ డిసెంబరున ఢిల్లీ నగరమునందు ఈ పరిషత్తు సమావేశము అగుట సంభవించినది. కాని తుపానుదెబ్బతిన్న ఆ పడవలోని ప్రయాణీకులవలె కొందరు ప్రయాణీకులు ఎటుల విచ్ఛిన్నమగుదురో, ఆ ప్రకారము తలొక సంపుగు తలొకదారి బట్టి, కొందరు ఇంకను నామరూపములు లేకయు, కొందరు రేవుస్థలమునకు దూరమగుటయు, కొందరు అలుకరాశల మధ్య కాలయాపన చేయుచూ ఉండుటచేత ఇప్పటికిని ఈపరిషత్తు ప్రయాణీకులు అందరూ ఏకమై గట్టునకు చేరకుండజాలిరి.

౭౦ మంది పైచిలుకు లీగుమహమ్మదీయులు ఇంకనూ పరిషత్తులోకి రావలసియున్నారు. సిక్కులు వచ్చిరికాని, ఎప్పటికప్పుడు తమజాతి, తమహక్కులు, తమప్రత్యేకతనుగూర్చి మాట్లాడేస్థితియందు ఉన్నారు. ౧౪ గురు పరిషత్సభ్యులు ఏపార్టీకినీ చెందనివారు

మొత్తముమీద కాంగ్రెసువారితో కలిసిమెలిసి పని చేయుచున్నారు. కాంగ్రెసువాదులు తమతోడ వచ్చిన ఇతర ప్రయాణీకులయొక్క సౌకర్యములను మరచిపోక ఏ ఉపసంఘమును నియమించినా, సర్ గోపాలస్వామి అయ్యంగారినేమి, సర్ అల్లాడి కృష్ణస్వామయ్యనేమి, సర్దార్ హరనామసింగ్ నేమి, ఆంటోనినేమి, శ్యామప్రసాదముఖర్జీనేమి, రైటానరబిల్ జయకర్ నేమి, డా. డిసెల్వానేమి—ఇట్టివారిని కమిటీలలో చేర్చుకొని క్రయిస్తవులను, ఆంగ్లో ఇండియన్లను, హిందూమహాసభవారిని, స్త్రీలను ఉపసంఘములకు నిర్ణయించుచు జాగ్రత్తగా వ్యవహారములను చూచుకొనుచు పనిచక్కని పదిలముగా పట్టుచున్నారు.

ప్రథమంలో అధ్యక్షస్థానమునకు ఎవరా అను విషయములో లోపల చర్చలు జరిగి, చివరకు కాంగ్రెసువారా, కాంగ్రెసేతరులా అను మీమాంస వచ్చి, కాంగ్రెసువారే ఉండవలెనను సిద్ధాంతమును స్థిరపరచబట్టి ప్రస్తుతము కేంద్రప్రభుత్వములో ఆహారశాఖను నిర్వహించుచున్న డా. రాజేంద్రప్రసాద్ గారినే ఈ స్థానము నలంకరింపజేయ నిర్ణయించి, ఏకగ్రీవముగ సభవారు వీరిని అంగీకరించునటుల చేయగలిగిరి. ఏవిధముగా శాసనసభలలో ముందర పార్టీసమావేశమై, అక్కడ గావింపబడిన తీర్మానములు బహిరంగసభలో లాంఛనమునకుమాత్రమే ప్రవేశపెట్టబడి, అనుకూల ప్రతివాదములులేకయే ఆమోదింపబడుతూ ఉండునో, అదేరీతిన (౧) చర్చనిర్ణయసంఘము (ప్రొసీజరుకమిటీ), (౨) సంస్థానములవారు నియమించిన నరేంద్రరాయబారమండలితో రాయబారములు జరుపు ఒక సంఘము, (౩) పరిషత్తుయొక్క సలహాసంఘము (అడ్వైజరీకమిటీ) (౪) ఆర్థికసిబ్బందీల నిర్ణయసంఘము (ఫైనాన్సు అండ్ స్టాఫ్ కమిటీ), (౫) ఎన్నికల సవ్యాపసవ్యముల నిర్ణయించు క్రెడెన్షల్స్ సంఘము, (౬) గృహకృత్యసంఘములు నియమింపబడి, అందులో నియమింపబడిన సభ్యులు ముందుగనే నిర్ణయింపబడి సర్వజనసమ్మతముమీద పరిషత్తుయొక్క బహిరంగసభయందు అంగీకరింపబడిరి. ఇంకనూ సారథ్యసంఘము, అల్పసంఖ్యాకసంఘము, ఆదివాసులు, ప్రాతిపదికహక్కులనున్నూ గూర్చిన సంఘములు ఈ జనవరి వరకూ ఆపుచేయబడినవి.

గృహకృత్యసంఘమునందు అన్ని రాజధానుల ప్రతినిధులూ ఉండునటుల నిర్ణయింపబడెను. తక్కిన వాటిలో సర్వసమత్వప్రాతినిధ్యము ఏర్పరుపబడినది. డిసెంబరు ౬వ తేదీన బ్రిటిషుగవర్నమెంటువారు జారీచేసిన తాఖీదుననుసరించి నూతనపరిస్థితులు ఏర్పడిన విషయము సాంతముగా దినపత్రికలయందు చర్చింపబడియే యున్నది. శాఖలలో (సెక్షన్లలో) సమ్మతులు తీసుకొనవలసిన పద్ధతి రాజధానులను యూనిటులుగా ఎంచి ఒక రాజధానికి ఒక ఓటు చొప్పుననా, లేక ఎంతమంది వ్యక్తులున్నారో వ్యక్తికి ఒక్కటొక్కటిగా ఓటుతీసుకొనవలెనా అన్న మీమాంసలో ఇంతవరకూ సందేహముగా ఉన్న విషయమును నిర్ధారణచేసి కాంగ్రెసును బలవంతపెట్టి "దీన్ని మీరు అంగీకరిస్తేనే తప్ప మీవల్ల నిర్ణయింపబడినటువంటి రాజ్యాంగవిధానమును పార్లమెంటుముందర మేము పెట్ట"మనియు, ఏ సంఘమువారైననూ అధికసంఖ్యాకులుగా పరిషత్తును బహిష్కరించినచో ఆయా భాగములకు పరిషత్తుచే నిర్ణయింపబడిన విధానము అనువర్తింపజేయబడదనియు, ప్రధాన మతకేసీతప్ప తక్కిన అవసరములందు ఫెడరల్ కోర్టుకు రిఫరెన్సుచేయవలసివచ్చినచో అది అన్నిపార్టీలవారియొక్క సమ్మతివల్లనే జరుగవలెననియు మున్నగు నూతనవిషయములు ఈ తాఖీదునందు నమోదుచేయబడి ఉన్నవి. కాంగ్రెసువారు చిరకాలము తాము నిరాకరించి, ఎట్టి అభిప్రాయము వెలిబుచ్చవలయునో తీర్పుచేసుకొనలేదు. చివరకు మీరట్ కాంగ్రెసునందు ఆమోదింపబడిన విధానమునకు తలవెంట్రుకవాసిభేదము ఉన్నను అఖిలభారతకాంగ్రెసు సంఘమువారు సమావేశమై నిర్ధారించినగాని వీలులేదని గ్రహించి, ఆ సభలో పరిపూర్ణమైన చర్చకు అవకాశము ఉన్నదని తలంచి, తాము ఎట్టి అభిప్రాయమూ ఇవ్వజాలక కాంగ్రెసుకార్యసంఘమువారు అఖిలభారతకాంగ్రెసు సంఘసమావేశమును డిసెంబరు ౬వ తేదీన సమావేశము జరుప నిశ్చయముచేసినారు. 'వెనక్కిపోతే గొయ్యి,

ముందుకు వేస్తే నుయ్యి' అన్న స్థితిలోనికి కాంగ్రెసు వారిని బ్రిటీషువారు దింపుట చూడ వారియొక్క రాజనీతి ఎంత కుటిలమో, ఎంత గూఢమో ఇప్పుడు తెలియుచున్నది. అమాత్యత్రయమువారు వచ్చినప్పుడు బ్రిటిషువారికి సదుద్దేశ్యము కలదని, వారి నిజాయితీని గూర్చి సందేహము వీడవలసినదని గాంధీగారు మున్నగు వారు ఘోషించియుండిరి, ౪ మాసములు పూర్తిగా తిరుగకముందే అట్టి నిజాయితీ వారియందు లేదనియు, వారి మార్గము వక్రమార్గ మనియు విశదమగుట ఆశ్చర్యముగా నున్నది. సత్యాగ్రహియొక్క లక్షణము ఎదిరి వానియొక్క సద్భావమునే ఆరోపించవలయును, దుర్భావమును నిరూపించకూడ దను సిద్ధాంతమువిూద ఆధారపడియున్నది. కాని రాజకీయమునందు అట్టి కేవలసిద్ధాంతము, నిర్మితమగు పువాదిభావములు ఎంత వరకూ తీర్మానములోకి, అనుభవములోకి రాగలవు అన్న సందేహము పొడసూపకమానదు.

జరిగిన దేదో జరిగినది. ఇకముందు రణరంగమునందు ప్రవేశించి యుద్ధము చేయుదమా, లేక మనకూ వానికీ సామరస్యము కుదిరి సమాధానమార్గము అనుసరణీయమా అన్నది ప్రకృతసమస్య. డిసెంబరు ౬ తేదీను తిరస్కరించవలయునని చాలమంది అభిప్రాయము. ఇందలి పూర్వపక్ష, సిద్ధాంతములు యోచింపతగినవి. తిరస్కరించెదరా—బ్రిటిషు మంత్రివర్గము వారిని ఎదిరించినందువల్ల వారి సలహాను అనుసరించి లీగువారికి పురుషత్తునిచ్చుట నిశ్చయమే కాని ఇప్పుడే పాకీస్థాన్‌ను అంగీకరించినటుల కూడా అగును. అంగీకరించిరా—లీగువారియొక్క ప్రతిష్ఠ ఆకసమునకు వెళ్లి జిన్నాగారియొక్క అవాంతరములను పోషించి తిరిగి ఆయనచేత వెనక అడిగినవిగాకుండ మళ్లీ క్రొత్త కోర్కెలు చేయించునటుల చేసినవారగుదురు. ఈరెంటి మధ్యనూ "ద్వైధీభవతి మే మనః" అన్నటుల కాంగ్రెసువారు ఎటూ చెప్పజాలక డోలాయమాన స్థితిలో నున్నారు. జిన్నాగారి అవాంతరముల అన్న అర్థమేమి? వారినిగూర్చి మనము ఇటుల విమర్శించుట సత్యమా, అపసత్యమా? సంప్రదాయసిద్ధమా, సంప్రదాయవ్యతిరేకమా? అన్న విషయమునుమాత్రము యోచింపవలసి యున్నది. మహమ్మదీయులయొక్క అభివృద్ధిలోని సూక్ష్మమును ఒక్క నిమిషము ఆలోచింతముగాక! ఎప్పుడెప్పుడు కాంగ్రెసువారు ఆందోళనజరిపి సంస్కరణలను పొందగల్గిరో అప్పుడప్పుడెల్లా మహమ్మదీయులకు జరిగిన అప్రయత్నపూర్వకములగు ఉపకారములను ఇంచుక యోచింతము. ౧౯౦౫ వందేమాతరఉద్యమ ప్రారంభఫలితముగా కాంగ్రెసువారికి ఖైదులు, దెబ్బలు రాగా ౧౯౦౬ లో మహమ్మదీయులకు ప్రత్యేకనియోజకవర్గములు లభించెను. ౧౯౧౪ లో జరిగిన మహాయుద్ధఫలితముగా కాంగ్రెసువారికి ఎట్టి సద్యఃఫలితమూ కలుగకపోయినా ౧౯౧౬ లో మహమ్మదీయులకు "వెయిటేజి"—అనగా బలగము ఎంత ఉన్నప్పటికీ వారి జనాభాకంటె ౧౦౦ కి ౧౫ కు తక్కువకాని ప్రాతినిధ్యము లభించెను. ౧౯౩౧ లో కాంగ్రెసువారు సత్యాగ్రహసమరము జరిపి ౬౦ వేలమంది ఖైదులకు వెళ్లి అనేకమంది కష్టనష్టముల పాలై, రెండవ రౌండుటేబిల్ కాన్ఫరెన్సు పూర్వము సకలాధికారములు రాజధానులకు ముస్లింలను తృప్తి పరచుటకు ఇచ్చిరి. ౧౯౪౫ లో తాత్కాలిక ప్రభుత్వమునందు మహమ్మదీయులకు హిందువులతో సరిసగంగా ఢిల్లీ కార్యనిర్వాహకవర్గమునందు (పారిటీ) ప్రాతినిధ్యము లభించెను. ౧౯౪౬ లో సిమ్లాలో రెండు పార్టు జిన్నాగారు రాయబారములను భగ్నపరచిన ఫలితముగా అమాత్యత్రయమువారు వచ్చి ప్రధానమతవిషయములకు సంబంధించిన విషయములలో కేవలము ప్రాంతీయుల మెజారిటీవల్ల గాని ముస్లింలయొక్క భవిష్యత్తు నిర్ణయింపబడవలె నని నిశ్చయింపబడి డబుల్ మెజారిటీ లభించెను. ౧౯౪౭ ప్రారంభము అయ్యేసరికి ఇదివరకు విచ్ఛిన్నమగు అనుకున్న శాఖలు, వర్గీకరణము ఖాయమయ్యెను. ఇది అంగీకరించినచో ఫలితము ఏమగునో తీవ్రముగా యోచింపవలసియున్నది. ఇంకనూ జిన్నాగారు ఏమడుగుదురో అను సందేహము ప్రజలకు కలుగవచ్చు. ఈ గ్రూపులందు ప్రత్యేకపుసేనలు ఉండవలెనని ౧౯౪౬ ఏప్రిల్‌లో లీగుయొక్క కార్యవర్గపు రహస్యపు తాఖీదు చేయబడి, విషయము చాలామందికి తెలియదు. అందులో ఈ సేనల నిర్మాణమునందు ఇంతమంది హిందువులు, ఇంతమంది సిక్కులు, ఇంతమంది ముస్లింలు ఉండవల

యును, ఈ సేనకు అధికారి ఎవరు ఉండవలయును మున్నగు విషయములు అందు తెలిపియున్నారు. సర్ స్టాఫర్డ్ క్రిప్స్ గారికి, బ్లేక్ గారికి నడిచిన ఉత్తర ప్రత్యుత్తరములలో ఈ విషయములు లిఖితరూపముగా పొందుపరుపబడినవి. ఇటు ఇప్పుడు ౧౯౪౮ పూర్తిఅయ్యేసరికి ఈ సేనలను పోషించవలసిన భత్యములు కేంద్రప్రభుత్వమువారే భరించవలెనని కోరుదురు. ౪౦ లో మహమ్మదీయరాజ్యము స్థాపించవలయు నని యత్నము జరుగుట నిశ్చయము. అనగా పాకీస్థాన్ ఇప్పుడు ఒప్పుకోకపోతే యావత్తు భారతదేశమూ మహమ్మదీయరాజ్యము స్థాపించవలె ననేది గత్యంతరము అగుటచేత ఈ రెంటిమధ్యనే కాంగ్రెసువారు నిర్ణయించుకొనలేకపోవడము తటస్థించినది. ఇందుతో ఇప్పటికి ఈ విషయము ఎటు పరిణమించగలదో చెప్పజాలము.

పరివర్తుయొక్క ప్రథమసమావేశ ఫలితము ఈ రీతిగా ఉన్నది. భవిష్యత్తులో ఎటు లుండునో చూడవలయును. ఫ్రాన్సులో రెండుమార్లు పరివర్తులు జరిగినవి. అటులనే అమెరికాపరివర్తు. ఇండియాయొక్క గతి ఏవిధముగా అవనున్నదో చెప్పజాలము. కాని ఒక్కటిమాత్రము చెప్పవలసియున్నది. భారతదేశము ఏకమనియు, అవిభాజ్యమనియు ప్రతిభారతీయుడును గుర్తించి, దాని సాధన తన కర్తవ్యమని గ్రహించి, ఆవశ్యకము చూసి అందుకు తగిన త్యాగసాహసములను చూపించక తప్పదు.



# కాలగ[illegible]ంపే

## రాజ్యాంగ పరిషత్తు లక్ష్యములు - నెహ్రూ తీర్మానము

గత మాసంలో (డిసెంబరు) ఢిల్లీయందు సమావేశమైన రాజ్యాంగ పరిషత్సభలో పరిషత్తు లక్ష్యములను ప్రకటించుచు పండిత నెహ్రూగారు ఈ దిగువ తీర్మానమును ప్రతిపాదించిరి:

"భారతదేశమును సర్వాధికార సమన్వితమైన స్వతంత్ర ప్రజాస్వామ్యరాజ్యముగా ప్రకటించుటకున్నూ, భారతదేశ భవిష్యత్పరిపాలనకై ఒక నూతన రాజ్యాంగమును తయారుచేయుటకున్నూ పరిషత్తు కృతనిశ్చయమై యున్నదని ఇందుమూలముగా ప్రకటించుచున్నాము. ప్రజాపరిషత్తు తయారు చేయనున్న ఈ నూతన రాజ్యాంగంలో ప్రస్తుతం బ్రిటిషు ఇండియా అనే పేరుతో వ్యవహరింపబడుతున్న వివిధ ప్రాంతములనూ, స్వదేశ సంస్థానాలని పిలువబడుతున్న ప్రదేశాలనూ, స్వతంత్ర భారతావనిలో చేరగోరెడి తదితర ప్రాంతములనూ కలిపి ఒక సమితిగా ఏర్పాటు చేయవలయును. పై చెప్పిన వివిధ ప్రదేశములకు (రాజ్యాంగ పరిషత్తు అవసరమైతే సరిహద్దులు మార్చవచ్చును.) నూతన రాజ్యాంగచట్టం ప్రకారం స్వయం పరిపాలనాధికారమునూ, తదనురూపమైన హోదాయునూ ఉండగలవు; సమితిప్రభుత్వానికి ప్రత్యేకంగా దత్తము చేయబడినటువంటిగాని, సహజసిద్ధంగా దానియందు అంతర్నిహితమై యున్నటువంటిగాని అధికారములు, శాఖలూ, ఆయా అధికారములకూ శాఖలకూ అనుబద్ధమై ఉన్నటువంటి ఉపశాఖలూ ఉప అధికారములున్నూ తప్ప మిగిలినటువంటి అధికారములూ శాఖలూ అన్నీ కూడా ఆయా వ్యష్టులకే చెందుతవి. ఈ చట్టం ప్రకారం సర్వాధికార సమన్వితమైన స్వతంత్రభారత రాజ్యముయొక్కయూ, అందలి అంతర్భాగముల యొక్కయూ అధికారము యావత్తు ప్రజల హస్తగతమై ఉంటుంది. భారతీయ ప్రజలందరికీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ విషయాలలో సంపూర్ణమైన న్యాయము జరిగించగలమని హామీ ఇవ్వవలయును. ప్రతివ్యక్తికి సమానహోదా, సమానావకాశములు కల్పించబడవలయును; న్యాయశాస్త్ర దృష్ట్యా భారతీయులు అందరూ సమానులుగా పరిగణింపబడవలెను. ప్రతివ్యక్తికి న్యాయనైతిక నియమముల పరిహద్దులలో భావనా స్వాతంత్ర్యము, వాక్ స్వాతంత్ర్యమూ, మత - దేవతారాధనా - వృత్తి స్వాతంత్ర్యములూ, సమ్మేళనా స్వాతంత్ర్యమూ, కార్యస్వాతంత్ర్యమూ ఒసగబడగలవని అభయమివ్వవలెను. నూతన రాజ్యాంగమందు అల్పసంఖ్యాక వర్గములకునూ, వెనుకబడిన వారికినీ, కొండజాతులకునూ, నిమ్నతరగతులవారికినీ అవసరమైన అభయనిబంధనలూ కాపుదలలూ ఏర్పాటుచేయబడవలయును.

ప్రపంచమందలి నాగరకజాతులు అనుసరించెడు న్యాయ నైతిక సూత్రములను పురస్కరించుకొని భారతీయ రిపబ్లికు తన భూమ్యాకాశ సముద్రాలమీద తనకున్న సర్వాధికారములను సురక్షితముగా కాపాడుకొనవలయును. ఈ ప్రాచీన భారతదేశము ప్రపంచమందు తన కర్హమైనటువంటి స్థానమునూ, గౌరవప్రదమైనటువంటి ప్రతిపత్తినీ సాధించి, ప్రపంచశాంతినీ మానవకోటియొక్క క్షేమ సౌభాగ్యములనూ అభివృద్ధిచేయగలందులకై హృదయపూర్వకముగా సహకరించగలదు. "

ఈ తీర్మానమును ప్రతిపాదించుచు నెహ్రూగారు ఈ క్రింది వివరణను గావించిరి.

"ఈ రాజ్యాంగపరిషత్తు తన వ్యవహారనియమావళిని నిర్ణయించుటకును, కమిటీలను నియమించుటకును పూనుకొని పనిసాగించవలసియున్నది. జాతీయ స్వప్న మనోరథములకు లిఖితప్రమాణమైన స్వరూపమును చిత్రించవలసియున్నది. మన లక్ష్య మేదో, మనము సాధింప 'సమకట్టినదేదో', మన మెటువైపుకు నడక సాగించుచున్నామో, ఈ పరిస్థితిలోకూడ మనకు మనము నిరూపించుకొనవలెను. మనవైపు చూపునిల్పి నిరీక్షించుచున్న కోట్లకొలది జనులకొరకును, యావత్ప్రపంచము కొరకును మనము నిరూపించవలెను.

ఇది మన నిశ్చితార్థ ప్రకటన. ఇది మన సంకల్పము. ఇది మన దీక్షాప్రమాణము. ఇది మనము జేసెడి ఒప్పందము. మన కందరికిని వర్తించెడి ఆత్మసమర్పణము. ఈ తీర్మానము భారతదేశప్రజల మనోభీష్టమును, హృదయమును ప్రతిఫలింపజేయుచున్నది."

"సహకారము, సద్భావము, స్నేహభావము ఇవి అత్యంతావశ్యకములు. భారతదేశము బ్రిటనుతో సహకరించవలెనని, స్నేహముగా ఉండవలెననియే కోరుతున్నది. బ్రిటను భారతదేశసహకారాన్ని తిరస్కరిస్తే రెండు దేశాలకూ అందువల్ల అపకారమే జరుగుతుంది. కాని భారతదేశానికి కంటే బ్రిటనుకూ, ప్రపంచానికీ ఎక్కువ హానికలుగగలదు."

---

## కొత్తరకపు సేఫ్టీరేజర్

అమెరికాదేశంలోని 'రోచస్టర్' పట్టణంలో నివసించే యం. యం. గ్రేవిస్ అనేవాని గడ్డం - సంగతి తెలియక ఒప్పుకున్నా - మంగలివరూ, కత్తులు బండబారిపోడంవల్ల రెండోసారెప్పుడూ గీసేవారు కారు. అతనిది అంత బిరుసుగెడ్డం. అంచేత అతనే వేడినీళ్లలో ముంచిన బ్లేడుతో చేసుకునేవాడు. అది సుఖంగా ఉండడంవల్ల గడ్డం గీసుకున్నంతసేపూ వేడిగా ఉండే సాధనం కనిపెట్టడానికి తంటాలుపడేవాడు. అతని భార్య వేడిసేఫ్టీరేజరు కనిపెట్టడమేమిటని ఆక్షేపించడం, మంగలివరూ గడ్డం గియ్యకపోడం ఈ రెండూ ఈ కొత్తరకపు వేడిసేఫ్టీ రేజరు కనిపెట్టడానికి కారణాలయినాయి. అతడలా శ్రమపడి పడి, మూడేళ్లు సాగించిన పరిశోధనల ఫలితంగా, గడ్డం గీసుకునేంతసేపూ బ్లేడు వేడిగా ఉండే సాధనం కనిపెట్టగలిగాడు ఆఖరికి.

ఆ బ్లేడ్ ఎలెక్ట్రిసిటీవల్ల ౧౫౦ డిగ్రీల వేడి ఎక్కుతుంది. అది అరుళ్లకు ఆగగలదిగాను, నీళ్లకు తడియనిదిగాను ఉంటుంది. ఆ వేడి అక్కర్లేనప్పుడు గాలికి చల్లబడిపోతుంది. ౧౫౦ డిగ్రీల వేడి కలగగానే ఆ బ్లేడు అంచు చివర నున్న అణువులలో ఎక్కువ సంచలనం (మనం ఊహించలేనంత) కలుగుతుంది. అంచేత బ్లేడు అంచు మరీ పదునెక్కి మెత్తగా తెగుతుంది. ఒకవేళ చిట్లినా, బీటలు, నాటులు పడి రక్తం వచ్చినా బ్లేడులో ఉన్న వేడివల్ల వెంటనే ఆ నాట్లు మాని, మంట మొదలైన బాధలేమీ కలగవు. సుఖంగా ఉంటుంది. దీనికి వేడినీళ్లూ, తువ్వాలూ మొదలైన గొడవ, అడావిడీ ఏమీ అక్కర్లేదు.

ఇది కనిపెట్టి రెండేళ్లయినా యుద్ధంవల్ల ఊక్కలేని రోజులు గనక ఇంకా తయారుకావటం లేదు. ఇంకకొద్దిరోజుల్లో మన హస్తాల నలంకరిస్తుం దీరేజర్.

శ్రీరామశాస్త్రి





# విమర్శనము



## అ మ ర జీ వు లు

నాల్గుభాగములు. మంత్రివాది సంపాదితములు. తెనాలి సుందరరాం అండు సన్సు ప్రచురణలు.

పసిపిల్లలను సన్మార్గవర్తనులను జేయుటకును, వారికి మహత్తమ ఆదర్శములను బోధింపజేసి నీతిమంతులను జేయుటకును అమరజీవులైన మహాపురుషుల జీవిత చరిత్రలు మిక్కిలి తోడుపడగలవు. అట్టి ఉద్దేశ్యముతోనే వ్రాయబడిన ఈ చిన్నపుస్తకములు ప్రాథమిక తరగతులలోని విద్యార్థులకు తరగతి క్రమమున బాగుగా ఉపకరించునవిగా యున్నవి. అనేక వర్గములకు, అనేక శాఖలకు చెందిన పలువురి జీవితగాథలు వీనిలో నున్నవి. కొందరు స్త్రీరత్నముల చరిత్రములు కూడ గలవు. కాని ఈ చరిత్రల వర్గీకరణములో కొందరి చరిత్రల పునరుక్తి, కొందరి చరిత్రల లోపము లేక వీలయినంత సమగ్రముగా ఉండియుండినయెడల ఇంకను బాగుండెడిది.

---

## తెనుగుతల్లి

రచయిత: మాగంటి బాపినీడుగారు. ప్రకాశకులు: జాతీయ జ్ఞానమందిరం, త్యాగరాయనగర్, మద్రాసు ౧౭. వెల రూ. ౨.

తెలుగుదేశాన్నిగురించి సాకల్యంగా చిన్నపిల్లలకు వారి చిన్నారిభావాలలో చిత్రమయంగా తెలియజెప్పడానికై చేసిన ప్రయత్నం ఇది. పిల్లల పుస్తకాలు, ఇతరప్రాంతాల్లోవలె, అట్టేలేని ఆనాడు ఇటువంటివి చాలాచాలా అవసరమనడం ఎవరూ కాదనరు. కాగా, బాపినీడుగారి ఈ యత్నం తప్పక సర్వథా కొనియాడదగింది. దీని నిర్మాణంలో వారి ఉత్సాహం బాగా ద్యోతకమవుతున్నది కూడా. కూర్పు తీర్పులు కూడా మహా ముచ్చటగా ఉన్నాయి. కాని, ఆంధ్రబాలసర్వస్వం అని దీన్ని పేర్కొనడం మాత్రం అంత సమంజసం కాదేమో అనిపిస్తున్నది. ఎన్నో విషయాలు ఇందులో లోపించి, దీనికి అసమగ్రత కల్పిస్తుండడం నిజంగా విచారకరవిషయం. ఉత్తర ముద్రణంలోనైనా దీనికి ఆ సమగ్రత కల్పిస్తారని ఆశిస్తున్నాము.

---

## గ్రంథ స్వీకారము

---

### జంతుశాస్త్రము

గ్రంథకర్త: ఆర్. వి. శేషయ్య, యం. ఏ. గారు. ప్రకాశకులు: ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు. వెల రూ. ౫-౮-౦.

### శిల్పదర్శనము

గ్రంథకర్త: కొండూరు వీరరాఘవాచార్యులు గారు. ప్రకాశకులు: విశ్వజ్ఞ మండలి, తెనాలి. వెల రూ. ౨-౮-౦.

### ఆత్మోపహారము

కవి: బులుసు వేంకటేశ్వర్లుగారు, బి. ఏ., రామారావుపేట, కాకినాడ. వెల అ. ౮.

### రం గ వ ల్లి

పొట్టికథలు. ప్రకాశకులు: సాధన సమితి, ౬-౭౮౨ ఇమాంబావివీథి, సికిందరాబాదు. వెల పావలా.

### ఆంధ్ర రాజభక్తులు

గ్రంథకర్త: ఆండ్ర శేషగిరిరావుగారు, బి. ఏ., వెల అ. ౧౨.

### ప్ర వా సి

చిన్నకథలు. కర్త: శ్రీపతి నరసింహారావుగారు, బి. ఏ., వెల అ. ౧౨.

### ప్రేమాంజలి

టాల్‌స్థాయికథకు అనుకరణ. కర్త: ముద్దా విశ్వనాథంగారు. వెల అ. ౧౨.

పైమాటికి ప్రకాశకులు: జయనికేతనం, మద్రాసు ౭.

### ప్రసూనాంజలి

కవి: దూపాటి వెంకటకృష్ణ రాఘవాచార్యులు గారు. ప్రకాశకులు: వెంకటేశ్వర అండుకో, గుంటూరు. వెల. అ. ౮.

### ఆంధ్రదేశ గ్రామచరిత్ర (మోదుకూరు)

గ్రంథకర్త: కొడాలి లక్ష్మీనారాయణగారు. ప్రకాశకులు: మాడరన్ పబ్లిషర్సు, తెనాలి. అమూల్యము.

### కథలు - గాథలు

మూడవభాగము. రచయిత: దిగవల్లి వెంకటశివ రావుగారు, వకీలు, బెజవాడ. వెల రూ. ౩.

### మాకేలోకం

రచయిత: వసంతరావు వెంకటరావుగారు. వెల రూ. ౧.

### సినిమా జ్వరం

రచయిత: చలంగారు. వెల రూ. ౧

పైరెంటికి ప్రకాశకులు: ప్రతిమాబుక్సు, ఏలూరు.

### తత్త్వామృతము

కవి: వాజపేయయాజుల రామసుబ్బారాయుడు గారు, బి. ఏ., కొల్లాపురం, జటప్రోలు సంస్థానము. వెల రూ. ౧.


1-1-47 బుధవారంనుండి 2-వ వారము



సెలెక్టు, మదరాసు

హాస్నా బాను, యశ్వంత దవె, సయాని, చంద్రిక పాల్గొన్న దిల్ జిత్ పిక్చర్సు వారి

రాయల్ - మెయిల్

ఉద్రేకము కలిగించు ఘట్టములు, హాస్యము, సంగీతములతో కూడుకొనిన చిత్రము.

మీరు తప్పక చూడవలసినది.

10-1-47 నుండి విశాఖపట్టణం సెలెక్టులో గూడ విడుదల కాబడును.

మాండలిక హక్కులకు:

రతీలాల్ బ్రదర్సు, గాంధినగర్, బెంగుళూరు సిటీ.


Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No, 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.